శ్రీః

# అమలనాదిపిరాన్

(మునివాహనసూరి ప్రణీతమ్)

శ్రీ సేవావ్యాఖ్య
(ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

ఈ.ఏ. శింగరాచార్యులు



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 50/-

శ్రీః

# అమలనాదిపిరాన్

(మునివాహనసూరి ప్రణీతమ్)

శ్రీ సేవావ్యాఖ్య

(ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

ఈ.ఏ. శింగరాచార్యులు



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 50/-

Soia Lorma

II

# అమలనాదిపిరాన్

(మునివాహనసూరి ప్రణీతమ్)

శ్రీ సేవావ్యాఖ్య

(ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య వివరణ)

ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రథమ ముద్రణ:- స్వభాను ఉగాది, ఏప్రియల్ 2, 2003
ప్రతులు : 1000
పేజీలు : 148
వెల రూ. : 50-00


4-103, ILTD Colony Extn., Kothapet, **CHIRALA** - 523 157.
Phone : 08594-34054.

2. సాధన గ్రంథమండలి, తెనాలి-522 201
3. ఈ.ఏ. శింగరాచార్యులు, తిరుపతి



Printed at :
**KAMAL ART PRINTERS**
TENALI.

SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA



Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

JEEYAR EDUCATIONAL TRUST,
SITANAGARAM - 522 501.
GUNTUR DISTRICT. A.P.
© (08645) 272929, 272353

శ్రీమతే రామానుజాయ నమః

Dt.: తేది : 5-2-2003

# మంగళాశాసనములు

భగవంతుని కృపావిశేషము నిర్హేతుకమైనది. ఆయన సత్యసంకల్పుడు. ఒక వ్యక్తిని తీర్చిదిద్దాలని ఆయన అనుకొంటే చాలు. ఆ భగవంతుని అమోఘమైన కృప ప్రసరించడానికి ఏమి అవరోధం ఉండదు. ఆయన అనుగ్రహాన్ని పొందడానికి కులముతో ప్రమేయం లేదు. ఆ పరమాత్ముని పరిపూర్ణానుగ్రహమునకు పాత్రమైనవాడు లోకపూజ్యుడు కాగలడు అనడానికి మనకు చరిత్రలో ఎంతో మంది మహానుభావులు ఉన్నారు. శబరి, విదుర, మాలాకారాదులు. మనకు సన్నిహితసంబంధము కలిగి నిత్యారాధ్యులైన వారు ఆళ్వార్లు. భగవంతుని అవ్యాజానుకంపకు పాత్రులు కనుకనే ఆళ్వార్లందరు, మనందరికి పరమారాధ్యులయ్యారు. వారు పాడిన దివ్యప్రబంధములు నిత్యానుసంధేయములయ్యాయి. అలాంటి భక్తిసాగరనిమగ్నులయిన మహానుభావులనుండి జ్ఞానాన్ని గ్రహించండి నన్ను ఎలా ఆరాధిస్తారో వారిని (భాగవతోత్తములను) కూడా అలానే ఆరాధించండి! అని భగవానుడు 'తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథాహ్యహమ్' అని శ్రీపాంచరాత్రాగమంలో మహానుభావుల మహిమను నిరూపించుకున్నాడు. అలాంటి భగవదుపదేశానికి ప్రత్యక్షోదాహరణస్వరూపులు తిరుప్పాణిఆళ్వార్ ఒకరు. వారు, భగవంతుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళలేదు. భగవంతుడే అతిగౌరవంగా వారిని తమ సన్నిధికి చేర్చుకొన్నాడు. వీణాపాణులై వీరు నిరంతరము భగవచ్చింతనంలో ఉన్మస్తకమైన ఆనందాన్ని అనుభవిస్తూ ఉండేవారు.

పది పాశురములు గల 'అమలనాదిపిరాన్' అనే దివ్యప్రబంధాన్ని వీరనుగ్రహించారు. శ్రీరంగనాథుని విషయంలో వీరికిగల నిష్ఠ ప్రబంధైకవేద్యము. శ్రీరంగనాథుని పాదాదికేశాంతము దివ్యమంగళ విగ్రహంలో ఈ ఆళ్వార్లు తల స్పర్శగా అవగాహించి అర్చామూర్తియే మనకందరకు ఉపాదేయము, ఆరాధ్యము అనే విషయాన్ని స్పష్టముగా

వీరు ప్రబోధించారు. 'అరంగనెన్నముదినై కణ్ణ కణ్ణళ్ మత్తొన్నినై క్కాణావే' అని అర్చామూర్తిగా వేంచేసిఉన్న శ్రీరంగనాథపెరుమాళ్ళను సేవించిన నా నేత్రములు ఇక ఇతరవిషయాలను చూడవు, అని తమ అనన్యత్వమును ప్రబంధంలో నివేదించుకున్నారు. అర్చామూర్తిని ఆరాధించ చేతకాక రోజుకొకదేవతను అవలంబించి తిరిగేవారికి ఈ తిరుప్పాణిఆళ్వార్ల నిష్ఠ పరమోపాదేయము. బాగుపడాలనుకొన్నవారందరికీ వారు సంసేవ్యులు అనడంలో ఏమీ సందేహము లేదు. వారు పాడిన ప్రబంధము ఆకృతిలో చిన్నదైనా భగవంతుని పరత్వాదిగుణాలను వర్ణించడంలో దీనికి అనితరసాధారణవైలక్షణ్యమున్నది. ఇలాంటి దివ్యప్రబంధాన్ని పూర్వాచార్యులవ్యాఖ్యానుసారంగా తమ ప్రతిభాపాటవవిశేషముతో తెలుగుభాషలో వివరణమునిచ్చి జిజ్ఞాసులోకానికి అందిస్తున్న శ్రీ ఉ.వే.శ్రీమాన్ ఈ.ఎ. శింగరాచార్య స్వామివారి కృషి మిక్కిలి అభినందనీయము. ఈ గ్రంథము జిజ్ఞాసువులకు బాగుగా ఉపకరించగలదని భావిస్తూ వారికి, గ్రంథముద్రణలో సహకరించిన వారి అనుచరులకున్ను అనేకానేకమంగళాశాసనములు చేస్తున్నాము.

జై శ్రీమన్నారాయణ..!

(శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి)

# నివేదనము

**వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణిం నిచుళాపురే ।**
**శ్రీవత్సాంకం గాయకేంద్రం మునివాహన మాశ్రయే ॥**

**ద్రావిడభాషలో శ్రీవైష్ణవ భక్తివాఙ్మయము - దివ్యసూరులు :**

ద్రావిడవాఙ్మయమున సంఘయుగము, నీతిగ్రంథరచనాయుగమునకు పిమ్మట స్పష్టముగా గోచరించునది భక్తియుగము అని చెప్పవలసియున్నది. ఇది క్రీ.శ. 7,8,9వ శతాబ్దమునకు చెందినదని నవీనసాహిత్యపరిశోధకుల తలపు. ఈకాలమునందే శైవభక్తిసాహిత్యకర్తలగు నాయన్మార్లు, శ్రీవైష్ణవ భక్తివాఙ్మయస్రష్టలగు, దివ్యసూరులును అవతరించి భక్తిసిద్ధాంతమును దక్షిణభారతమున ప్రచారమొనర్చిరి. ప్రాచీనకాలమునుండి దక్షిణభారతములోని జనులు తమ, తమ మతానుసారముగా ఆ యా దైవములను ఆరాధించుచు వచ్చినను శ్రియఃపతివిషయమున తమకుగల ప్రత్యేకమైన భక్త్యతిశయమును ప్రకటించిరి. తొల్కాప్పియములో **"మాయోన్మేయ కాడుఱై ఉలకమ్"**అనుచు విష్ణువు ముల్లై (వన) ప్రదేశమునకు ప్రతినిధిగా తెలుపబడినాడు. ఇట్లే, శిలప్పదికారము మొదలగు ప్రాచీనకావ్యములలోకూడ ప్రచురముగా విష్ణుస్తుతిపరమైన వాఙ్మయము కలదు. **"పరిపాడల్"** అనుగ్రంథములో ఆఱు పర్యాయములు విష్ణువు స్తుతింపబడెను. ఇట్లు, పూర్వమునుండి వైష్ణవభక్తివాఙ్మయము ద్రావిడభాషలో విశిష్టస్థానమును ఆక్రమించినది. ఇట్టి వాఙ్మయమును సృజించిన వారిలో దివ్యసూరులు ప్రముఖులు.

**మునివాహనసూరి వైభవము :**

భగవానుని దివ్యగుణాబ్ధిలో ఓలలాడిన దివ్యసూరులు పదిమందిలో మునివాహనసూరి ఒకరు. వీరు కలియుగాది **343**వ సంవత్సరము అగు దుర్మతి వర్షమున కార్తిక మాసములోని కృష్ణపక్షద్వితీయలో రోహిణీ నక్షత్రమున ప్రస్తుత తమిళనాడులోని శ్రీరంగమునకు సమీపమునకల నిచుళాపురమను (ఉఱైయూర్) అనుచోట అవతరించి పంచమవర్ణమున పెరిగిరి. భగవానుని **శ్రీవత్సాంకము** అను పుట్టుమచ్చ యొక్క అంశచే వీరు అవతరించిరని సంప్రదాయమున

నమ్మకము. **"అథ తత్ర కులేऽంతిమే రమారమణోరఃస్థితలాంఛనాంశజః, నవమజాయత పాణసంజ్ఞకః సుకవిః కార్తికమాసి వేదభే"** అని దివ్యసూరి చరితమును పేర్కొన్నది. "వీరి కులము **"పాణ్"** కులము అగుటచే ఆపేరే వీరికి స్థిరపడినది. **పాణన్, పఱయన్, తుడియన్, కడమ్బన్"** అను కులములలో పాణ్‌కులము ఒకటి. **"పాణర్"** అనగా పాడువారు అని అర్థము అని, వీరు **"ఇశైప్పాణర్", "యాళ్ప్పాణర్", "మణ్డైపాణర్"** అను విధమున పలువురు కలరనియు తొల్‌కాప్పియము తెలుపుచున్నది. ఈ కులమువారిని సంగీతవిద్వాంసులుగా ద్రావిడసాహిత్యము పేర్కొనుచున్నది. చరిత్రకారులు ఈ దివ్యసూరి క్రీ.శ. 781వ సంవత్సరమున జన్మించిరని తెలుపుచున్నారు"- అని అమలనాదిపిరాన్ ప్రబంధమునుగూర్చి మిత్రులు శ్రీమాన్ డా॥ ఎమ్. వరదరాజన్‌గారి పర్యవేక్షణలో పరిశోధనచేసిన డా॥ ధనంజయన్ గారు తెలిపిరి. భగవత్కృప వీరిపై పరిపూర్ణముగా ప్రసరించుటచే దివ్యజ్ఞానభక్తిపూర్ణులై, ప్రతిదినము వీణను చేతగొని శ్రీరంగములోని కావేరినది దక్షిణతీరమున నిలచి, తన్మయత్వముతో కన్నులు మూసికొని, శ్రీరంగనాథుని వైభవమును దివ్యసామగానప్రక్రియలో కీర్తించుచుండిరి.

ఇట్లుండ ఒకనాడు లోకసారంగముని అను పేరుగల భగవద్భక్తులు ఒకరు శ్రీరంగనాథుని ఆరాధనకు అవసరమైన తీర్థమును తెచ్చుటకై కావేరీ నదికి పోయినపుడు అచట నిలుచుండి గానముచేయుచున్న మునివాహనసూరిని చూచి, వారు పంచమవర్ణమునకు చెందిన వారగుటచే, అప్పటి సామాజిక నియమమును బట్టి దూరముగా పొమ్మనిరి. భక్తిపారవశ్యములోనున్న ఆ దివ్యసూరికి ఈ మాటలు చెవిసోకనందున అచటినుండి కదలలేదు. అపుడు లోకసారంగముని రాయిని విసరగా, అది దివ్యసూరికి తగిలి గాయమై రక్తము కాఱెను. వెంటనే స్మృతిని పొందిన ఆమహనీయులు అచటినుండి దూరముగా తొలగిపోయిరి. ఈవిధముగా తన భక్తులైన దివ్యసూరి విషయమున అపచార మొనర్చుటచే శ్రీరంగనాయకి, శ్రీరంగనాథుడును లోకసారంగమునిపై కోపించి, వారుచేయు ఆరాధనను స్వీకరింప లేదు. ఆనాటి రాత్రి శ్రీరంగనాథుడు లోకసారంగమునికి కలలో కన్పించి, మరునాడు దివ్యసూరిని తనవద్దకు

కొనిరమ్మని ఆజ్ఞాపించెను. ఆ విధముగానే లోకసారంగముని దివ్యసూరిని మరునాడు ఆలయములోనికి కొనిపోవ ప్రయత్నింపగా, దివ్యసూరి పంచమకులజులైన తాము ఆలయములో పాదమును మోపననిరి. అపుడు లోకసారంగముని దివ్యసూరిని తమ భుజములపై ఎక్కించుకొని ఆలయమునకు తీసికొనిపోయిరి. అట్లు కొనిపోబడు దివ్యసూరి భగవత్కటాక్షముచే జ్ఞాననేత్రము ద్వారా శ్రీరంగనాథుని దివ్యరూపమును దర్శించి, **"అమలనాదిపిరాన్"** అను పాశురముతో ప్రారంభించి, పాదములనుండి శిరస్సువరకు తొమ్మిది పాశురములలో ఆరూపమును స్తుతించిరి. అప్పటికి వారు శ్రీరంగనాథుని సన్నిధానమును చేరిరి. చివరగా పదియవ పాశురమును కీర్తించి, శ్రీరంగనాథునిలో లీనమయ్యిరి. దివ్యసూరి ఇట్లు కీర్తించిన ప్రబంధమే **'అమలనాది పిరాన్'**గా ప్రసిద్ధినొందినది. ఇది ఈ దివ్యసూరి సంగ్రహచరిత్ర.

**ఇదియే 'పాదాదికేశమాలా' ప్రబంధము :**

**'అమలనాదిపిరాన్'** అను పదములతో మొదలగు ఈ ప్రబంధమునకు అదియే నిరూపకనామమయ్యెను. ఇట్టి నామకరణప్రక్రియ దివ్యప్రబంధవాఙ్మయములలోని **'పల్లాణ్డు', 'కణ్ణినుణ్ శిఱుత్తాம்బు'** ఇత్యాది కృతులలో కన్పించుచున్నది. ఈ కృతిలో శ్రీరంగనాథుని అర్చామూర్తి పాదములనుండి శిరస్సుపర్యంతము క్రమముగా వర్ణింపబడుటచే **'పాదాది కేశమాలా'** ప్రబంధమని పేరు దీనికి కల్గినది. **"దేవా శ్చరణతః పునః"** అను ఆలంకారిక సమయమును బట్టి ఆరోహణక్రమమున ఈ వర్ణన చేయబడినది. శఠకోపసూరి ప్రబంధాదులలో కొన్నిచోట్ల కిరీటాదినూపురాంతముగా అవరోహణక్రమమున వర్ణింపబడుటయు కాననగును. భక్తుడు పరమాత్మయొక్క పరత్వమును అనుసంధించినపుడు, ఆ పరత్వమునకు సూచకమైన కిరీటముతో వర్ణనను ప్రారంభించుట సంగతమైనట్లే, భక్తుడు తన స్వరూపమును అనుసంధించినపుడు భగవత్పాదములే తనకు ప్రాపకములని తలపును కల్గినవాడగును. కావున పాదములనుండి వర్ణన చేయుటయు అతనికి స్వరూపానుగుణమే అగునను పెద్దల వివరణ మిచట అనుసంధేయము. ఇట్టి

పాదాదికేశాంతము, కేశాది పాదాంతము అను ప్రక్రియలను రెండిటిని పూర్వాచార్యులు ఆదరించి, అనుసరించిరి.

**ఇది ఒక గొప్పకావ్యము :**

ఈ ప్రబంధమునందు అంతట శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యసమృద్ధి ప్రతిపాదింపబడుటచే ప్రధానముగా అంతట ఉదాత్తాలంకారము కలదని చెప్పనగును. **"తిరుక్కమల పాదమ్", "నీళ్వరైపోల్", "అన్దిపోల్ నిఱత్తాడై"** ఇత్యాది ప్రయోగములలో రూపకము, ఉపమ, **"కోరమాతవమ్ శెయ్దనన్ కొల్ ?"** ఇత్యాదులలో ఉత్ప్రేక్షయు కలవు. వేదాంతశాస్త్రప్రతిపాదితములైన పలు రహస్యార్థములు ధ్వనిప్రక్రియలో, (ముద్రాలంకారరీతిలో) కూడ సూచింపబడినవి. ఇట్లు, ఈ ప్రబంధము ఉత్తమోత్తమధ్వనికావ్యము. ఇందు ప్రతిపాద్యుడైన శ్రీరంగనాథుడే నాయకుడు, దివ్యసూరి మనస్సే నాయిక భక్తియే ప్రధానరసము.

**అమలనాదిపిరాన్ - అష్టాక్షరీమంత్రప్రతిపాదకము :**

భగవానుని నిర్హేతుకకృపవలన వ్యక్తమైన ఈ ప్రబంధమునందు పలు వేదాంతార్థములు ఇమిడియుండుట ఆశ్చర్యకరముకాదు. నాయనార్ అను ఆచార్యులు అర్థపంచక రూప వివరణమును చేసిరి. శ్రీదేశికులు ఈ ప్రబంధమునకు మునివాహనభోగమను వ్యాఖ్యను వ్రాయునపుడు, ఈ ప్రబంధములోని మొదటి పాశురము అష్టాక్షరీమహామంత్రములో, ద్వయమంత్రములో ప్రతిపాదితములైన ముముక్షుజనజ్ఞాతవ్యార్థములను పెక్కింటిని స్పష్టీకరించుచున్నదని తెలుపుచు, దాని వివరణను అనుగ్రహించిరి. అది ప్రబంధవ్యాఖ్యలోనే నిరూపింపబడుటచే పునరుక్తి అగునను భావముతో ఇచట మరల ప్రస్తావించుటలేదు. ఈ ప్రబంధములోని మొదటి పాశురము అకారముతో, రెండవపాశురము ఉకారముతో, మూడవ పాశురము మకారముతో ప్రారంభమగుటచే, వీనిని క్రమముగా ప్రణవములోని అకార-ఉకార-మకారములకు ప్రతీకలుగా గ్రహింపవీలున్నది కావున మొదటి మూడు పాశురములలో ప్రణవార్థము అనుసంధింపబడినదని శ్రీదేశికులు తెలిపిరి.

**"శదిర మామదిళ్"** అనునాల్గవ పాశురములో ఉదరబంధము వర్ణింపబడినది. అది భగవానుని దివ్యదేహములో మధ్యభాగమున నున్నది అగుటచే, స్థాన ప్రమాణమునుబట్టి అష్టాక్షరిలోని మధ్యమపదమగు నమశ్శబ్దార్థమును ఈ పాశురము వివరించుచున్నదనియు ఆ ఆచార్యులు తెలిపిరి. అట్లే, **"పారమాయ"** అనుఅయిదవ పాశురము అష్టాక్షరిలోని చివరిపదము అగు **"నారాయణాయ"** అను పదముయొక్క భావమును వ్యక్తీకరించుచున్నదనియు ఆ ఆచార్యుల అభిప్రాయము. మిగిలిన పాశురము లన్నిటియందును భగవానుని దివ్యమంగళవిగ్రహమును దివ్యసూరి సందర్శించిన వైభవము వర్ణింపబడుటచే, ఇవి ప్రణవములోని తృతీయపదార్థశేష మనదగును. పరమపదములోని నిత్యసూరులు సైతము **"సదా పశ్యంతి సూరయః"** అని భగవానుని దివ్యరూపమును దర్శించుట అను ప్రాప్యమును ఎల్లప్పుడు అనుభవించు చుందురని వేదమే పల్కినది. కావున భగవద్దివ్యరూపదర్శనమే పరమ ప్రాప్యమని తేలినది. ఆఱవపాశురమునుండి పదియవపాశురమువరకు అట్టి భగవానుని దివ్యరూప సందర్శనానుభవమే ప్రస్తుతమగుటచే ఆ పాశురములలోని ప్రమేయము ప్రణవములోని తృతీయపదార్థ శేష మనదగును. ఇట్లీ ప్రబంధము సాకల్యముగా అష్టాక్షరీమంత్రార్థ ప్రతిపాదకము అగుటచే ప్రమాణసారమగు ప్రణవము ప్రతిపాదితము. వేరొక అంశముకూడ ఇచట ప్రస్తావనార్హము. ఈ ప్రబంధములోని అయిదవ, ఆఱవ, ఏడవ పాశురముల ప్రారంభములలో విన్యస్తములైన **"పా, తు, కై"** అను అక్షరములను అదే క్రమమున యోజనచేసినచో **"పాతుకై"** అనుపదమేర్పడును. ఈ పదము సంస్కృతభాషలోని **"పాదుకా"** శబ్దమునకు సమానమగుటచే భక్తునకు పరమప్రాప్యమగు భగవత్పాదుకను నిర్దేశించుచున్నదని చెప్పనగును. అందుచే ఈ మూడుపాశురములలో ప్రాప్యము ప్రతిపాదితము. మధ్యలోనున్న **"శదిర మామదిళ్"** అను నాల్గవ పాశురప్రారంభములో గల 'చ'కారము ప్రమాణప్రమేయములను సముచ్చీకరించుచున్నది. ఈ అంశమును సుప్రసిద్ధ విద్వద్వరేణ్యులు, తమిళభాషలో బహుగ్రంథకర్తలు, ప్రకాశకులు, అగు ఉ.వే. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు (శ్రీసుదర్శన పత్రికాధిపతి)

సుస్పష్టముగా తెలిపిరి. ప్రబంధములోని మిగిలిన పాశురములు పూర్వోక్తదిశలో ప్రాప్యవివరణ మొనర్చుచున్నవి అనదగును. ఈరీతిలో కూడ ఈ ప్రబంధము అష్టాక్షరీ మంత్రార్థప్రకాశకమే.

**ద్వయ, చరమశ్లోకార్థప్రతిపాదకమును :**

**"నీళ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్"** అను ప్రయోగములోని **"నీళ్‌మదిళ్ అరఙ్గమ్"** అను పదములద్వారా ద్వయమంత్రములోని పూర్వార్ధమునగల నారాయణశబ్దార్థములలో ఒకటియగు సౌలభ్యమునకు పరమావధియైన అర్చావతారము (శ్రీరంగము) తెలుపబడినది. **"అమ్మాన్"** అనుటచే ద్వయములోని ద్వితీయార్ధమునగల నారాయణపదముయొక్క ముఖ్యార్థమగు సర్వశేషిత్వము తెలుపబడినది. **"తిరుక్కమలపాదమ్"** అనుపదము ద్వయమంత్రముయొక్క పూర్వవాక్యములోని **"చరణౌ శరణమ్"** అను పదముల అర్థమును అనుసంధించుచున్నది. ఇట్లు ప్రకృతప్రబంధములోని మొదటిపాశురమున ద్వయార్థము అనుశీలింపబడినది. "నన్నే ఉపాయముగా ఆశ్రయింపుము, నేనునీ పాపముల నన్నిటిని తొలగింతును'' అను శ్రీకృష్ణభగవానుని చరమశ్లోకార్థము **"పారమాయ పళ్ళవినై పత్ఱఱుత్తు"** అను ప్రయోగముద్వారా అనుసంధింపబడినది. కావున ఈప్రబంధము చరమశ్లోకార్థప్రతిపాదకము కూడ. ఇట్లు ఈ ప్రకృత కృతి రహస్యత్రయార్థ ప్రతిపాదకము.

**అమలనాదిపిరాన్ - శారీరకమీమాంసా సామ్యము :**

భగవద్రామానుజుల బ్రహ్మసూత్రవివరణమగు శ్రీభాష్యమునకు **శ్రుతప్రకాశికా** అను అత్యంత విపులమైన రమణీయ వ్యాఖ్యను వెలయించిన శ్రుత ప్రకాశికాచార్యులవారు వ్యాఖ్యానారంభములో **"ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగ మివాపరమ్"** అనుచు శ్రీరంగవిమానమునకు ప్రణవాకారత్వము కలదనిరి. ఆ విమానములో అధివసించియున్న శ్రీరంగనాథుని మూర్తికికూడ అర్థవశమున ప్రణవాకారత ఉండుట మిక్కిలి సుసంగతము. ఇక, ఈ ప్రబంధము శారీరకమీమాంసాశాస్త్రప్రమేయముతో పోలియుండుటయు గమనార్హము.

శారీరకమీమాంసాశాస్త్రము క్రమముగా **"కారణత్వ- మబాధ్యత్వ-ముపాయత్వ-ముపేయతా"** భగవానుని జగత్కారణత్వము, ఆ కారణత్వము ఆబాధితమగుట, ఆ భగవానుడే ఉపాయమగుట, ఉపేయమగుటయు అను నాల్గు అంశములను ప్రమేయముగా కల్గియున్నదని పెద్దలు పల్కిరి. ఈ ప్రబంధములో కూడ మొదటి పాశురములోని **"ఆది"** అను విశేషణము భగవానుని నిరుపాధికజగత్కారణత్వమును తెలుపుచున్నది. కావున దానిచే బ్రహ్మసూత్రములలోని మొదటిఅధ్యాయ ప్రమేయమగు జగత్కారణత్వము సూచితము. మూడపాశురములో **"అయనై పడైత్త దోరెళ్లిల్ ఉన్ది"** అనుచు సమస్త సృష్టికర్తయగు బ్రహ్మకు సైతము ఉత్పత్తి కారణము స్వామియే అనుటచే భగవానుని సమస్త కారణత్వము అబాధితమగు చున్నది. దీనిచే కాపిలాది మతాంతరములచే ప్రసక్తములైన ప్రకృతేః కారణత్వాదులును నిరస్తములు. అందుచే బ్రహ్మమీమాంసలోని ద్వితీయాధ్యాయప్రమేయము అగు అబాధ్యత్వము దీనిచే సూచితము. **"పారమాయ", "తుణ్డవెణ్ పిఱైయన్", "కైయినార్"** అను తదనంతరపాశురములలోని మొదటిఅక్షరములద్వారా సూచింపబడిన స్వామి పాదుకయే ప్రపన్నునకు ఉపాయమగుటచేత, ఆగాథలచే ఉపాయత్వము ప్రతిపాదితము. మిగిలిన మూడుపాశురములలో పూర్వోక్తప్రకారమున ఉపేయమగు భగవద్దివ్యమంగళ సందర్శనరూపప్రాప్యము ప్రస్తుతము. కావున ఉపేయత్వము ప్రతిపాదితము. ఇట్లు, ఈ ప్రబంధములో క్రమేణ బ్రహ్మమీమాంసాప్రమేయము స్మారితము.

బ్రహ్మమీమాంసాశాస్త్రమునకు శారీరకమీమాంసాశాస్త్రమను పేరుకలదు. చిదచిత్తులను రెండిటిని శరీరముగాకల భగవానుని గూర్చిన మీమాంస అందు చేయబడుటచే దానికట్టి పేరు కల్గెనని పెద్దలందురు. ఈ ప్రబంధముకూడ భగవానుడైన శ్రీరంగనాథుని దివ్యశరీరమును వర్ణించునది కావున శారీరకమీమాంసాసాదృశ్యము దీనికి కలదని చెప్పనగును. శ్రీపిళ్లైలోకాచార్యుల వారు అష్టాక్షరిలోని నారాయణపదమునందలి నార శబ్దముచే భగవానుని దివ్యమంగళవిగ్రహము చెప్పబడుచున్నదనగా, ఆ సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీవరవరమునులు ఈ పదము పరమపదములోని భగవానుని దివ్యతేజోమయ

రూపమునే కాక, స్వామి తన ఇచ్ఛతో పరిగ్రహించు రూపముల నన్నిటిని తెలుపుననిరి. కావున శ్రీరంగములోని శ్రీరంగనాథుని అర్చామూర్తికూడ నారశబ్దవాచ్యమే కదా ! ఇట్టి శ్రీరంగనాథుని దివ్యరూపవైభవమును వర్ణించు ఈ ప్రబంధము శారీరకమీమాంసయే అగును.

**అమలనాదిపిరాన్ -శ్రీభాష్యసామ్యము :**

భగవద్రామానుజుల శ్రీభాష్యమునకును, ప్రస్తుతప్రబంధమునకు కల సాదృశ్య మిచట అవశ్యము భావనీయము. ఎట్లనగా- ఉపనిషద్భాష్యకారులగు శ్రీరంగరామానుజమునులు అనుగ్రహించిన శ్రుతప్రకాశికావ్యాఖ్య అగు భావప్రకాశికాగ్రంథమునకు పీఠికను వ్రాయు ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవాచార్యస్వామివారు శ్రీభాష్య-ప్రణవములు రెండును జీవుని అనన్యార్హశేషత్వమును, భగవానుని నిరుపాధిక శేషిత్వమును ప్రకాశింపచేయునవి అగుటచే అర్థతః పరస్పరసదృశములను శ్రీరంగరామానుజ సూక్తిని విశదీకరించుచు, వానిమధ్య శబ్దతః సాదృశ్యమును కలదనిరి. శ్రీభాష్యప్రారంభము **"అఖిలభువనజన్మ"** అని అకారముతో, సమాప్తి **"ఇతి సర్వం సమంజసమ్"** అని మకారముతో చేయబడుట ప్రత్యక్షసిద్ధము. ప్రథమాధ్యాయ చతుర్థపాదముయొక్క భాష్యారంభము **"ఉక్తం హి"** అని ఉకారఘటితముగా చేయబడినది. **"శ్రీభాష్యస్య అకారేణోపక్రమః, మకారోప సంహార శ్చ స్పష్టా వేవ, ప్రథమచతుర్థారంభగతమ్ ఉకారమ్ మధ్యమం కృత్వా ఆదిమధ్యావసానేషు ప్రణవఘటకాకారోకారమకారశాలితయా శ్రీభాష్యస్య ప్రణవాకారత్వమ్"** అను అచటి వాక్యము స్మరణీయము. ఇట్లు శ్రీభాష్యమునందు ప్రణవములోని అక్షరములుమూడు క్రమానుసారముగా నిక్షిప్తములైనవి. ఈ విధముగానే శ్రీరామాయణమున గాయత్రీ మంత్రాక్షరములు వరుసగా విన్యస్తములగుట గమనార్హము. ప్రణవ-శ్రీభాష్యసాదృశ్యమువలె, ప్రణవ-ప్రకృత ప్రబంధసాదృశ్యముకూడ పూర్వోక్తమే. కావున శ్రీభాష్య-ప్రకృతప్రబంధ సాదృశ్యమును సిద్ధము. వేఱొకవిధముగా కూడ ఈ ప్రబంధమునకు శ్రీభాష్యసామ్యము కలదని చెప్పవచ్చును. శ్రీరామానుజులు **"పారాశర్యవచస్సుధామ్"** అనుశ్లోకములో **"నిజాక్షరైః ఆనీతాం పారాశర్య**

**వచనస్సుధామ్**" అనుచు తమ భాష్యము అమృతమువంటిదనిరి. ఈ దివ్యసూరియు ప్రబంధముచివరలో "**అరఙ్గన్ ఎన్నముదినై క్కణ్డకణ్గళ్**" అనుటద్వారా శ్రీరంగనాథుని సుధాసామ్యమును తెలిపిరి. ఈ అమృతము దివ్యసూరి సూక్తి దుగ్ధాబ్ధినుండి పుట్టినదే కదా !

ఈ ప్రబంధములోని మొదటిపాశురములలో ప్రయోగింపబడిన "**అమలన్**", "**విమలన్**", "**నిమలన్**", "**నిన్మలన్**" అనుపదములలో గల నఞ్ల ద్వారా పలు విశేషార్థములు వ్యక్తమగుచున్నవని అభిజ్ఞుల అభిప్రాయము. విస్తరభయముచే ఆ అంశ మిచట విడువబడినది.

**అమలనాదిపిరాన్ - స్తోత్రవాఙ్మయము :**

ఈ దివ్యప్రబంధమును అనుసంధించి తన్మయులైన శ్రీదేశికులు '**భగవద్ధ్యానసోపానమ్**' అను స్తోత్రమును రచించిరని పెద్దలందురు. ఇందులకు ఆ స్తోత్రములోని పలుప్రయోగములు తార్కాణములు. ఆస్తోత్రములోని "**శ్రీవత్సేన ప్రథితవిభవం శ్రీపదన్యాసధన్యమ్**" అను దేశికసూక్తి ప్రస్తుత ప్రబంధములోని "**తిరుమఱుమార్బు**" అనుసూక్తిని, "**నాళీకేన స్ఫురితరజసా వేధసో నిర్మిమాణా**" అను దేశికప్రయోగము "**అయనైపడైత్త దోరెళ్ళిల్**" అను సూక్తిని, "**స్వాంతే గాఢం మమ విలగతి స్వాగతోదారనేత్రమ్**" అను దేశిక సూక్తి "**అప్పెరియవాయ కణ్గళ్ ఎన్నై ప్పేదమై శెయ్దనవే**" అను ప్రస్తుతప్రబంధసూక్తిని అనుసరించి ప్రయోగింపబడినవనుట సుస్పష్టము. ఇట్టి భావసామ్యములు అనేకములు. ఇంతియే కాక పలువురు పూర్వాచార్యులు తమతమ స్తోత్రములలో ఈ ప్రబంధములోని మధురభావములను సాదరముగా స్వీకరించిరని పెద్దలందురు. శ్రీకృష్ణసూరివరులు, నాయనార్ అను ఆచార్యవర్యులు అనుగ్రహించి మణిప్రవాళవ్యాఖ్యలు, శ్రీదేశికుల మునివాహనభోగమను వ్యాఖ్యయు ప్రస్తుతవ్యాఖ్యానమున అనుసరింపబడినవి. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు ప్రాచ్యపరిశోధనాసంస్థభవనమునకు ఈ దివ్యసూరి పేరును పెట్టుటయే కాక, ఆ సంస్థద్వారా దేశికుల మునివాహనభోగ వ్యాఖ్యను ఆంధ్రీకరించి ప్రకటించిరి.

**ఉపసంహారము :**

దివ్యసూరుల ప్రబంధవాఙ్మయమునకే తలమానిక మనదగిన ఈ కృతికి వ్యాఖ్యానమును వ్రాయుటకు ప్రయత్నింపవసినదిగా మిత్రమహోదయులు, ఆస్తిక వదాన్యశేఖరులు, విశేషించి శ్రీరంగనాథుని పట్ల అత్యంతము భక్తిని కలవారు చీరాల వాస్తవ్యులును అగు **శ్రీ ఆర్. మోహనరావుగారు** నన్ను పలుమార్లు ప్రోత్సహించిరి. వారి అభిమానప్రోత్సాహసహకారములే ఈ వ్యాఖ్యకు మూలకారణములు. వారి విషయమున నాకుకల స్నిగ్ధమైన కృతజ్ఞతాభావమును ఇట్లు మాటలతో తెలుపుకొనుటకంటె వేరేమిచేయగలను ? వారికి, వారి కుటుంబసభ్యు లందఱికిని సకలశ్రేయస్సులు సమకూర్చవలెనని హృదయ పూర్వకముగా శ్రీరంగనాథుని వేడుచున్నాను. నా ఈ ప్రయత్నమున సదా నావెంట నిలిచి, మార్గదర్శనమును కావించి, **"స్ఖలిత్యే శిక్షితారమ్"** అనురీతిలో తప్పులనునరిదిద్ది, ముందుకు నడిపిన అస్మదాచార్యవర్యులు, **న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి** దివ్యసన్నిధిలో సవినయముగా ప్రణామాంజలులను సమర్పించుకొనుచున్నాను. ప్రార్థించిన వెంటనే కాదనక మంగళాశాసనములను కృపచేసిన శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్నశ్రీమన్నారాయణజీయర్ స్వామివారి సన్నిధిలో కృతజ్ఞతలను నివేదించుకొనుచున్నాను. ఈ వ్యాఖ్యను ప్రబంధకర్తయగు మునివాహన సూరివరుల సన్నిధిలో భక్తిపూర్వకముగా నివేదించుకొనుచు, దీనిని సావధానముగా కటాక్షింపవలసినదిగా సహృదయపాఠకులను వేడుచున్నాను.

**శ్రీవత్సాంశేన జాతాయ శ్రీపాణాఖ్యాయ యోగినే ।**
**మహాభాగవతాయాఽస్తు మునివాహాయ మంగళమ్ ॥**

**శ్రీపాణయోగిసత్కావ్య వ్యాఖ్యా మాంధ్రగిరాఽకరోత్ ।**
**శ్రీసేవాం శింగరార్యోఽసౌ స్వాచార్యకరుణాబలాత్ ॥**

**క్షమ్యతాం సాహసం చైత ద్విద్వద్భి ర్గుణలోలుపైః ।**
**యద్యత్ర సౌష్ఠవం కించిత్ తదాచార్యకృపాఫలమ్ ॥**

ఇట్లు
భాగవతవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

15

మునివాహనసూరిప్రణీతమైన

# అమలనాదిపిరాన్

### (పాదాదికేశమాలాప్రబంధము)

### తనియన్ (ముక్తక ప్రార్థనాశ్లోకము)

### మహాపూర్ణార్యప్రణీతము

1. **ఆపాదచూడ మనుభూయ హరిం శయానం**
**మధ్యే కవేర దుహితు ర్ముదితాంతరాత్మా ।**
**అదృష్టతాం నయనయో ర్విషయాంతరాణాం**
**యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్ ॥**

యః = ఏ మునివాహనసూరి, కవేరదుహితుః = కావేరీనదియొక్క, మధ్యే = మధ్యభాగములో, శయానమ్ = పరుండియున్న, హరిమ్ = శ్రీరంగనాథుని, ఆపాదచూడమ్ = పాదములనుండి శిరస్సుపర్యంతము, అనుభూయ = (దర్శించి) ఆనందించి, విషయాంతరాణామ్ = (ఆ భగవానుడు తప్ప) మిగిలిన విషయములను (యొక్క)ను, అదృష్టతామ్ = దర్శింపకుండుటను, నిశ్చికాయ = నిశ్చయించెనో, తమ్ (మునివాహనమ్) = అట్టి అప్రమేయవైభవమునుకల మునివాహనసూరిని (లోకసారంగమునిని వాహనముగా కలవారిని), మనవై = ధ్యానింతును.

కావేరీనదీమధ్యభాగములోగల శ్రీరంగ క్షేత్రమున శ్రీరంగనాథుడు శయనించియున్నాడు. ఆ స్వామి దివ్యరూపమును పాదములనుండి శిరస్సువరకు కన్నులార దర్శించి, ఆనందించిన మునివాహనసూరి, పిమ్మట తాము వేరొక

విషయమును దేనిని దర్శింపకుండుటను నిశ్చయించి పల్కిరి. అట్టి భక్తిప్రకర్షను కల ఆదివ్యసూరిని నేను ధ్యానింతును.

వ్యాఖ్య :- ఇందు "గరుత్మంతుని వాహనముగా కలవాడు ఉండగా" (శ్రీ. ప్ర.- 10) అనియు, "అందమైన టెక్కలను కల గరుడుని అధిరోహించి నడచు భగవానుని నేను దర్శించినది శ్రీరంగములో" (కలివైరి. సూ. 5-6-6) అనియును దివ్యసూరులు పల్కురీతిలో శ్రీరంగనాథుని సేవించి, ఆనందించిన మునివాహనులను మనస్సున ధ్యానించుట ఇందు తెలుపబడుచున్నది. అశేషశేషియైనవానియొక్క గరుడవాహనత్వము, శేషశాయిత్వము, శ్రియః పతిత్వమును సర్వాధికవస్తువునకు (భగవానునకు) లక్షణములు. ఇట్టి సర్వాధికునియొక్క సర్వావయవములను సక్రమముగా దర్శించు తీరు ఇందు తెలుపబడినది.

**ఆపాదచూడమ్** - పాదాదికేశాంతము,

**అనుభూయ** - 'అమలనాది పిరాన్' ఇత్యాదిగా సేవించి,

**హరిం శయానమ్** - **'శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః'** (రా.యు. 38-25) అనురీతిలో శయనించియున్నవాడు. శయనించియున్న స్థితిలోనే "బలముగల అసురుల ప్రాణములను అన్నిటిని హరించిన" (శఠ. సూ. 7-2-3) అని పొగడబడునట్టివాడు కదా స్వామి ! **"హరతీతి హరిః"** అని కదా హరిశబ్దవ్యుత్పత్తి. అనుకూలుర మనస్సును, ప్రతికూలుర ప్రాణములను హరించువాడని ప్రకృతమున ఈ పదసమన్వయము. అనుకూలుర (భక్తుల) దృష్టి చిత్తాపహరణమును చేయువాడైయుండుట. ఎట్లనగా "నిద్రించు అద్వితీయమైన స్థితినిదర్శించినను ఏవిధముగా మఱచి బ్రతుకగలను" (శ్రీ. ప్ర. -23) అని, "సౌందర్యముచే పూర్ణమైన అలంకారము ప్రకాశించునట్లు పరుంటివి; నేను దర్శించితిని" (శఠ. సూ. 5-8-1) అని ఇత్యాదిగా దివ్యసూరులు పల్కిన రీతిలో శయన సన్నివేశముద్వారా భక్తుల తాపమును తీర్చువాడు, వారి మనస్సులను కొల్లగొట్టువాడు. శ్రీరంగనాథుడు శేషశాయికదా ! ఇట్లు శయనించి అనుకూల-ప్రతికూలుర రక్షణ-శిక్షణలను చేయువానిని- అని అర్థము.

**కవేరదుహితు ర్మధ్యే** - కావేరీ మధ్యదేశములో అని భావము. "గంగ కంటె పవిత్రమైన కావేరీనది మధ్యలో" (శ్రీ.ప్ర- 23) లో కదా శ్రీ రంగనాథుడు శయనించియున్నది **"వణ్పొన్ని"** (కులశేఖర సూ. 2-3) అనబడు కావేరీనది తన కెఱటములను చేతులతో పాదములను సేవింపగా శ్రీపతి ఆనందముతో కన్నులు మూసికొని నిద్రించును. ఇట్లు **"కవేరదుహితు ర్మధ్యే శయానమ్ హరిమ్ ఆపాదచూడమ్"** అని చెప్పదగినట్లు ఈ దివ్యసూరి "సముద్రవర్ణుడు, సర్వేశ్వరుడు అగు నాస్వామి పడమటిదిశలో శిరస్సును పెట్టి, తూర్పున పాదములను చాచి, ఉత్తరమున వెనుక భాగమును చూపి, దక్షిణదిక్కులో లంకను కటాక్షించుచు అనంతునిపై శయనించుటను దర్శించి" (శ్రీ.ప్ర.- 19) అనుభవించిరి - అని భావము.

**ముదితాంతరాత్మా** - ఇట్లు దర్శించి, ఆనందించినవారయ్యిరి. "మనస్సు సంతసించినది" (భూత సూ. 32) అని వేరొక దివ్య సూరియు పలికిరి కదా ! ఇంతటితో ఆగక -

**అదృష్టతాం నయనయో ర్విషయాంతరాణామ్** - అనునట్లు వేరొకదాని యందు దృష్టిలేనివారయ్యిరి. వీరు శ్రీరంగనాథునియందు అస్తమితాన్యభావమునుకల్గియుండుట **"అణియరఙ్గనెన్నముదినై క్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** అనుటచే తెలుపబడినది **"ఏతదేవామృతం దృష్ట్వా తృప్యంతి"** (ఛాందో 3-6) అని, "శ్రీరంగమును వాసస్థానముగా చేసికొనిన చెఱకువంటి మదురరసరూపిని దర్శించి, నాకన్నులజంట ఆనందించు రీతిఏమి?" (శ్రీ.ప్ర.17) అని, **"రామంమేఽనుగతా దృష్టిః" (రా.అయో. 542-34), "న త్వా పశ్యామి"** అనియు కదా శ్రీ రాముని సౌందర్యమున మునిగినవారు తన్మయత్వముతో పల్కు మాటలు. వీరికి స్వామి సౌందర్యము అజ్ఞానమును కల్గించినది. అదృష్టము (పరమాత్మ స్వరూపము) దృష్టమైనదగుటచే, దృష్టము (కన్పించు బాహ్య ప్రపంచము) అదృష్టమైనది (కనుపించనిది) అయినది. లేక, "నా మనస్సు వెరొక వస్తువులో ఉద్దేశ్యబుద్ధిని లేకుండుటను పొందినది"

(శఠ.సూ.-7-10-10) అని, **"భావో నాన్యత్ర గచ్ఛతి"** (రా. ఉత్తర. 46-15) అనియు పరత్వాదులు దివ్యసూరికి పరోక్షవిషయములు అయ్యెను అర్థము. **"కట్కిలీ"** (బాహ్య చక్షువులకు గోచరింపనివాడా శఠ.సూ. 7-2-3) అను రూపమును కదా వీరు నేత్రములతో దర్శించి ఆనందించిరి. తాను కాననిరూపము కూడా (అంతర్యామియు) దర్శించినవస్తువులో (శ్రీరంగనాథునియందు) కలదు కదా! ఇట్లు కవి స్వామి యొక్క **"మైప్పడిమేని"**ని (నల్లని కాటుకవంటి రూపమును- తిరువిరు. 94) దర్శించి, అన్యవిషయములను చూడని కన్నులను కల్గియుండుటను ఈ ప్రయోగము తెల్పుచున్నది.

**యో నిశ్చికాయ మనసై మునివాహనమ్ తమ్** - ఎవరు **"కణ్డకణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** అని నిశ్చయించుకొనిరో అట్టి మునివాహనులను,

**మనసై** - మనస్సున ధ్యానింతును "బ్రహ్మ పుష్పములను సమర్పించి నమస్కరించి నృత్తించునట్లు'' (కలివైరి.సూ. 4-2-6) అనురీతిలో హంసవాహనుడైన చతుర్ముఖుడు బహుముఖముగా శ్రీరంగనాథుని అనుభవించెను, మునివాహనులైన వీరును ఏకముఖముగా రెండుకన్నులతో అనుభవించిరి. బ్రహ్మదేవుడు - **''కిరీటకేయూరకరత్నకుండలం ప్రలంబముక్తామణి- హేమభూషితమ్, విశాలవక్షఃస్థలశోభికౌస్తుభం శ్రియా చ దేవా౽ధ్యుషితోరు- విగ్రహమ్, ప్రతప్తచామీకరచారువాససమ్, సుమేఖలానూపుర శోభితాంఘ్రికమ్, సుబంధునీజాతమృణాళకోమలం దధాన మచ్ఛచ్ఛవియజ్ఞ-సూత్రకమ్ భుజో పధానం ప్రసృతాన్యహస్తం నికుంచితోత్తానితపాదయుగ్మమ్, సుదీర్ఘ ముర్వం సముదగ్రవేషం భుజంగతల్పం పురుషం దదర్శ"** (హస్తిగిరి మాహాత్మ్యమ్) అనురీతిలో అభిమాని యగుటచే, శిరస్సునుండి పాదములవరకు అవరోహణ క్రమములో అనుభవించెను. వీరు దాసులగుటచే పాదములనుండి ఆరోహణ క్రమములో అనుభవించిరి. బ్రహ్మదేవుడు శ్రీరంగనాథుని దర్శించిన పిమ్మట బాహ్యవిషయములనుకూడా దర్శించెను;

కాని వీరు **"తిరుక్కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్ళన"** అని దర్శించిన పిమ్మట, **"కణ్డకణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** అనుచు వేరొక విషయమును దర్శింపరైరి. ఏ విధముగానైనను వీరికి సరిపోడు.

ఇట్లు తమకు మనఃప్రీతి కల్గునట్లు శ్రీరంగనాథుని రూపమును అనుభవించిన అదివ్యసూరిని **'మనవై'** అనుచు మనఃప్రీతి జనించునట్లు మనస్సుతో సేవించు రీతి ఈ శ్లోకమున తెలుపబడినది.

ఈ ప్రార్థనాశ్లోకము మహాపూర్ణులనబడు ఆచార్యవర్యులచే రచింపబడినది. వీరు భగవద్రామానుజులకు చక్రాంకనమును ప్రసాదించిన ఆచార్యులు. శ్రీరామానుజులను చోళరాజు బారినుండి కాపాడగోరి కూరేశులతో పాటు రాజ్యసభకు వెడలిరి. ఆ రాజు విధించిన శిక్షవలన నేత్రములను కోల్పోయి, అందుచేగల్గిన బాధకారణముగానే తనువు చాలించిరి. ఇట్లు దర్శనమురక్షణము కొఱకు తమ దర్శనద్వయమునేకాక, తమ ప్రాణములను కూడా త్యాగముచేసిన మహనీయులు వీరు.

2. **కాట్టవే కణ్డ పాదకమల నల్లాడై యున్ది**
**తేట్టరు ముదరబందమ్ తిరుమార్బు కణ్డమ్ శెవ్వాయ్**
**వాట్టమిల్ కణ్గళ్ మేని ముని యేఱి త్తనిపుకున్దు**
**పాట్టినాల్ కణ్డు వాళ్లుమ్ పాణర్‌తాళ్ పరవినోమే**

కాట్టవే = (శ్రీలోకసారంగమునులు తను భుజములపై మోయుచు తీసికొనివచ్చి) చూపగా, కణ్డ = దర్శించిన, కమలపాదమ్ = పాదారవిందములను, నల్లాడై = చక్కని పీతాంబరమును, ఉన్ది = (బ్రహ్మకు జన్మస్థానమైన) నాభిని, తేట్టరుమ్ = అరుదైన రత్నములు పొడిగిన, ఉదరబంధమ్ = మొలత్రాడును, తిరుమార్బు = లక్ష్మీదేవికి నిలయమైన వక్షఃస్థలమును, కణ్డమ్ = కంఠమును, శెవ్వాయ్ = ఎఱ్ఱని అధరమును, వాట్టమిల్ = వాడని (తామరలవంటి), కణ్గళ్ = నేత్రములను, మేని = (ఇట్టి దివ్యావయవములతో కూడిన) దివ్యరూపమును, ముని యేఱి = లోకసారంగమునిని అధిరోహించి, తని

వు కున్దు = ఒంటరిగా (ఆలయమును) ప్రవేశించి, పాట్టినాల్ = ద్రావిడపాశురములతో, కణ్డువాళ్ళుమ్ = దర్శించి, ఉజ్జీవించు, పాణర్ = **"తిరుప్పాణ్"** అనబడు మునివాహనసూరి, తాళ్ = పాదములను, పరవినోమే= స్తుతించితిమికదా !

లోకసారంగముని తన భుజములపై నెక్కించుకొని శ్రీరంగాలయములోనికి తీసికొనిపోగా, మునివాహనసూరి క్రమముగా శ్రీరంగనాథుని పాదారవిందములను, చక్కని పీతాంబరమును, బ్రహ్మపుట్టిన చోటగు నాభిని, మనోజ్ఞమైన, అరుదైన మొలనూలును, లక్ష్మీవాసమైన వక్షఃస్థలమును, కంఠమును, ఎఱ్ఱని అధరమును, వాడని తామరలవంటి కన్నులను కల అందమైన శ్రీ రంగనాథుని దివ్యమంగళవిగ్రహమును మునివాహనులై ఒంటరిగా ఆలయమున ప్రవేశించి, దర్శించి, ఆనందించిరి, లోకానుగ్రహార్థము ఆ ఆనందమును పాశురమాల రూపమున వెలువరించిన మునివాహన సూరి పాదములను స్తుతించితిమి కదా ! ఎంత అదృష్టము.

ప్రకృతప్రబంధకర్తను స్తుతించు ఈ గాథను రచించిన ఆచార్యులు తత్కర్త మునివాహనసూరి శ్రీరంగనాథుని పాదములనుండి శిరస్సువరకు దర్శించినవిధమును సంగ్రహముగా ప్రస్తావించుటద్వారా ప్రబంధప్రమేయము సూచించిరి. ఈ గాథను రచించినవారు భగవద్రామానుజుల ఆచార్యులలో ఒకరగు శ్రీశైలపూర్ణులు అనబడు తిరుమలనంబి. వీరు రామానుజులకు సాక్షాత్తు మేనమామ. వీరు శ్రీవేంకటేశ్వరుని ఆరాధనకు అవసరమయిన జలమును ఆకాశగంగనుండి తెచ్చు సేవను చేసెడివారు. ఒక సంవత్సరకాలముపాటు తిరుమల కొండమెట్ల ప్రారంభమగు చోటు అగు అలిపిరి వద్ద భగవద్రామానుజులకు శ్రీరామాయణములోని సంప్రదాయ రహస్యార్థములను బోధించిరని చరిత్ర తెలుపుచున్నది. ఈ ఆచార్యుల ఆలయము తిరుమలలో దక్షిణ వీధిలో నెలకొనియుండుటను ఇప్పటికిని గమనింపవచ్చును.

**కాట్టవే కణ్డపాదమ్** - ఈ ప్రబంధమును అనుసరించియే

శ్రీపరాశరభట్టరువారు శ్రీ రంగరాజస్తవములోని శ్రీరంగనాథుని దివ్యావయవ వర్ణనను చేసిరి. ఉదాహరణకు ప్రస్తుత కృతిలోని **"అరజ్గత్తమ్మాన్ తిరుక్కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్లన వొక్కిన్దవే"** అనుటను అనుసరించి శ్రీరంగరాజస్తవములోని **"శ్రీరంగేశయపాదపంకజయుగమ్"** (పూర్వ. 125) అను ప్రయోగము చేయబడినది.

**నల్లాడై** - **"అరజ్గత్తమ్మా వరైచ్చివన్ద వాడై"** అనుట **"రంగధురంధరుని"** (119) పీతాంబరమును తెలుపుచున్నది.

**ఉన్ది** - **"అరజ్గత్తరవినణైయాన్ - అయనైప్పడైత్తతోరెళ్థిల్ ఉన్ది"** అనుట **"విధిశివమూలమైన నాభీపద్మము"** (116) ను సూచించుచున్నది.

**తేట్టరు ముదరబందమ్** - **"తేట్టరుమ్ తిఱల్ తేన్"** (అరుదైన, తనను అనుభవించుటకు బలమునిచ్చు తేనె - కులశేఖర నూ. 2-1) అయిన శ్రీరంగనాథుని అరుదైన ఉదరబంధము. **"అరజ్గత్తమ్మాన్ తిరువయిఱ్ఱుదరబందమ్"** అని **"పట్టం కిలోదరబంధమ్"** (115) అని కీర్తింపబడిన ఉదరబంధమిది.

**తిరుమార్బు** - **"అరజ్గత్తమ్మాన్ తిరువారమార్బు"** అనుట **"లక్ష్మీ లలిత గృహమైన"** (111) వక్షఃస్థలమును చెప్పుచున్నది.

**కణ్డమ్** - **"అరజ్గనకర్మేయవప్పన్ మఱ్ఱుముణ్డ కణ్డమ్"** అనుట శ్రీరంగనాథుని కంఠమును తెలుపుచున్నది.

**శెవ్వాయ్** - **"అణియరజ్గనార్. . .శెయ్యవాయ్"** అనుట, **"అధర మధురాంభోజమ్"** (103) అను అరుణాధరపల్లవమును తెలుపుచున్నది.

**వాట్టమిల్ కణ్గళ్** - క్షణోజ్జ్వలములైన తామరపూవులకంటె విలక్షణములై, సదైకరూపరూపములై. **"అరజ్గత్తమలన్ముకత్తు క్కరియవాకి పుడైపరన్దు మిళిర్న్దు శెవ్వరియోడు నీణ్డ వప్పెరియవాయకణ్గళ్"** అనుట, **"విశాలస్ఫీతాయద్రుచిర-శిశిరాతామ్రధవళ"** (99)ములైన శ్రీరంగప్రణయి నయనాబ్జములను తెలుపుచున్నది.

**మేని** - ఇట్టి దివ్యమంగళవిగ్రహమును,

**ముని యేటి** - మునివాహనులై,

**తనిపుకున్దు** - ఈ మహాభోగములో తాము ఒంటరిగా ప్రవేశించి,

**పాట్టినాల్** - తన అనుభవమును వ్యక్తీకరించుచు పద్యములను పాడిన, అనగా - **"అమలనాదిపిరాన్"** అను ప్రబంధపాశురములద్వారా **"అణ్డర్కోన్ అణియరఙ్గన్"** ను దర్శించి ఉజ్జీవించినవారైరి. పిమ్మట ఈ అనుభవమునకు భట్టరు దేశికు లయ్యిరి.

**పాట్టినాల్ కణ్డు వాళుమ్** - దర్శనమే ఉజ్జీవనముగా జీవించు,

**పాణర్ తాళ్** - వీణాపాణియై, శ్రీరంగనాథుని పాదసన్నిధిలో నిరంతర సేవను చేయునట్టి తిరుప్పాణ్ అను దివ్యసూరి పాదములను,

**పరవినోమే** - స్తోత్రము చేసితిమి. అలభ్యలాభమైనది పొందగల్గితిమి. ఇకపై ఎట్టి కొఱతయులేదు అని తాత్పర్యము.



# ప్రబంధావతారిక

**"ఓమ్"** అనబడు ప్రణవమువలె అతిసంగ్రహముగాకాక, వేదమువలె, **"వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః"** అని, **"వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్"** (భార. ఆది. 64-131) అనునట్లు ఆ వేదార్థమును విశదీకరించుటకై ప్రభవించిన శ్రీరామాయణమువలె, మహాభారతమువలె మిక్కిలి విస్తృతముగాకాక, నాతిసంగ్రహముగా, నాతివిస్తృతముగా పది పాశురములను (పద్యములను) ఈ కృతి కల్గియున్నది, శ్రీరామాయణ, మహాభారతములలో ప్రారంభమున తత్కర్తలు **"నారాయణకథా మిమామ్"** (భార. ఆది. 1-27) అని నారాయణకథను వర్ణింతునని పల్కినను, భగవత్కథలుకానివియైన గంగా - గాంగేయాది వృత్తాంతములను అభివర్ణించిరి. శఠకోపసూరి ప్రణీతమైన

తిరువాయ్‌మొఴ్రి అన్నచో **"అమర్‌శువై ఆయిరమ్"** (రసపూర్ణమైన సహస్రము- శఠ. సూ. 1-3-11), "పాలతో కూడిన అమృతము అనదగిన సహస్రము" (శఠ.సూ. -8-6-2) అనునట్లు వేయి పద్యములను కల్గియుండుటయేకాక, అన్యాపదేశము, స్వాపదేశము, దూతప్రేషణములు, సామానాధికరణ్యమును నిర్ణయించుట, త్రిమూర్తి సామ్యము, అంతకుమించి తత్త్వములను గుప్తముగా ఉపదేశించుట - మొదలగు క్లేశములు ఆ ప్రబంధమందు కలవు. అందుచే అది అందఱిచే సులభముగా తెలుసుకొన వీలుకానిది. కలివైరిసూరి రచించిన తిరునెడున్దాణ్డకము అను ప్రబంధము విస్తృతమైనదికాక, కేవలము 30 గాథలను కల్గినదే అయినను, మాతృభావన, సఖీభావన, నాయికాభావన మొదలగు పలు రీతులలో కవి అందు పల్కుటచే తిరువాయ్‌మొఴ్రి వలెనే ఇదియును దుర్గ్రహము. భక్తాంఘ్రిరేణుసూరి విరచించిన తిరుమాలైప్రబంధము ఈ క్లేశములను వేనిని లేనిది అయినను, కవియొక్క లాభాలాభములవలన ఏర్పడిన ప్రీతి - నిర్వేదములతో కూడియున్నది. భట్టనాథులు అనుగ్రహించిన తిరుప్పల్లాణ్డు అనుకృతి ఇట్టి దోషములను కల్గినది కాకున్నను, ఐశ్వర్యార్థులు, కైవల్యార్థులు, భగవచ్ఛరణాగతులు - అను మూడు విధములైన అధికారుల గుణదోషములనుగూర్చి తెల్పుచున్నది.

ఈ ప్రబంధము ప్రణవమువలె మిక్కిలి సంగ్రహమై, అర్థము చేసికొనుటకు వీలులేనిదై యున్నదికాదు. **'యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిత్'** (భార. ఆది. 62-26) ఇచట ఉన్నదే ఇక ఎక్కడ నైనను ఉండును, ఇచట లేనిది ఏదియు వేరెచటను లేదు - అని మహాభారతమునుగూర్చి పల్కురీతిలో గోష్పాదమంత చిన్న చోటిలో సముద్రము ఇమిడియున్నట్లు, సమస్తరహస్యార్థములు ఇందు సంగ్రహముగా ఇమిడియున్నవి. భగవానుని పరత్వము, వ్యూహము, విభవము - అను రూపములను గణింపక, అర్చావతారమును మాత్రము ఈ కృతి స్తుతించుచున్నది. ఆ అర్చారూపముందును "శ్రీరంగములోని చల్లని నీటిని కల కావేరీనది తన కెఱటములు అను చేతులతో పాద సంవాహనము చేయగా శయనించియున్న

నల్లనిమణివంటివాడైన శ్రీరంగనాథుని దర్శించి, ఆ మాయావిని ఆమోదస్తంభములను ఆలంబనముగా చేసికొని నిలచి, నోరార కీర్తించు'' (కులశేఖర నూ. 1-1) ప్రబంధము ఇది. అందుచే మిగిలిన అన్ని ప్రబంధములకంటే దీనికొక ప్రత్యేకత కలదు.

సాధారణముగా ఏ ప్రబంధమునైనను వ్యాఖ్యానించునపుడు వ్యాఖ్యాతలు మూడు విషయములనున విశ్లేషింతురు. అవి ఏవనగా - 1. వక్తృవైలక్షణ్యము, 2. ప్రబంధవైలక్షణ్యము 3. ప్రతిపాద్యవైలక్షణ్యమును. అనునవి ఇంతవరకు ఈ ప్రబంధముయొక్క గొప్పతనము ఎట్టిదో చూచితిమి. ఇక ఈ దివ్యసూరియొక్క మహిమ మిగిలిన దివ్యసూరుల మహిమకంటె విలక్షణ మనుటను కొంచెము గమనించెదము.

ముదల్ ఆళ్వార్లు (మొదటి దివ్యసూరులు) అనబడు సరోయోగి, భూతయోగి, మహాయోగియును భగవానుని పరత్వమునందే ప్రావణ్యమును కలవారై, అర్చావతారమును కేవలము స్పృశించి విడచిరి. భక్తిసారులు తమకృతిలో "చతుర్ముఖుని నారాయణుడు సృజించెను'' (1) అని ప్రారంభించి, 'భగవానుని ఈశ్వరునకు, చతుర్ముఖునకును దైవముగా ఇక తెలిసితిని' (96) అని ముగించుచు, మిగిలిన దైవములు పరతత్త్వము కానేరవు అనుచు శ్రియః పతియొక్క పరత్వస్థాపనలోనే దృష్టిని కలవారైరి. శ్రీకులశేఖరసూరి రామావతారమునందు మిక్కిలి అభినివేశమును కలవారై, అప్రధానముగా అర్చావతారమును అభివర్ణించిరి. శ్రీపరాశరభగవానులు, శ్రీ వేదవ్యాస భగవానులవలె శ్రీశఠకోపులు, భట్టనాథులు, గోదాదేవియు కృష్ణావతారములో అధికముగా అదరమును కలవారై, అర్చావతారమును అప్రధానముగా స్తుతించిరి. భక్తాంఘ్రిరేణులు శ్రీరంగనాథుని మాత్రమే స్తుతించినవారైనను, తమస్థితిని తెలిసికొని అనుభవించుట (స్వాపదేశము), ఇతరులకు ఉపదేశించుట, (అన్యాపదేశము) శ్రీరంగనాథుడు తప్ప వేరుదైవము లేదని అతని పరత్వమున ప్రతిజ్ఞచేయుట, మొదలగు విషయములందు ఆసక్తిని కలవారైరి. పరకాలసూరి

"రథమున నున్నవాడు, కిరణములను నిండుగాకలవాడు అగు సూర్యుని మండలమును భేదించుకొని, దాని మార్గమున ఒక దేశవిశేషమునుచేరి, అచట పరమభోగ్యమైన అమృతమువంటి పరమపురుషుని దర్శించి, ఆ పరమపదమునుండి ఏనాటికిని తిరిగిరాకుండ అచటనే ఉండునట్టి గొప్పపురుషార్థము ఒకటి ఉన్నదా ? ఉన్నచో ఉండనిమ్ము, అందమైన కుందేలువంటి అర్చారూపమును వదలి, నిరుపయోగమైన కాకివంటి పరమపదము వెంట పోవువారుందురా ?" (శిఱియ తిరుమడల్) అని పరత్వమును అధఃకరించి, దృష్టాంతపూర్వకముగా అర్చావతారములోనే ఆసక్తులయ్యిరి. కాని, ఆ అర్చారూపములో ఒక రూపమందే నిలుకడనులేనివారై, "నిన్న స్వామిని సేవించినది నీర్మలైలో. ఈనాడు అన్నచో నల్లగా ఏపుగా ఎదిగిన పైర్లచే చుట్టబడిన తిరుక్కణ్ణపురమునకు పోయి అచటి స్వామిని సేవింతును" (కలివైరి.సూ.- 10-1-1) అని తాను అభిమానించిన క్షేత్రముల నన్నిటిని దర్శించి, కీర్తించుచు నంచరించిరి. శ్రీరంగమును మిగిలిన దివ్యదేశములతో సమానముగా "కణ్డియూర్, శ్రీరంగము, మెయ్యము, కంచి, తిరుప్పేర్, మహాబలిపురము అను ఈ దివ్యక్షేత్రములను స్మరించుచు దర్శించిరి." (తిరుక్కుఱు-19) అనుచు అనుభవించిరి. ఆ శ్రీరంగనాథుని విషయమునను "నిన్నడియిణైయడైన్దేన్" (నీపాదద్వంద్వమును ఆశ్రయించితిని-వరకాలసూ. 5-8-1) అని పాదములను ఆశ్రయించి తావన్మాత్రముననే నిలచిరి. శఠకోపసూరి మొదలగువారికి వారు భగవదనుభవమును పొందునపుడే పూర్వజన్మలలోని దుఃఖానుభవము స్మరించుటచే, తాము ఆశించిన భగవదనుభవము పూర్ణముగా లభింపకపోవుటచే ఆ దుఃఖానుభవముతో కూడిన వచనములు ఆవిర్భవించినవి. కాని, ఈమునివాహనసూరి పూర్వము తెలిపిన ఏవిధమైన కొఱతయులేక, "పూర్ణమ్" అని వేదములు పల్కురీతిలో గుణములతో పూర్ణుడైన శ్రీరంగనాథుని అనుభవించిరి. పుట్టిగుడ్డివానికి కన్నులొసగి, సముద్రమును చూపునట్లు, అర్జునునకు యుద్ధభూమిలో దివ్యదృష్టిని ఇచ్చి, గీతోపదేశమును చేయునపుడు,

తన విశ్వరూపమును చూపి అనుభవింప చేసినట్లు, అక్రూరుడు, మాలాకారుడు మొదలగువారికి తన సౌందర్యము, సౌశీల్యము, మొదలగు గుణములను చూపి, వారిని ఆనందింపచేసినట్లును, ఈ దివ్యసూరికికూడ శ్రీరంగనాథుడు తన దివ్యరూపమును కటాక్షించి, ఆనందింపచేసెను. **"ఏకైకస్మిన్ పరమవయవే౽నంతసౌందర్యమగ్నం, సర్వం ద్రక్ష్యే కథ మితి ముధా మా మథాః మందచక్షుః, త్వాం సౌభ్రాత్రవ్యతికరకరం రంగరాజాంగకానాం తల్లావణ్యం పరిణమయితా విశ్వపారీణవృత్తి"** (శ్రీరంగరాజస్తవే. పూర్వ. 89) (శ్రీరంగనాథుని ఒక్కొక్క అంగములో నున్న అంతులేని సౌందర్యమును ఎట్లు దర్శించి అనుభవింతుమని ఓ మూఢ నేత్రమా ! తలపకుము. రంగనాథుని దివ్యాంగములకు సౌభ్రాత్రమును కల్గించు లావణ్యమను సముదాయ శోభ ఆసౌందర్యము నంతటిని అనుభవింపనియజేయును సుమా !) అని శ్రీపరాశరభట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కినరీతిలో ఈ దివ్యసూరి విషయమున తనకు కల ప్రేమ అతిశయించుటచే శ్రీరంగనాథుడు అర్చారూపమున నున్నను తన దివ్యసౌందర్యమును అంతటిని కన్నులకు సాక్షాత్కరింపచేయుగా, ఆ సౌందర్యసాగరమును లావణ్యమను నావతో వీరు దాటి, పూర్తిగా దర్శించిరి.

**మిగిలిన దివ్యసూరులకంటె మునివాహనసూరికికల వైలక్షణ్యము :**

మిగిలిన దివ్యసూరులకు వలె **"పల్లాణ్డు" (మంగళము), "పోఱ్ఱి"** (మంగళము) అనుచు మంగళాశాసనమును ఆరోపించుకొనవలసిన అవసరమువీరికి లేదు, ఈ దివ్యసూరి కది స్వాభావికము. (పాణ్కులమువారి వృత్తి గానమే కదా !) "ప్రసిద్ధ కులములు నాల్గింటిలో దేనిలోను నేను జన్మించలేదు.'' (భక్తిసార. నా.-77) అనునట్లు వీరు తమను చతుర్వర్ణములకంటె వేరుగా తలచియుండిరి. శ్రీరంగనాథుడును వీరిని అట్లే తలచెను. ఎట్లనగా - పరమపదములోని నిత్యసూరులు చతుర్వర్ణములకు చెందినవారు కారు కదా ! శ్రీరంగనాథుని యందే దృష్టిని నిలపిన భక్తాంఘ్రిరేణులను చూచినచో, శఠకోపాది మిగిలిన దివ్యసూరులు రెండు

పక్షములవారు(ఇరు కరైయర్) అనునట్లుండురు. అట్టి భక్తాంఘ్రిరేణులకంటె వీరికి కల వైలక్షణ్యము ఏమన - ఇతరులకు ఉపదేశించుట, ఇతరుల మాటలను ఖండించి, పల్కుటయు తన అనుభవమునకు విరోధి అని తలచుటచే వీరు శ్రీరంగనాథునే పరిపూర్ణముగా అనుభవించిరి. శ్రీరంగనాథుడుతప్ప వేరు విషయము తెలియదనుట ఎట్టిదో ఆచరించిచూపిరి. **"స్నేహో మే పరమో రాజన్ త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తి శ్చ నియతా వీర ! భావో నాన్యత్ర గచ్ఛతి"** (రా. ఉత్తర 40-15) (రాజా ! నాకు నీపట్ల మిక్కిలి స్నేహము నిత్యము సుస్థిరమైయున్నది, భక్తియును నియతముగా నున్నది, ఓవీరుడా ! ఇది తప్ప నా భావము వేరొక చోటికి పోవుటలేదు)అను శ్రీ రామాయణ శ్లోకములో భక్తి, స్నేహములను రెండు పదములున్నవి. ఈ రెండింటి మధ్య భేదమేమి ? అని నఞ్జీయర్ అను మహనీయులు తమ ఆచార్యులు అగు భట్టరును అడుగగా, భట్టరు ఇట్లు సమాధాన మిచ్చిరి. శ్రీరాముడు వనమునకు వెడలినపుడు తద్విశ్లేషమును సహింపలేకపోవుటచే ప్రాణత్యాగమును చేసిన దశరథుని స్థితి స్నేహము. కావున దశరథునకు రామునిపట్ల ఉన్నది స్నేహము. శ్రీరాముడు వనమునకు పోయినపుడు 'నీవెంట నేను కూడ వత్తునని' పల్కి అతనిని అనుసరించి, నిరంతరసేవను చేసిన లక్ష్మణుని స్థితి భక్తి. కావున లక్ష్మణునకు రామునియందు కల భావము భక్తి. ఈ రెండిటిని హనుమానుడు శ్రీరామునియందు కలిగియున్నాడు. ఇట్లు రామావతారమును తప్ప వేరు ఏమియు తెలియని హనుమానుని స్థితి వలె, మునివాహనసూరియు శ్రీరాముడు ఆరాధించిన శ్రీరంగనాథునితప్ప వేరు పర-వ్యూహ-విభవములను వేనిని తెలియనివారయ్యిరి.

వీరు అనుభవించిన శ్రీరంగనాథుని మహిమ ఏమనగా - పరత్వమువలె వేరొక దేశమున, వేరొక దేహమును పొంది అనుభవింపవలసిన అవసరము లేదు. వ్యూహమువలె పాలసముద్రమునువరకు ఆయా కాలములలో ఉన్నవారు మాత్రమే దర్శింపగల్గినట్టిది కాదు. క్షీరములో నేయివలె, లోకములోనున్న జీవులందరిలో అంతర్గతుడైయున్న అంతర్యామివలె కన్నులతో

దర్శింపవీలుకానిది కాదు, అర్చామూర్తులలో కూడా "దేవతలకు తప్ప వేరొకరికి పోవుటకు సాధ్యముకాని అహోబలము", అనునట్లు భయంకరమైయుండుటయో ఎక్కువ ఎత్తును ఎక్కవలసియుండుటయో, పెద్దగుంపుతో కలసి కొండ ఎక్కినచో **"కానముమ్ వానరముమ్ వేడుమ్"** (అరణ్యములు, వానరములు వేటగాండ్రును కల్గిన వేంకటాచలము - భక్తిసార. సూ. 48) అనునట్లుండుటయో కాక, ఈ దేశములో, ఈ కాలములో అందటికిని సేవింపవీలగునది శ్రీరంగ మొక్కటే. "భక్తులు, సన్న్యాసులు, ప్రాచీన వాక్కును (సంస్కృత భాషను) నోటకల్గిన మునులు, అంతటా వ్యాపించినర్తించు సిద్ధులును (నిత్యముక్తులును) అంజలి ఘటించి నమస్కరించునది దేనిని ? అనగా, దిక్కులకు దీపమైయున్నది అగు శ్రీరంగమును" (భట్టనాథ సూ.- 4-9-6) అనునట్లు అందఱును తామున్న స్థితిలోనే ఆశ్రయింపతగినరీతిలో సర్వసులభుడై "దృఢమైన, గొప్ప స్వర్గాదిలోకములు ఉజ్జీవించునట్లు, దేవతలు తరించునట్లు భూలోకము ఉజ్జీవించునట్లు, భూలోకములోని మానవులు తరించునట్లు" (కులశేఖర సూ.- 1-10) అనురీతిలో ఉభయవిభూతులను నిర్వహించుచున్న వాడుకదా శ్రీరంగనాథుడు ! ఇట్లు అర్చామూర్తు లన్నిటిలో ప్రముఖుడై, కైంకర్యమును భక్తులనుండి స్వీకరించునట్టి స్వామియై, సర్వరక్షకుడై, అందఱును ఆశ్రయింపతగినరీతిలో, అంతులేని ఆనందమును కల్గించువిధమున నున్నవాడుకదా శ్రీరంగనాథుడు ! **"శేష్యే పురస్తాచ్ఛాలాయామ్ యావ న్మే వ ప్రసీదతి"** (రా.అయో. 111-14)అనుచు శ్రీభరతుడు "నాతలపై నున్న రాజ్యమను గొప్ప భారమును తొలగించుకొనినగాని లేవను" అని పరుండినట్లు, "సంసారులైన మీ దుఃఖ ములన్నియు నా తలపై నుంచినగాని నేను లేవను" అని ఆ స్వామి పరుండి యున్నాడు. **"యోగక్షేమం వహామ్యహమ్"** (గీతా. 18-66) అని పల్కినవాడుకదా అతడు.

వీరు మిగిలిన దివ్యక్షేత్రములలోని అర్చామూర్తులను వదలి, శ్రీరంగములోని అర్చామూర్తినే ఆశ్రయించుటకు ఏమి కారణము ? అనినచో, శ్రీవైకుంఠమును, పాలకడలియు, విభవములును (అవతారములు) మిగిలిన

దివ్యక్షేత్రములలోని అర్చామూర్తులును అన్నియు శ్రీరంగనాథుడే అనునట్లు ఆయా చోట్లగల సౌందర్యము మొదలగు గుణములు, లీలలు అన్నియు శ్రీరంగనాథునియందు దర్శింపవచ్చును. శ్రీరంగనాథుని అందము, ఐశ్వర్యమును పరమపదములో అంకురించును, రామకృష్ణాద్యవతారములలో రెండాకులు వేయును (పల్లవితమగును). శ్రీరంగములో కోరకితమగును. ఎట్లనగా - "పొంగునట్టి సముద్రముచే పరివేష్టితమైన భూలోకము, పరమపదములలో ఏదియు చెదరకుండునట్లు పాలించు స్వామి అందమైన అధికార దండమునుకల శ్రీరంగనాథుడు" (గోదా. సూ.- 11-3) అనునట్లు మిగిలిన క్షేత్రములందు అంతట స్వామి వైభవము పరిమితమైయుండగా, ఇచట అపరిమితము. తననుఅభిలషించువారిని అనుగ్రహించి అనుభవించుటయే కాక, భగవానుడనగానే తన ముఖమును పక్కకు తిప్పుకొను వారుసైతము కావలెనని కోటి దర్శించునట్టి సౌలభ్యమునుకల్గిన అతిశయము ఇచటనే కలదు. ఒక వస్తువునకు వైలక్షణ్యము గుణముల వలనకదా ఏర్పడును. అన్ని గుణములు ఉపకరించునది ఇచటనే. భగవద్గుణములలో ఆసక్తులగు వారు ఈ విషయమును తప్ప విషయాంతరమును ఎఱుగరు. **"యతో వాచో నివర్తంతే"** (తైత్తి. భృగు) అని వేదములును దటి చేరలేనట్టి పరత్వమునుకల సర్వేశ్వరుని, నదిలో నీటినివలె (సులభముగా) దర్శించురీతిలో, ఈ కావేరీనదిమధ్యలో స్వామిని దర్శించి, ఆనందించునట్లున్న చోటుకదా శ్రీరంగము. **"మత్తైక్కన్హ వరైవువేన్నప్పు వైన్దనై మదురవాఱే"** అని మధురమైన నదిగా ప్రశంసింపబడువాడు ఈ శ్రీరంగనాథుడే కదా !

ఇక, ఈ ప్రబంధములో ప్రస్తావింపబడు అంశము లేవనగా - అర్థపంచకమని చెప్పబడు 1. పరస్వరూపము, 2. జీవాత్మ స్వరూపము, 3. ఉపాయస్వరూపము, 4. విరోధిస్వరూపము, 5. ఫలస్వరూపమును. ఈదివ్యసూరి తాము పొందగోరిన ఫలము, దానిని పొందించువాడును, అందు రుచినికల్గించువాడును, ఆ ఫలమును పొందుటలో ఎదురగు విరోధులను (ఆటంకములను) తీర్చువాడును శ్రీరంగనాథుడే అని ఇందు అనుచున్నారు

ఈ మహనీయులు తమకు లౌకికవిషయములలో రుచి లేకుండుటయు, భగవద్విషయమున అద్వేషమును కల్గియుండుటయు- అను ఈరెండును తమకు కల్గిన మాత్రమున శ్రీరంగనాథుడు కటాక్షించి తన స్వరూప-రూప-గుణ- విభూతులను సాక్షాత్కరింపచేయగా, దర్శించి, సంతుష్టులైరి. **"ఆనయైనం హరిశ్రేష్ఠ"** అని సుగ్రీవుని ద్వారా విభీషణుని అనుగ్రహించినట్లు, అన్యులకు కైంకర్యమును చేయుట మాని, ఎల్లప్పుడు తనవాకిలియందే పడియుండునట్టి లోకసారంగమహామునిని చూచి శ్రీరంగనాథుడు **"నమ్పాడువానై అళైత్తుక్కొణ్డు వారుమ్"** (మమ్ములను పాడు మునివాహనులను పిలుచుకొనిరండు) అని పలుకగా, వారును **"అరుళ్‌పాడు అరుళ్‌పాడు"** (భగవానునిచే అనుగ్రహింపబడిరి, అనుగ్రహింపబడిరి) అని వీరిని పిలచిరి. ఈ దివ్యసూరి **"అడియ్యేన్ అడియ్యేన్"** అనుచు ఆలయమున పాదములను మోపుటకు వెనుకంజ వేయగా, లోకసారంగముని విడువక, తన భుజములపై బలవంతముగా ఎక్కించుకొని పోయెను. దారిలో తొమ్మిది పాటలను పాడిన దివ్యసూరి గర్భాలయమున నిలచి పదియవ పాటను పాడి ఈ ప్రబంధమును పరిసమాప్తి గావించిరి- అని ఐతిహ్యము.

**మునివాహనభోగవ్యాఖ్యావాతారిక :**

కారణవిశేషము ఇట్టిదని గుర్తింప వీలులేనట్టి అద్వితీయనిర్హేతుక భగవత్కటాక్షముచే అయత్నలభ్యమైన పరమతత్త్వ, పరమహిత, పరమపురుషార్థముల వివేకమును కలవారై, అనాదికాలముగా ప్రవృత్తములైన క్షుద్రపురుషార్థములందలి రాగాదులను, క్షుద్రపురుషులను స్తుతించుటయును, క్షుద్రసుఖములకొఱకు ప్రయత్నించుటయును మానిన తమ కరణత్రయము ఇపుడు ప్రాప్తమైన ఒకేవిషయమునందలి (శ్రీరంగనాథునియందలి) అనన్యప్రయోజనానుకూలమైన కైంకర్యవృత్తిని కల్గియుండుటను గమనించి సంతోషముకలవారైన మునివాహనసూరి దేహత్యాగానంతరము ప్రపన్నులు పరమపదములోపొందు ఫలమును ఇచటనే శ్రీరంగనాథుని పాదములందు పొంది,

ఆఫలమును (సేవను) పాదములనుండి "అమలనాదిపిరాన్" మొదలగు పదిపాశురములలో అనుభవపరీవాహరూపముగా వ్యక్తీకరించిరి.

ఈ ప్రబంధము అతివిస్తృతము, అతి సంకోచము, కేవలము కొందఱికే అభ్యసింప వీలగునట్లుండుట, అర్థముచేసికొనుటకు క్లిష్టమైయుండుట, పలు సంశయములను కలుగజేయుట, విరహక్లేశము, దూతప్రేషణము, పరోపదేశము, పరమతనిరసనము- అను మొదలగు మిగిలిన దివ్యప్రబంధములలో కానవచ్చు అంశములు వేనిని లేనిదై, భగవదనుభవరసఘనమై యున్నది. మొదటి పాశురమగు "అమలనాదిపిరాన్" మొదలు "కొణ్డల్‌వణ్ణనై" అను చివరిపాశురమువఱకుగల పదిపాశురములలో మొదటిమూడుపాశురములందు గల మొదటిఅక్షరములు సమస్తవాఙ్మయమునకు మూలమైన ప్రణవముయొక్క ప్రథమ మధ్యమ చరమవర్ణములను సూచించుచున్నవి. ఇందలి మొదటిపాశురములో అష్టాక్షరి, ద్వయములలోగల ముముక్షువునకు అవశ్యానుసంధేయములైన పలు అర్థములు సూచింపబడినవి.

# అమలనాదిపిరాన్-శ్రీసేవావ్యాఖ్యా

1. **అమలనాదిపిరాన్ అడియార్‌క్కెన్నై ఆళ్‌పడుత్త**
**విమలన్ విణ్ణవర్‌కోన్ విరైయార్ పొழిల్ వేఙ్గడవన్**
**నిమలన్ నిన్మలన్ నీదివానవన్ నీళ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్**
**తిరుక్కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్లన ఒక్కిన్ఱదే.**

అమలన్ = పరిశుద్ధుడై, ఆది = లోకముల కన్నింటికిని కారణభూతుడై, పిరాన్ = నాకు ఉపకారకుడై, ఎన్నై = (లౌకిక వ్యాపారములందు మగ్నుడనైన) నన్ను, అడియార్‌క్కు = తనదాసులకు, ఆళ్ పడుత్త = దాసునిగా చేయుటచే కల్గిన, విమలన్ = గొప్పకాంతిని కలవాడై, విణ్ణవర్‌కోన్ = నిత్యసూరులకును నాయకుడైయుండి (ఈలోకములో నున్నవారిని దాసులుగా చేసికొనుటకై),

విరైఆర్ = పరిమళము అతిశయించియున్న, పొళ్దిల్ = తోటలను కల్గిన, వేఙ్గడవన్ = తిరుమలలోనికి వచ్చి, నిలచినవాడై, నిమలన్ = నేను కోఅకనే, నాకు ఉపకారమును చేయుటచే, అతిశయించిన తేజస్సును కలవాడై, నిన్మలన్ = తన దాసులకు నన్ను దాసునిగా చేయుటచేకల్గిన తేజస్సునుకలవాడై, నీదివానవన్ = "స్వామి-సొత్తు" అను క్రమము తప్పని పరమపదమములో నున్నవాడై, నీణ్ = ఉన్నతములైన, మదిళ్ = ప్రాకారములను కల, అరఙ్గత్తు = శ్రీరంగమున శయనించియున్న, అమ్మాన్ = అందఱికిని నాయకుడై వెల్గువానియొక్క, తిరు = లక్ష్మీదేవియు భయపడుచు సంవాహనము చేయతగిన శోభనుకల్గినదై, కమల = ఎఱ్ఱతామరలవంటి, పాదమ్ = పాదములు, వన్దు = తామే వచ్చి, ఎన్ కణ్ణినుళ్లన = నా కన్నులకు లక్ష్యమై, ఒక్కిన్ఱదే = ప్రత్యక్షసమానాకారముగా నున్నవికదా ! ఏ = ఆహా ! (ఒక్కిన్ఱవే అని పాఠాంతరము కలదు.)

**వ్యాఖ్య :** శ్రీరంగనాథుని మూలమూర్తియొక్క శ్రీపాదముల సొబగు తమను వశీకరించుకొని, దాసునిగా చేసికొన్నది అనుచు దివ్యసూరులు పల్కుట ఇందలి ప్రధానాంశము. ఆకాశమునుండి జలము సహ్యపర్వతముపై వర్షించి, అచటి నుండి కావేరీనదిగా ప్రవహించి, దానినుండి కాలువలుగా పలుముఖములుగా పాఱి, జనులకు ఉపయోగపడునట్లు, పరమపదమును ఆకాశమునుండి వేంకటాచలమున అవరోహణ మొనర్చి, దక్షిణదిశలో పల్లపు (నిమ్న) ప్రదేశమైన శ్రీరంగములో నిలచి, తూర్పుపడమరలుగా శయనించియున్న శ్రీరంగనాథుడను మధురరసనదీ ప్రవాహమున అవగాహనమొనర్చి ఈ దివ్యనూరి కాలు(శ్రీరంగనాథుని పాదములు) అను కాలువను అనుభవించుచున్నారు. (పాదమును చూచుచున్నారు) 'కాల్' అను ద్రావిడ పదమునకు పాదమని, కాలువ అనియు రెండర్థములు కలవు.

**అమలన్ :** శ్రీవాల్మీకి భగవానులు **"కో ను గుణవాన్"** (రా. బాల. 1-2) అనుచు ప్రారంభించి శ్రీనారద మహర్షిని ప్రశ్నింపగా, ఆయనయు

**"ఇక్ష్వాకువంశప్రభవః"** (1-8) అని సౌశీల్యగుణమును ముందుగా ప్రస్తావించెను. తైత్తిరీయోపనిషత్తులోని ఆనందవల్లిలో **"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"** అని భగవానుడు తెలుపబడుటను మనస్సుననుంచుకొని శ్రీశఠకోపసూరి తిరువాయ్‌మొళ్ళిలో ప్రబంధములో ప్రారంభములోనే "నిస్సమాభ్యధికమైన, వృద్ధిచెందు ఆనందగుణమును కలవాడు" (శఠ. సూ.- 1-1-1) అనుచు భగవానుని ఆనందగుణమును అభివర్ణించిరి. ఈ దివ్యసూరియు తమనైచ్యమును గమనింపకనే శ్రీరంగనాథుడు తనను అనుగ్రహించిన రీతిని దర్శించి, భగవానుని ఉభయలింగములలో (గుర్తులలో) ఒకటి అగు అతని హేయప్రతిభటత్వమును (హేయగుణములు లేకుండునట్టి స్వభావమును) ముందుగా అనుభవించుచున్నారు. తమ జన్మవలన కల్గిన నైచ్యమును గణించి చూచిన వీరు వెనకకు తగ్గగా, దానినే హేతువుగా గొని భగవానుడు నొచ్చుకొని, తమపై వ్యామోహమును చూపి, దటి చేరినను, అతనికెట్టి అవద్యమును ఏర్పడకుండుటను దర్శించిన దివ్యసూరి **"అమలన్"** అను విశేషణమును ప్రయోగించిరి. ఇట్టి అర్థమునే శఠకోపులు. "నాయందు సంగమును కల్గి,మిక్కిలి ప్రకాశించు తేజోమయునకే" (శఠ.సూ. 3-3-4) అనుసూక్తి ద్వారా తెలిపిరి.

**అమలన్** - సంసారులవలె హేయగుణముల సంబంధమును అణుమాత్రమైనను లేనివాడై, **"అపహతపాప్మా, విజరః, విమృత్యుః, విశోకః, విజిఘత్సః, అపిపాసః, సత్యకామః, సత్యసంకల్పః"** (ఛాందో 8-1-5) అను ఎనిమిది గుణములను కల్గిన పరిశుద్ధుడని అర్థము. పరిశుద్ధుడగుట అనగా, తానొక్కడు శుద్ధుడుగా నుండటయేకాక తనతోసంబంధమును కల్గినవారిని కూడ శుద్ధులనుగా చేయుగల శక్తిని కల్గియుండుట. ఈ శక్తిని **"తుయరఱు శుడరడి"** (దుఃఖమును తీర్చు, ప్రకాశించు పాదములు 1-1-1) అని శఠకోపసూరి, **"పావన స్సర్వలోకానాం త్వ మేవ రఘునందన"** (రా. ఉత్తర. 82-9) అనుచు అగస్త్యమహర్షియు పల్కిరి.

**ఆది** - "ఇట్లు తక్కువవారైన మీయందు భగవానుడు

అత్యంతాదరమును చూపి, అంగీకరించుటకు ఏమి కారణము ?" అను సందేహము కలుగవచ్చునని తలచిన కవి, "కన్నవారు తమ సంతతి ఎట్టివారైనను వారిని విడతురా ?" అను అర్థముతోచునట్లు ఈ 'ఆది' అను విశేషణమును ప్రయోగించిరి. తన స్వరూపాదులను దర్శించిన అందఱిచే మిక్కిలి ఆదరింపబడు తానే దివ్యసూరివిషయమునగల నైచ్యమును లెక్కచేయక, తానే ముందుగా అత్యంతము అభిమానమును చూపెనని తాత్పర్యము. భగవానుడు, తనను అనుభవించు భక్తులను వేరొక విషయమందు పోనివ్వకుండ చేయుననియు భావము. నా నైచ్యమును పోగొట్టి, తన వద్దకు చేర్చుకొనుటద్వారా తన ప్రయోజనముకొఱకు తానే ముందంజవేసెను. ప్రళయమున నశించిన లోకమును తిరిగి సృష్టించినట్లు, నేను నశింపచేసికొనిన నా స్వరూపమును తిరిగి జీవించునట్లు చేసెను. అందుచే **"అమలన్, ఆది"** అని ప్రస్తుతములైన రెండుపదములచే భగవానుడు దోషములను పోగొట్టగలవాడని, కల్యాణగుణముల నన్నిటిని కలవాడని తెలుపబడినది.

**పిరాన్** - పూర్వముచేసిన ఉపకారమును స్మరించి **"పిరాన్"** అను చున్నారనియు, లేక, ఇకపై చేయబోవు ఉపకారమును గుర్తించి, **"పిరాన్"** అను చున్నారనియు చెప్పవచ్చును. నా నైచ్యమును లెక్కపెట్టకనే నన్ను అనుగ్రహించిన ఉపకారకుడు. అని భావము -

**అడియార్క్కెన్నై ఆళ్పడుత్త విమలన్** - నేను నాకు చెందినవాడను అనియు, ఇతరులకు చెందినవాడను అనియు తలచి తిరిగిన నన్ను, తనకు, తన దాసులకును ఉపయోగపడునట్లు చేసిన పరిశుద్ధస్వభావుడు. తానే నాతలను పట్టుకొని తన పాదములక్రింద నుండునట్లుచేసెను, **"రత్నహారీ తు పార్థివః"** (రాజు రత్నములవంటి శ్రేష్ఠములైన వస్తువులను హరించును) అనునట్లు మంచివస్తువును చూచినచో అతడు తన దాసులకు అని కదా తలచును. తనకు దాసునిగా చేసికొనుటయేకాక, తన దాసులకును దాసునిగా చేసికొని, దానివలన నేను తనకు శాశ్వతముగా దాసునిగా నుండుటను స్థిరీకరించెను.

**ఎన్నై**- అత్యంత నీచులైన దేహాత్మాభిమానులు కూడా స్పృశింపని నన్ను అని, ఇంతవరకు శరీరభోగముల కొఱకు దాస్యమును చేసిన నన్ను అని, తన స్వభావమును, గొప్పతనమును తెలియని నన్ను అనియు, 'మంచికి అతనితో సమానమైనవారు లేనట్లే, చెడుకు నాతో సమాను లెవ్వరును లేరు' అని తలచిన నన్ను అనియును భావము. సర్వనామ శబ్దము వక్తృబుద్ధిస్థమైన భావమును తెలుపునుకావున ఇచట ఈ అర్థము లన్నియు **"ఎన్నై"** అను పదము ద్వారా స్ఫురించుచున్నవి.

**ఆళ్‌పడుత్త** - భగవచ్ఛేషత్వమాత్రమున నిలచినచో తిరిగి పోవుటకు వీలుండునుకాని, భాగవతశేషత్వపర్యంతముపోయినచో తిరిగి పోవుటకు వీలులేదు కదా ! (అది ప్రేమాధిక్యముచే ఏర్పడునది కదా) ఒక క్షేత్రము పలువురి చేతులు మాఱి, వెల నిర్ణయింపబడి, పలుమార్లు అమ్మబడినచో, తిరిగి తనకు స్వాధీనమగుటకు వీలులేదు కదా ! అట్లే, భగవద్దాసదాసత్వము వీడిపోవుటకు ఎప్పటికిని అవకాశము లేదు. వానరవీరుల కటాక్షము శ్రీవిభీషణునకు శ్రీరాముని కటాక్షమునకు ముందు లభించినట్లే, ఈ దివ్యసూరికి భగవద్భక్తుల కటాక్షము ముందు లభించినది, **"ఆనయైనం హరిశ్రేష్ఠ"** (వానరశ్రేష్ఠా ! ఇతనిని తీసుకుని రమ్ము- రా. యు. 18-34) అని అపుడు శ్రీరాముడు సుగ్రీవుని ఆజ్ఞాపించి, విభీషణుని పిలుచుకొని రమ్మనెను. అట్లే ఇపుడు శ్రీరంగనాథుడు లోకసారంగమునిని పిలచి, "నా భక్తుడగు ఇతనిని పిలుచుకొని రమ్ము" అని ఆజ్ఞాపించెను.

**అడియార్క్కెన్నై ఆళ్‌పడుత్త విమలన్** - అతని దాసులతో నన్ను సమానముగా గనింపక, తన దాసులకు నన్ను విక్రయించిన పరిశుద్ధ స్వభావుడు. లోకసారంగముని వీరిని (కృతికర్తను) భుజములపై మోసికొని వచ్చిరికదా, మోయువాడు మోయబడువానికి కదా దాసుడు ? వీరు భగవద్భక్తులకు దాసులగుట ఎట్లు ? అనినచో, "భుజద్వంద్వముపై, చక్కని వక్షఃస్థలముపై, ప్రకాశించు కిరీటముపై" (శఠ. సూ. - 1-9-7) అనునట్లు స్వామి తులసీమాలికను

తలపై ధరించియున్నను, ఆ తులసీమాల భగవానునకు దాస్యము చేయునదియే అగును ! అట్లే వీరును స్వామిపాదస్థానీయులైన భగవద్భక్తుల మాటకు విధేయులగుట ద్వారా వారికి ఇష్టవినియోగార్హులయ్యిరి అని భావము.

**విమలన్** - ఇచటి ఔజ్జ్వల్యము నా నైచ్యమును చూడకనే భగవానుడు తన దాసులకు నన్ను దాసునిగా చేయుటవలన వచ్చిన **"ఔజ్జ్వల్యము"**. పెద్దలు ఎదుటివారి గౌరవమును బట్టి కాక, తమ గౌరవమునకు తగినరీతిలో కదా ఇత్తురు. బలిచక్రవర్తి మూడడుగులు దానమిచ్చుట తన గౌరవమునకే అవమానము అనెను కదా !

**విణ్ణవర్‌కోన్** - నిహీనులైన మిమ్ములను ఇట్లు స్వామి అనుగ్రహించుటకు కారణము తానుకటాక్షించుటకు ఎవరును లేక పోవుటచేతనా ? అనినచో, అందులకు సమాధానముగా కవి ఈ పదమును ప్రయోగించిరి. త్రిపాద్విభూతి అనబడు పరమపదములోగల నిత్యసూరు లందటిచే మంగళాశాసనము చేయబడువాడే నన్ను స్వయముగా అనుగ్రహించెను అని ఈ శబ్ద భావము. ఉంఛవృత్తిని చేసి జీవించువారివలె, నిత్యసంసారిగానున్న నిత్యులతో, ముక్తులతో సమమైన స్థితిలో నన్ను నిలిపి అనుగ్రహించెను. ఇంతటి ఔదార్యము నేర్చినది ఆ నిత్యసూరులవలననే అనియు ఇచట భావము. **"అస్మాభి స్తుల్యో భవతు"** (రా.యు. 18-38) అని సుగ్రీవాదులతో సమానముగా విభీషణుడు రామునిచే అనుగ్రహింపబడెను కదా ! లేక, ఆ నిత్యసూరులకుకూడ దర్శింప సాధ్యముకానిది తనవైభవము అనియు భావము.

**విరైయార్‌పొళిల్ వేఙ్గడవన్** - పరమపదమున అనేకులు ఉండుట సరియే, కాని ఈ భూలోకమున ఎవరును లేకపోవుట వలన మిమ్ములను అంగీకరించియుండవచ్చునే ? అను ప్రశ్న ఏర్పడవచ్చునని తలచిన కవి **"నావేవ యాంత ముభయే హవంతే"** (తైత్తి. కాఠక. 6-1-12-3) అనియు, **"చక్షు ర్దేవానా ముత మర్త్యానామ్"** (యజు. 4-6) అని "భూలోక వాసులకు, స్వర్లోకవాసులకు నేత్రభూతుడు'' (శత. సూ. - 1-8-3) అనియు కీర్తించు రీతిలో ఈ

భూలోకముననున్న ముముక్షువులు, పరమపదముననున్న నిత్యులు, ముక్తులు అందఱును కలసి "విచ్ఛేదము లేని కైంకర్యమును మేము చేయవలెను" (శర.సూ.- 3-3-1) అని శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థింతురు. ఇట్లు భూలోకవాసులు, నిత్యసూరులు అను రెండు విధములైన వారును చేయు కైంకర్యమును స్వీకరించు పూర్ణుడైన స్వామియే కదా తన పరత్వమును గణింపక నన్ను అంగీకరించెను ! అని తాత్పర్యము.

**విరైయార్‌పొழిల్ వేఙ్గడవన్** - సువాసనతో నిండిన తోటలను కల (తిరుమల) వేంకటాద్రిని కలవాడు. శ్రీరంగనాథుని దర్శింప నెంచిన దివ్యసూరి శ్రీవేంకటేశ్వరునిగూర్చి భావించుట ఏమి ? అనినచో, నదిలో మునుగువాడు ఒక కాలును గట్టుపై పెట్టినచో బ్రతుకవచ్చునే ! అని తలచునట్లే, ఈ దివ్యసూరులును అమృతనదివంటి శ్రీరంగనాథుని అందమున మగ్నులగుటచే, తిరుమలపై కాలును మోపియున్నారు. 'కాని, అచటనున్న స్వామియు ఒక మడుగు అని వీరికి తెలియదు కాబోలు ?' అని ఆపిళ్లై తిరునఱైయూర్ అరైయర్ అను ఆచార్యులు ఈసందర్భమున రస్యముగా పల్కిరట. ఒకరిని కీర్తించునపుడు అతని గొప్పతనమును పల్కికదా పొగడుదురు ! అట్లే ఇచట కవి వేంకటాద్రిని గూర్చి పలుకుట శ్రీ రంగనాథుని కీర్తించుట కొరకే అని చెప్పనగును. శ్రీపరాశరభట్టర్ ఈ సందర్భమును వ్యాఖ్యానించుచు "శ్రీ కృష్ణుడు పరమపదమునుండి బయలుదేరి, మధురలో మజిలీచేసి, రేపల్లెకు చేరినట్లు, భగవానుడు వైకుంఠమునుండి బయలుదేరి, శ్రీ వేంకటాద్రిపై అవరోహించి, (మొదటపాదము మోపి) పిమ్మట శ్రీరంగమునకు వచ్చెను" అనిరట. అంతియేకాక, శ్రీరంగములోని భోగ్యతను దర్శించిన తాము ఆ అనుభవతీవ్రతను తట్టుకోలేక, వేంకటాద్రిని చేరి, తమాయించుకొన గోరుచున్నారనియు చెప్పనగును. 'విరైయార్' అనుటచే నిత్యసూరులను కల్గియున్న పరమపదనాథుని వైభవముకంటె అతిశయించిన వైభవమును వేంకటేశ్వరుడు కలవాడనుట ధ్వనించుచున్నది.

**విణ్ణవర్‌కోన్ . . వేఙ్గడవన్** - అనుపదముల సమభివ్యాహారముచే నదిలో స్నానముచేయువారు లోతైన చోట శ్రమతీర మునుగుటకై వెదకునట్లు, నిత్యసూరులు నైతము వెదకికొనుచు వచ్చి, సేవచేయు చోటు వేంకటాద్రి అని ధ్వనించును.

**వేఙ్గడవన్** - అర్చావతారమున బంగారుపాదములను (మొదటగా) మోపిన చోటుకదా వేంకటాద్రి. (తిరుమలలోని నారాయణ గిరిపై ఈనాటికిని వేంకటేశ్వరుని పాదముద్రలు ఉండుట గమనింపవచ్చును)

**నిమలన్** - నిర్హేతుకముగా నన్ను కరుణించిన శుద్ధిని కలవాడు అనియు భావము. నన్ను అనుగ్రహించుట తనకు ప్రయోజనముగా తలచి, అనుగ్రహించిన శుద్ధిని కలవాడు. ఈ దివ్యసూరిని తాను పొందుటకై ప్రయత్నించినవాడును అతడే. వీరు తనమాటను ఏమియు వినకున్నను, తానే ముందుకు వచ్చి అనుగ్రహించుటచే ఏర్పడిన తేజస్సును కలవాడు. **"అమలన్ "** అనుటచే ఈ దివ్యసూరిని తనకు శేషము చేసికొన్న శుద్ధి, **"విమలన్"** అనుటచే భగవద్భక్తులను శేషముచేసిన శుద్ధి, **"నిమలన్"** అనుటచే తానెట్టి ఉపాయమును ఆచరించపకున్నను తన కార్యమును సఫల మొనర్చిన శుద్ధి తెలుపబడినది- అని ఆచార్యుల రస్యవ్యాఖ్య.

**నిన్మలన్** - దివ్యసూరికి తాను ఉపకారము చేసినట్లు తలపక, అది తన ప్రయోజనముగా తలచుట. ఇది **"కృతకృత్య స్తదా రామః విజ్వరః"** (రా. బాల. 1-85) అని శ్రీరాముడు రావణుని వధించి, పిమ్మట విభీషణుని లంకా రాజ్యమునకు అధిపతిగా చేయుట తన ప్రయోజనముగా తలచుట వంటిది. స్వామి సొత్తును పొందినట్లు, తన సొత్తుఅగు నన్ను పొంది, తనదైన శుద్ధిని కలవాడు.

**నీదివానవన్** - శేషి - శేషత్వముల క్రమము తప్పని పరమపదములో నున్నవాడు. "నేనే ఈశ్వరుడను" అని భగవానుని ఎదిరించుచోటు కదా ఈలోకము ? అచట ఆ దోషము లేదు; ఆ దోషమును కలవారును లేరు. ఇచట ఆ దోషమును కలదు, ఆ దోషమును కలవారును కలరు.

**నీళ్‌మదిళ్ అరజ్గత్తమ్మాన్** - "నీదివానవన్" అనుటలో తాత్పర్యము ఏమనగా, అందులకు **"నీళ్‌మదిళ్ అరజ్గత్తమ్మాన్"** అనుచు సమాధాన మిచ్చుచున్నారు. "స్వరూపరూపగుణములలో అపరిచ్ఛేద్యమైనవాడు, అరుదైన అమృతము వంటివాడు, శ్రీరంగమున అమరియున్నవాడును అగు పరిశుద్ధుని" (తిరునెడు- 14) అని పరకాలసూరి పల్కిరికదా !

**నీళ్‌మదిళ్ అరజ్గమ్** - రక్షకత్వమునకు అనుగుణము అయిన ప్రాకారములను కల శ్రీరంగములో నిద్రించు పరమాత్మ. ఈ పాశురమును వినుటచే కదా కలివైరిసూరి ప్రాకారములను శ్రీరంగమున నిర్మించిరి. అందమైన నోటితో వీరిట్లు పల్కిన మాటలవలననే తదనంతరకాలమున అచట గృహములు, గోపురములును విస్తరించినవి కాబోలు.

**అమ్మాన్** - ఈ పదముచే పరమపదములోనున్నవారితోగల స్వామిత్వరూప సంబంధము ఇచటి వారితోకూడ నుండుటచే కదా ఇచటకు వచ్చి శయనించెను ! ఇద్దరు ప్రభువులుండు స్థితి పోయినగాని శేషిత్వము పూర్ణము కాదు కదా ! అందుచే స్వామివేంకటాద్రిలో వేంచేసి యుండుట మాని శ్రీరంగమున ప్రవేశించెను. వేంకటాద్రిలో మహానందమును అనుభవించినను తనివితీరకపోవుటచే, తిరిగి శ్రీరంగమునకు వచ్చెను. నదీ ప్రవాహము కాలువలద్వారా పల్లపు ప్రదేశమునకు ప్రవహించునట్లు, శ్రీవేంకటేశ్వరుడు ఉత్తరపు వాకిలిద్వారా శ్రీరంగమునకు వచ్చిచేరెను అనియు చెప్పవచ్చును. (తిరుమలకంటె శ్రీరంగము పల్లమున నుండుట, నదీ ప్రవాహము ఉత్తర దిశనుండి దక్షిణమునకు ప్రవహించుటయు, శ్రీరంగనాథుడు అమృతనదిగా రూపింపబడుటయు గమనింపతగినవి.)

**తిరుక్కమలపాదమ్** - నదీ ప్రవాహములో దిగువారు తెప్పను సహాయముగా చేసికొని దిగుదురు. అట్లే కవి శ్రీరంగనాథుడను మధురమైన నదీ ప్రవాహములో అవగాహించుటకు ప్రారంభించి, అందు మొదటి స్థానమగు స్వామి పాదమునకు ఒక తామరపూవును దృష్టాంతముగా చేయుచున్నారు.

నిత్యమైన శోభ, చల్లదనము సౌగంధ్యము, అందము అనునవి ఈ రెండిటికిని సమానము కదా ! అందుచే ఈ ఉపమానము సార్థకము. సూర్యుని సమక్షమున వికసించు తామరవలె ఈ దివ్యసూరిని చూచి వికసించు తామర ఇది. (సూరి శబ్దము సూర్యుని, ఈ దివ్యసూరిని తెలుపునుకదా ). లక్ష్మీదేవి తన స్తన తటములయందు, నేత్రములయందు హత్తుకొను పాదములివి. "చిగురు వంటి స్వామి పాదములు" (తిరునెడు- 1) అని పరాకాలసూరి పల్కిరి. **"అమ్మాన్ తిరుక్కమలపాదమ్"** అను పదముల సమభివ్యాహారముచే పొందబడు పురుషార్థమును పొందించునదియగు పాదము అను అర్థమును స్ఫురించుచున్నది.

**వన్దు - "విధిశివసనకాద్యైః యాతు మత్యంతదూరమ్"** (స్తోత్రరత్నే -47) అనునట్లు బ్రహ్మ, శివుడు, సనకాదులు మొదలగు వారిచేకూడా తలచుటకు అరుదైన స్వామి పాదములుకదా స్వయముగా నావరకును వచ్చి, అనుగ్రహించినవి ! ద్వీపాంతరమునుండి ఏదైన వస్తువు కొని రావలసి యున్నచో అంచెలంచెలుగా దారిలో దానిని తీసికొని వచ్చుటయును, సహాయముగ ఒకనిని ఆశ్రయించుటయును చేయవలెను కదా ! అట్లుకాక, "నీవే నిర్హేతుకముగా కరుణించివచ్చి నీదాసుడనగు నామనస్సున ప్రవేశించితివి" (కలివైరి. సూ.- 3-5-1) అనునట్లు దారిలో వచ్చిన వాడు అతడే, ఆశ్రయించిన వాడును అతడే అని భావము. అనగా స్వామిపాదములే స్వయముగా వచ్చి, దివ్యసూరిని అనుగ్రహించినవి అని భావము.

**నీతివానవన్ ఎన్కణ్ణినుళ్ళన** - సదా దర్శనము చేయు వారి (నిత్యసూరుల) నేత్రములకు కానవచ్చునవి కదా నా కన్నులకు లక్ష్యమైనవి. లౌకిక విషయములను వేనినో చూచిన నా కన్నులకు స్వామి పాదములు లక్ష్యములగు చున్నవికదా ! ఉన్న దినములలో ఎల్లప్పుడు విరోధమును చేసికొంటిని, శక్తి సన్నగిల్లగానే కన్నులను మూసికొంటిని, అపుడు స్వామిపాదములు నా కన్నులను తెఱచి, లోనికి ప్రవేశించి నిలచుటచే ఆ పాదములు నా కన్నులలో నున్నవి అనియు భావము.

లేక, నా ప్రాకృతనేత్రములతో దర్శించుట భగవానునకు దోషావహమని తలచితి మూసికొంటిని. కాని, వెంటనే ఆ పాదములు నా కన్నులలోపల మానసికముగా గోచరింపసాగినవవి అనియు చెప్పవచ్చును. (ఈ అర్థములు "ఎన్" అను సర్వనామశబ్దమువలన స్ఫురించుచున్నవి)

**ఒక్కిన్ఱ** - ప్రయోజనము ఇద్దఱికిని సమానముగానున్నది. అదెట్లనగా- భగవానునకు శీలగుణత్వసిద్ధి. వీరికి స్వరూపసిద్ధి. భగవానుని పాదముల అందము నా కన్నులకు గోచరించినను నా పూర్వపు స్థితి మారకున్నది- అని పల్కుచున్నారని, లేక, లోకములోనున్న సంసారులను చూచి "ఈ పాదముల దర్శనము మీకును తగునుకదా" అని పల్కుచున్నారు అనియు చెప్పవచ్చును.

**మునివాహనభోగము :**

**అమలన్** - అనగా హేయగుణములు లేనివాడని భావము. దీనిచే మోక్షప్రదత్వము తెలుపబడినది. ఇది ప్రధానమైన రక్షకత్వమగుటచే ప్రత్యేకముగా తెలుపబడినది. **ఆది** - **"ఏష కర్తా న క్రియతే"** ఇత్యాదిగా తెలుపబడిన సర్వజగదేకకారణభూతుడు అని అర్థము. దీనిచే **"కారణం తు ధ్యేయః"** అనురీతిలో ముముక్షువునకు శరణముగా ఆశ్రయణీయుడని ఏర్పడినది. రాజునకు ఛత్రచామరములవలె ఈ కారణత్వము, మోక్షప్రదత్వమును, సర్వలోకశరణ్యుడైన భగవానునకు విశేషచిహ్నములు. **పిరాన్** - **"కరుణా క్వాఽపి పురుషే"** ఇత్యాదిగా తెలుపబడిన సర్వోపకారకుడు అని అర్థము. ఇచట ఎట్టి ప్రత్యుపకారాదులను ఆశింపని స్వామి జీవుల సత్తాదిస్థాపనము మొదలు పరిపూర్ణ కైంకర్యప్రదానమువఱకుచేయు దయాకృత్యములన్నియు సామాన్యముగా తెలుపబడినది. ఇవి అన్నియు అష్టాక్షరిలోని ప్రథమాక్షరార్థమైన (అకారార్థమైన) రక్షణయొక్క ప్రకారములు. ఇవి తనయందు పర్యవసించినవనుటను మొదటిమూడు పదములు తెలుపుచున్నవి. ఈ అంశము తరువాతి పాశురములలో స్పష్టముగా కాననగును.

**అడియార్క్కెన్నై** - **"అడియార్"** అనుటచే అష్టాక్షరిలోని

తృతీయాక్షరమున తెలుపబడిన జీవవర్గము, జీవులకు ఈశ్వరునకు కల భేదము, జీవుల పరస్పరభేదమును వ్యక్తమగుచున్నవి. **"అడియార్"** అనుపదము సర్వసాధారణముగా అష్టాక్షరిలోని**"నారాయణాయ"** అను పదముచే సూచింపబడిన భక్తులనందఱను సూచించుచున్నను, విశేషించి ఇచట **"యోహ్యేనం పురుషం వేద దేవా అపి న తం విదుః"** అను రీతిలో అపరిచ్ఛేద్యమాహాత్మ్యమును కల శేషత్వజ్ఞానరసికులను తెలుపును. ఇట్లు **"అడియార్"**అనుచు విశేషోపాదానము చేయుటవలన మధ్యమాక్షరముయొక్క అర్థానుసారము నిరుపాధికశేషి వేరొకడులేకుండుట, కర్మోపాధిని కల ఇతర శేషివర్గముతో తమకు సంబంధములేకుండుటయు తెలుపబడినట్లయినది. సర్వశేషియగుటచే అందఱిని తన ఇష్టమువచ్చినట్లు వినియోగమునుచేయు స్వామిత్వరూప సంబంధమును కలవాడై, నిరంకుశ స్వతంత్రుడగుటచే అందఱిని యథేష్టముగా వినియోగింప కలవాడైన భగవానుడు "అనన్యప్రయోజనులైన నా భక్తులకు నా సంపద సర్వమును వారి శేషము కావలయును." అని నిశ్చయించిన వినియోగవిశేషముచే ప్రపన్నులకు అందఱికిని భాగవతశేషత్వము సహజముగనే సిద్ధించును. అనన్యప్రయోజనులైన భక్తుల భాగవతశేషత్వము అనగా - ఈశ్వరుని విషయమున, భాగవతుల విషయమున శేషత్వమే తప్ప అన్యుల విషయమున శేషత్వము కాదు. ఈ శేషత్వఫలమైన కైంకర్యము అట్టిదే అగుటచే, "నేను నీదాసులకే ఇష్టవినియోగార్హుడను అగునట్లు చేసితివి".(కలివైరి సూ. 8-10-3) అను అవధారణము (ఉకారార్థము) ఇచట వివక్షితము. "వేఱొక దైవము కలదని తలచువారితో సంబంధములేనివాడను అయితిని" అనికదా వేరొక దివ్యసూరుల సూక్తి.

**ఎన్నై అట్పడుత్త** - **"యూయ మింద్రియకింకరాః"** అనునట్లు ఇంద్రియకింకరుడనై, ఉండుటయేగాక అంతకుమించి **"ఈశ్వరోఽహమ్"** (గీతా. 16-4) అని ఉండదగిననన్ను **"అతోఽహ మపి తే దాసః"** అని అహంకారియై యుండునట్లు చేసిన ఉపకారముకంటె, "నేను గ్రహించినది

నీదాసులకు దాసుడనగుట'' అనునట్లు చేసిన భాగవత శేషత్వరూప ఉపకారముకంటెను, వేఱొక గొప్ప ఉపకారముకలదా ? అనుచు ఈ మహోపకారమును దివ్యసూరి విశేషించి పల్కుచున్నారు. ఇది అష్టాక్షరిలోని నమశ్శబ్దార్థము.

"పూర్వము "**అమలన్**" అను శబ్దమును వివరించుచు పల్కిన కర్తృత్వాదులలో రుద్రుడు మొదలగు అన్యజీవులకు అజ్ఞానాది దోషములు ఉన్నట్లు భగవానునకును అజ్ఞానాది దోషములు ఉన్నచో, ఇతనికి (శ్రీరంగనాథునకు) "మోక్షప్రదానమును చేయుగల శక్తికలదా ?" అను సందేహమునకు సమాధానమును పిమ్మట పల్కుచున్నారు. **(విమలన్)** నిత్యనిర్దోషుడని అర్థము. ఇందుచే బద్ధముక్తులకంటె స్వామి విలక్షణుడు అని ఏర్పడుచున్నది. ఇట్టి వ్యావృత్తి అనంతాది నిత్యసూరులకును కలదుకదా ! అన్నచో, **విణ్ణవర్‌కోన్** పరమాత్మాధీనమగు పవిత్రతను కల నిత్యసూరులకంటె విలక్షణుడు అని భావము. దీనిచే నిత్యసూరి సేవ్యమైన పరరూపమును శ్రీరంగనాథునియందు కలదని స్ఫురించును. ఇట్లు అందనంత ఎత్తులోనుండు స్వామి స్థితి ఇచటివారికి అందనిది కదా ! అనినచో, **(విరైయార్‌పొళ్లిల్‌వేఙ్గడవన్)** - సౌగంధ్యము రూపునొందినట్లున్న తోటలనుకల వేంకటాద్రిలో "భూలోకవాసులకు, స్వర్లోకవాసులకును నేత్రభూతుడు" (శఠ.సూ. 1-8-3) అనునట్లు అందఱికిని ఆశ్రయించుటకు, దర్శించుటకును వీలగునట్లు తమోమయమైన ఈ లోకమున వేంకటాద్రిపై నిలపిన దీపమువలె నుండువాడు. నిరవధికమైన గొప్ప ఆనందమును కలవారి సంతోషముకంటె "స్వామి బంగారు పర్వతముపై ఏమైనను కాగోరెదను'' (కులశేఖర సూ. 4-10) అనునట్లు అచట పుట్టిన స్థావరముల ఆమోదము మిక్కిలి అతిశయితమై యుండును. ఇట్లు సర్వసులభుడైనను "అట్టిప్రకారమునుకల వానియొక్క స్థితినిజూచి, చెలీ ! వారిని వేమను దేవుడని తలచి భయపడితివే.'' (తిరునెడుం. 21) అనునట్లుండునా? అనినచో, **(నిమలన్)** బ్రహ్మరుద్రాదులను భయపడి

దూరముగా తొలగదగిన ఐశ్వర్యాదులను కలవాడైనను, కుఱుమ్బఱుత్తనమ్బి (కుమ్మరిభక్తుడు) వంటివారు ఏమాత్రము సందేహింపక నిరంతరము సేవించునట్లు సర్వ సులభుడై తన ఈశ్వరత్వమను ఆశ్రయణవిరోధి స్వరూపమును మఱుగుపఱుచువాడు అని అర్థము. **"అర్చకపరాధీనాఖిలాత్మస్థితిః"** (శ్రీరంగరాజస్తవే. ఉత్తర -74) అనునట్లు ఆశ్రితపారతంత్ర్యమును ప్రకటించియున్నవాడు కావున నిమలుడు అని అర్థము. ఇట్లు సౌలభ్య, సౌశీల్యములున్నను ఆశ్రితుల దోషములను పరిగణించువాడైనచో, వారిని దఱిచేరుటకు సందేహించునుకదా ! అనినచో, **(నిన్మలన్)** **"అవిజ్ఞాతా"**, (శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రే) "నాదాసులు దానిని (తప్పును) చేయరు" (భట్టనాథసూక్తము) అనియును పల్కురీతిలో ఆశ్రితులదోషములను చూచునను శరణ్యదోషమును లేనివాడు. సర్వజ్ఞుడైనను, ఆశ్రితుల దోషములను గమనింపడు అనుటలో అర్థమేమి ? అనగా, దోషములను భగవానుడు చూచుట ఆదోషములను పోగొట్టుటకొఱకే అనిఅర్థము. **"విమలన్"** అను విశేషణమునుండి వరుసగా ఐదు పదములలో అష్టక్షరీమహామంత్రములోని నారాయణ పదములోగల ఉపాయత్వ, ప్రాప్యత్వములకు ఉపయుక్తములైన ఉభయలింగత్వము, ఉభయవిభూతి నిర్వాహకత్వమును చెప్పబడినవి. ఇక, జీవుని స్వరూపప్రాప్త కైంకర్యమను నిధిలో ఆసక్తులైన నిత్యసూరులకు సేవ్యుడైనట్లే, స్వామి మనకును సేవ్యుడగును అనునట్టి చతుర్థీవిభక్తిలోని అర్థమువలన స్ఫురించు స్వామియొక్క కైంకర్యప్రతిసంబంధిత్వమును ఇకపై కవి అనుసంధించుచున్నారు.

**నీదివానవన్** - ఇచట **"వాన్"** (ఆకాశము) అనుపదము నిత్యసూరులతోకూడిన పరమపదమును సూచించును. నీతిని నడిపింపచేయు పరమాకాశములో నున్నవాడు అనియును అర్థము. అనగా పరమపదము **"తేన వంచయతే లోకా న్మాయాయోగేన కేశవః"** (భార. ఉద్యో. 67-15) అనునట్లు కలతను పొందించువాడు, **"అవజానంతి మాం మూఢాః"** (గీతా. 9-11)

అనునట్లు కలతపొందువారును లేని దేశమగుటచే, **"దాస్య మైశ్వర్యయోగేన జ్ఞాతీనాం చ కరోమ్యహమ్"** (భార. శాంతి. 81-5) అనియు, **"పరమేశ్వర సంజ్ఞోఽజ్ఞ కిమన్యో మయ్యవస్థితే"** (వి.పు. 1-7-23) అనియును పల్కురీతిలో ఇచటగల ~~ఈశ~~ - ~~ఈశి~~తవ్యక్రమ విపర్యయ దోషములేని పరమపదమున నిత్యనివాసమును చేయువాడు అని తెలిపినట్లయినది. ఇట్లు సర్వసేవ్యుడైన, సర్వశేషి యగు శ్రీ రంగనాథుడు **"విబీడణఱ్కు వేఱాగనల్లాన్"** (విభీషణనకు విశిష్టమైన రీతిలో సేవ్యుడు- పరకాల.సూ. 6-8-5) అను విధమున తమకిపుడు శ్రీరంగనాథుడు అనుభవింప వీలయినక్రమమునుగూర్చి కవి తెలుపుచున్నారు. **నీళ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్** అయోధ్యఅని, అపరాజిత అని చెప్పబడు, కలతలేనట్టి గొప్పనగరమైన పరమపదముయొక్క క్రమమును, ''ధ్వజములను అలంకారముగా కల దీర్ఘములైన ప్రాకారములచే'' నురక్షితమైన స్థలవిశేషములనుచూచి, ఇక ఇంతకంటె ఔన్నత్యమును లేదను అతిశయమునుకల నిత్యసూరులకు అధిపతియైన తన రీతిని, "అధికారదండమును కల, శ్రీరంగములోని శ్రీమంతుడు'' (గోదా. సూ.) అగు తన అకారవిశేషముచే తెలిపి, తన శేషిత్వపరాకాష్ఠలో తాను ఉన్నట్లే, శేషత్వపరాకాష్ఠలో నన్ను నిలిపిన స్వతంత్రుడైన స్వామి- అని **"నీదివానవన్ . . అమ్మాన్"** అను ప్రయోగము యొక్క పిండితార్థము. **(అరఙ్గత్తమ్మాన్)** సౌలభ్యమునకును, పరత్వమునకును పరాకాష్ఠ అయినవాడు అనియు అర్థము. ఇది వరుసగా **"అరఙ్గత్తు, అమ్మాన్"** అను పదముల ద్వారా స్ఫురించును. ఇకపై కవి భగవానుని ఉపాయత్వ- ప్రాప్యత్వములలో గొప్పఅతిశయమునుగల స్వామిపాదములను వర్ణించుచున్నారు.

**తిరుక్కమలపాదమ్** - పావనత్వ, భోగ్యత్వములచే శుభాశ్రయములైన పాదములు అని, లక్ష్మీదేవికి లీలాకమలమువలె నున్న పాదములు అనియు అర్థము. **(వన్దు)** - వచ్చి అనిభావము. దీనివలన వెనుకంజవేసిన దివ్యసూరిని స్వామి అనుసరించుటయు, స్వామిపాదములు అయత్నలబ్ధములగుటయును

స్ఫురించుచున్నవి. ఇక ఈ పాదములందు ప్రసరించిన తమ దృష్టిని, తిప్పుకొనలేనట్టి భోగ్యతాతిశయములను అది కల్గియుండుటను దివ్యసూరి ఒక ఉత్ప్రేక్షతో తెలుపుచున్నారు. **ఎన్కణ్ణినుళ్లన వొక్కిన్ఱద** - దేవతలలో గొప్పవారైన బ్రహ్మాదులయొక్క, సనకాది యోగులయొక్క దివ్యచక్షువులకును దూరమైయుండు స్వామిపాదములు నా మాంసచక్షువులకు దగ్గఱ అయినవికదా ! అని ఆశ్చర్యపడుచున్నారు. ఈ అర్థము ఇచటి (ఏ అను) కాకుస్వరముచే స్ఫురించుచున్నది.

ఈ గాథద్వారా దివ్యసూరి వరుసగా భగవానుని మోక్షప్రదత్వమును (అమలశబ్దార్థము), జగత్కారణత్వమును, శరణ్యత్వమును, (ఆదిశబ్దార్థము) సర్వప్రకారోపకారత్వమును, కృపావిశేషవత్త్వమును (పిరాన్ శబ్దార్థము), స్వాతంత్ర్యమును, వీనిలో సారతమమైన ఉపకారాదివిశేషమును, నిత్యనిర్దోషత్వమును (అడియార్క్కెన్నై. . . విమలన్ అను ప్రయోగముయొక్క అర్థము), నిత్యసూరినిర్వాహకత్వమును (విణ్ణవర్కోన్ శబ్దార్థము), సర్వసులభత్వసౌశీల్యములను (నిమలన్ శబ్దార్థము), నిత్యవిగ్రహవత్త్వమును (విరైయార్. . .వేఙ్గడవన్ ప్రయోగార్థము), వాత్సల్యము (నిన్మలన్ శబ్దార్థము), కైంకర్యోద్దేశ్యత్వమును (నీదివానవన్ శబ్దార్థము), కైంకర్య స్థానవిశేషమును కలిగియుండుటను (నీళ్మదిళ్ అరఙ్గత్తు శబ్దార్థము), సర్వస్వామిత్వమును (అమ్మాన్ శబ్దార్థము), భగవానుని పాదముల పావత్వము, భోగ్యత్వములను (తిరుక్కమల పాదమ్ శబ్దార్థము), వానిని తాము అనాయాసముగా, అనన్యదృష్టిని కలవారై దర్శించిన తీరును (వన్దు ఎన్ కణ్ణినుళ్లన ప్రయోగార్థము) - వీనిని పురస్కరించుకొని భగవానుని పరాకాష్ఠాప్రాప్తమైన గుణప్రకర్షను అనుసంధించిరి.

వీనిలో సంసారనివర్తకత్వ (మోక్షప్రదత్వ) పరాకాష్ఠ ఏమనగా- దోషరహితమైన కైంకర్యమును ఇచ్చుట. కారణత్వకాష్ఠ అనగా - మిగిలిన కారణములన్నిటిని తన చెప్పుచేతలలో కలవాడై, తనకుకాని,

తనజ్ఞానశక్త్యాదులకుకాని ఏదైన వేఱొక కారణమును కలవాడను సంభావన లేకుండయుండుట. శరణ్యత్వకాష్ఠ అనగా - తనను రక్షకునిగా ఆశ్రయించిన వారికి తనను తప్ప వేఱొకరిని రక్షకునిగా ఆశ్రయింపనక్కఱలేకుండనుండుట. ఉపకారత్వపరాకాష్ఠ అనగా - క్షుద్రవ్యాజమును నెపముగా గొని ఉభయవిభూతి యుక్తుడగు తనను అనుభావ్యునిగా అనుగ్రహించుట, అంతకు మించి ఇచ్చుటకు ఏమియు మిగలకుండుటచే తనను **"ఋణం ప్రవృద్ధ నివమే హృదయా న్నాపసర్పతి"** అనురీతిలో నిత్యఋణిగా తలచుట. కృపాకాష్ఠ అనగా - తనను చేరవచ్చినవారు శత్రువునకు సంబంధించినవారు కావున విడువతగినవారు అని వాదించు భక్తులముందు ఆ శత్రువే స్వయముగా వచ్చినచో స్వీకరించెదను అని ఎదురుపల్కు దయనుకలవాడై, వారును వలదన్నను ఇతనిని (శరణగోరి వచ్చినవారిని) స్వీకరించునట్లు చేయుట. (తనను శరణుగోరి వచ్చిన విభీషణుని సుగ్రీవాదులు అంగీకరింపరాదని వాదించినపుడు శ్రీరాముడు రావణుడే స్వయముగా వచ్చినను స్వీకరించెదనని పల్కుటయే కాక, ఆ సుగ్రీవాదులచేతనే విభీషణుని స్వీకరించునట్లు చేయుట స్మరణీయము.) స్వాతంత్ర్యపరాకాష్ఠ అనగా - తనను, ఇతరులను తాను తలచిన (స్వామిత్వ - స్వామ్యత్వ) అవస్థాదులలో నిలుపునపుడు అడ్డుకొనవారు లేకుండనుండుట. నిర్దోషత్వకాష్ఠ అనగా - దోషయుక్తములైన పదార్థములతో గల సంబంధముచే ఇతరులకు అజ్ఞానదుఃఖహేతువులైనవానిని తాను అనుష్ఠించినను తనకు వానివలన ఎట్టి అజ్ఞానదుఃఖములు కలుగకుండనుండుట. స్వామిత్వకాష్ఠ అనగా - విభూతిమత్త్వముల నన్నిటిని తనకు సంపదగా కల్గియుండుట. సౌలభ్యకాష్ఠ అనగా - తనకు దూరముగా పోవలెనని తలచువారును దూరముగా పోలేనట్లు వారికి దగ్గఱగా నుండుట. సౌశీల్యపరాకాష్ఠ అనగా - తనయందు ఈశ్వరత్వమును శంకించువారికిని, ప్రకటించువారికిని తానే తగిన బదులుపల్కి, తనను అధఃకరించుకొని వారిని కలయుట. వాత్సల్యకాష్ఠ అనగా - లక్ష్మివంటి అంతరంగులైన వారు సయితము

ఆశ్రితవిషయమున పలు దోషములను చూపినను వారిపట్ల అనాదరము కలుగకుండుట. ప్రాప్యత్వకాష్ఠ అనగా - తన విశేషణముగా తప్ప వేఱొక ప్రాప్యము ఏదియు లేకుండనుండుట. ఆశ్రితపక్షపాతిత్వకాష్ఠ అనగా - సర్వసముడైన తన సంకల్పము ఆశ్రితసంకల్పముతో విరోధించినపుడు తన సామాన్యసంకల్పమును అసత్కల్పముగా చేసికొని, అనితరసులభమైన ఆదరమును ఆశ్రితునిపట్ల ప్రదర్శించుట, భోగత్వపరాకాష్ఠ అనగా - తన స్వరూపమును దర్శించినచో తన విశేషణముగానే మిగిలిన దానినంతటిని భక్తులు అనుభవించునట్లు చేయుట, ఆ అనుభూతాంశము తన వైభవముయొక్క సూక్ష్మాంశముతో సమానమగుట. అయత్నభోగ్యత్వకాష్ఠ అనగా - భోగముకొఱకుగా కరణప్రేరణము అక్కరలేనట్లు, మలమారుతము, పరిమళము మొదలగువాని అవసరములేనట్లు అనుభావ్యుడై యుండుట. వీనినన్నిటిని దివ్యసూరి ప్రకృతగాథలోని ఆయా పదములలో అనుసంధించినట్లు భావింపనగును.

2. **ఉవన్ద వుళ్లత్తనా యులకమళన్దణ్డముఱ**
**నివర్న్దనీణ్డముడియ నన్దునేర్న్ద నిశాశరరై**
**క్కవర్న్ద వెఙ్కణైక్కాకుత్తన్ కడియార్పొళ్లిలరఙ్గత్తమ్మా న్రై**
**చ్చివన్ద వాడైయిన్ మేల్ శెన్దదా మెన్శిన్దనైయే**

ఉవన్ద ఉళ్లత్తనాయ్ = (నన్ను వశీకరించుట వలన) ఆనందించిన మనస్సును కలవాడై, ఉలకమ్ అళన్దు = మూడు లోకములను కొలిచి, అణ్డముఱ = బ్రహ్మాండములందు అంతట నిండునట్లు, నివర్న్ద = వ్యాపించినవాడై, నీణ్డ ముడియన్ = సమస్తరాజ్యములకు అధిపతి అనుటను తెలుపునట్టి కిరీటమును కలవాడై, అన్దు = జనస్థానములో నున్నపుడు, నేర్న్ద = ఎదిరించిన, నిశాశరరై = ఖరదూషణాది రాక్షసుల ప్రాణములను, కవర్న్ద = అపహరించిన, వెమ్ = క్రూరమైన, కణై = బాణములను కలవాడై, కడియార్ = సుగంధమునిండిన, పొళ్లిల్ = తోటలనుకల, అరఙ్గత్తు = శ్రీరంగమున శయనించియున్న,

అమ్మాన్= సర్వస్వామియైనవానియొక్క, అరై = కటియందు (నడుమునకు) అలంకరించిన, శివన్ద ఆడైయిన్‌మేల్ = పీతాంబరముపై, ఎన్ శిన్దనై = (పూర్వము యువతుల విషయమున ఆసక్తమైన) నా మనస్సు, శెన్ఱదు ఆమ్ = చేరినదే! (లగ్నమైనదికదా !), ఏ = ఆశ్చర్యము !

వ్యాఖ్య : మొదటిగాథలో **"అరఙ్గత్తమ్మాన్ తిరుక్కమల పాదమ్ వన్దు ఎన్‌కణ్ణినుళ్లన ఒక్కిన్ఱదే"** అని శ్రీపాదములు తామే అనుగ్రహించిన తమ మనస్సులో ప్రకాశించుటను తెలిపిరి. ఈ గాథలో "వచ్చి నీ దాసుడనగు నా మనస్సున ప్రవేశించితివి, ప్రవేశించిన పిమ్మట నీకునమస్కరించు నామనస్సునకు భోగ్యుడవైతివి" (కలివైరి.సూ.- 3-5-1) అనురీతిలో అతడు అనుగ్రహించి, మనసున ప్రవేశించిన పిదప శ్రీపాదములను సేవించుటతో మాత్రము తమ మనస్సు నిలువక, అనంతరము పీతాంబరమువరకును అనుగమింప ఆశపడిన రీతిని తెలుపుచున్నారు. అపుడే ప్రసవించిన ధేనువు లేగదూడకు పూర్వము పాలుతాగు అలవాటు లేకుండుటచేత తన స్తన్యమును దూడనోటిలో పెట్టును. పిమ్మట ఆదూడ పాలయొక్క మాధుర్యమును గ్రహించినది అగుటచే, తల్లి ఆవు తనను కాలితో తన్నినను, పరుగెత్తుకొనివచ్చి పాలుతాగుటకై దానిపై పడును. ఆవిధముగానే భగవానుని పాదములే స్వయముగా తనమాధుర్యమును దివ్యసూరికి అనుగ్రహించిన రీతిని మొదటి పాశురమున తెలిపిరి. ఇందు తమ మనస్సు ఆ పాదముల మాధుర్యమును రుచి చూచి, తానే స్వయముగా అభిమానించుటను తెలుపుచున్నారు పాదములందు లగ్నమైన మనస్సు పీతాంబరమునందు లగ్నమగుట ఎట్లు? అనినచో, తానే భోగ్యతను తెలిసి దఱిచేరినచో, ఆ విషయముయొక్క పరిమితివలన భోగ్యతకు పరిచ్ఛిన్నత కలిగి, కొఱతయే ఏర్పడును, కాని, ఆవిషయమే స్వయముగా అభిమానించినచో అట్టికొఱతలేమియు ఉండదుకదా ! దీనివలన పాదముల భోగ్యత పరిమితమగుటయు అర్థము కాదు. లేక, పాదములయందు ఆశ పరిమితమగుటచే దానిని విడుచుటయును కాదు. సముద్రము పొంగి, అందు కెఱటములు లేచినపుడు, ఆ సముద్రము లోపలనున్న

తృణఖండము, అందు పొంగు ఉపశమించిన పిదపనే తీరము చేరునా ఏమి? అది ఒక కెఱటమునుండి వేరొక కెఱటమును చేరి, క్రమముగా తీరము చేరును కదా ! అట్లే పాదములందు లగ్నమైన దివ్యసూరిమనస్సు తనకు తెలియకనే భగవానుని లావణ్య సాగరములో కెఱటముల తాకిడిచే ఒకచోటనుండి వేరొక చోటికి పోవుచున్నది అంతియే.

ముందుపద్యములో కృతికర్త, **'నిమలన్', 'నిన్మలన్' అనుచు** అని శ్రీరంగనాథుడు తమ అభిలాషను ఎదురుచూడకనే తమకు తగిన ప్రయోజనమైన శ్రీపాదములను అనుగ్రహించుటను తెలిపిరి. **"రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** (లక్ష్మీతంత్రే. 17-78) అని భగవానుడు రక్షింపబడు జీవాత్మయొక్క అపేక్షను ఎదురుచూచునుకదా ! అందుచే ఇది సంగతముగా తోచుటలేదే ? " అనినచో, ఈలోకమంతయు అన్య శేషమైయుండగా, దానిని తనది అని మహాబలి తలచినపుడు, లోకుల అపేక్షను ఎదురుచూడకనే వారి శిరస్సులపై తన పాదములను పెట్టినవాడుకదా కదా స్వామి ! అందుచే ఇట్లు నిర్హేతుకవిషయీకారము స్వామికి కొత్తది కాదు, సహజమే ! ప్రాచీనమే - అనుటయు ఈ వృత్తాంతమున స్ఫురించును.

**ఉవన్ద ఉళ్లత్తనాయ్** - దివ్యసూరిని వశీకరించుటచే కలిగిన ఆనందము.ను **"ఉవన్ద"** అను పదము తెలుపుచున్నది. సర్వేశ్వరుడై , శ్రియఃపతియై, అవాప్తసమస్తకాముడై **"అవాక్యనాదరః"** (ఛాందో. 3-14-2) అనునట్లు సంపూర్ణుడైన భగవానుడు **"కదా పునః శంఖరథాంగకల్పకధ్వజారవిందాంకుశ వజ్రలాంఛనమ్, త్రివిక్రమ! త్వచ్చరణాంబుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి"** (స్తోత్రరత్నే-31) అనియు, "భూమికి అనురూపముగా విస్తరించిన ఈ పాదపంకజములనే నాతలకు అలంకరింపుము." (శఠ.సూ. 9-2-2) అనియును కొందఱు అపేక్షించినట్లు కాక, ఎవరును అపేక్షింపకనే, **"పాదారుంతుద మేవ పంకజరజః"** (శ్రీగుణరత్నకోశే) అను మార్దవమునే కల్గినదై, లక్ష్మీదేవి తన మెత్తని చేతులతో స్పృశించుటనుకూడ సహింపనివైన ఆ పాదములను

మెట్టపల్లములను చూడక, చేతనాచేతన విభాగమును చేయక, వ్యాపింపచేసెను. "స్వామి ఇట్లు గొప్ప ఉపకారమును చేయుటయా?" అని లోకులు సంతోషింపవలసియున్నది. కాని, వారట్లు సంతోషింపకున్నను "వీరి ఇట్టి అవివేకము కారణముగా నా ప్రయత్నమునకు అడ్డులేకుండపోయినది కదా !" అని రెండింతలుగా సంతోషించిన మనస్సును కలవాడయ్యెను. చిన్నపిల్లలు స్తన్యమును ఇట్టిది అని తెలియకనే, దానినుండి పాలును తాగగా, చూచి సంతోషించును కదా తల్లి. అట్లే నా విషయమునను ఆనందించిన మనస్సును కలవాడై- అని ఈ ప్రయోగతాత్పర్యము.

**"కృతకృత్య స్తదా రామః విజ్వరః ప్రముమోద హ"** (రా.బాల. 1-85) అని విభీషణుడు తనతో, తన తమ్ములతోగల సంబంధమున లంకారాజ్యాభిషేకమును తిరస్కరించునని దుఃఖపడిన శ్రీరాముడు, రావణుని వధానంతరము అతడు (విభీషణుడు) సమ్మతించి పట్టాభిషేక మొనర్చుకొనినతరువాత సంతోషించినట్లు, ఈ కృతికర్తయొక్క అద్వేషమునే హేతువుగా గ్రహించి, తన పాదములను వారిపై పెట్టనీయుటకు వారు సమ్మతించుటచే స్వామి మిక్కిలి ప్రీతుడై- అనియు అర్థము. నిద్రించు సంతానమును దగ్గఱకు తీసికొనుట తల్లి వాత్సల్యకార్యము కదా ! ఆ సంతానమును విశ్లేషించిన కల్గు వ్యసనమును ఆ తల్లిదేకదా ! **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (రా. అయో. 2-40) అనుచు వాల్మీకి ఈ అంశమును శ్రీరామునియందు సూచించెను కదా !

**ఉలకమళన్ద** - కులీనుడు- తక్కువ కులమువాడు, పురుషుడు- స్త్రీ, జ్ఞాని-అజ్ఞాని మొదలగు భేదములను వేనిని గమనింపక అందఱి తలలపై సమానముగా తన పాదములను పెట్టిన త్రివిక్రమ వృత్తాంతము దీనిచే ప్రస్తుతము. అట్లుపెట్టిన పాదములు తమ శిరస్సులను స్పృశించినను ఆనందించుట తెలియని లోకమును కదా పాదములు విడువక కొలిచినవి ! గుణము కల్గినది- గుణములేనిది అను ఈ రీతిలో విచారింపక, అందరిపై పాదములను పెట్టుటచే భక్తులు, పాతకులు అందఱును సమానముగా తరించిరి.

**అణ్డముఱ నివర్న్ద నీణ్డముడియన్** - ఆకాశముయొక్క అగ్రభాగమును తాకిన కిరీటమును కలవాడు. తాను ఆశించినది పొందుటచే కలిగిన ఆనందమువలన అండకటాహము భిన్నమై చెదఱు రీతిలో త్రివిక్రముని కిరీటము ఎదిగినది. "అణ్డభిత్తి, ఆవరణముల లోపల ప్రవేశించునట్లు కిరీటము, పాదములు వృద్ధిచెందగా'' (శఠ. సూ.- 7-4-1) అనిరి కదా శ్రీశఠకోపులు ! **"నివర్న్ద"** అను పదమునకు ఉచ్ఛ్రాయము అని, ఎదిగి అనియు అర్థము. **"ఉఱ"** అనుటకు ఎదిగి అని అర్థము.

నివర్న్ద - పూవు వికసించినట్లు., అని భావము.

**నీణ్డ ముడియన్** - ఇచటి కిరీటమునకు ఔన్నత్యమేమనగా భూలోకపు ఐశ్వర్యమునకు గుర్తుగా ధరించిన కిరీటమని తోచునట్లుండుట. **"ఆధిరాజ్య మధికం భువనానామ్ ఈశ ! తే పిశునయన్ కిల మౌళి:"** (వరదరాజస్తవే- 25) అని **"కిరీటచూడరత్నరాధిరాజ్యజల్పికా"** (శ్రీరంగరాజస్తవే. పూర్వ.) అనియు పల్కురీతిలో రక్షింపబడవలసిన సమూహమును దృష్టిలోనుంచుకొని కదా రక్షకుడు కిరీటమును చక్కగా ధరించియుండు **"ఒర్నుకాలుమ్ కామరుశీర్ అవుణనుళ్లత్తు ఏణ్మదియుమ్ కడన్దు"** (తిరునెడు-5) అని పాదముల ఉచ్ఛ్రాయమును వర్ణింపవలసియుండగా, కిరీటమునకు ఔన్నత్యమును పల్కుటలో ఏమి అభిప్రాయము ? అనగా ఈ పాదములు అప్రాప్తములు కావు. శాస్త్రములలో నిర్ణయింపబడినవే అని తెలియుటకొఱకు అనిభావము.

**ఉవన్ద** - తాను యాచకుడై వెడలినకాలమున యాచించిన రీతిలోనే అతడు (బలి) ఇచ్చుటచే సంతోషించిన మనస్సుకలవాడై.

**ఉలకమిత్యాది** - బలి దానముచేయుపుడు తన చేతిలో జలము పోయగానే ఆనీటినే ధారకముగాగొని, స్వామి పెరిగి, లోకములను కొలిచెనని భావము.

ఈ విధముగా ఎవరును ప్రార్థింపకనే లోకమును తనపాదములతో

అనుగ్రహించినట్లు, మీ నైచ్యమును చూడకనే **"అరవిన్దప్పావైయుమ్ తానుమ్ అకమ్పడి వన్దుపుకున్దు"** (లక్ష్మీదేవియు తానును మనస్సులోనికి వచ్చి ప్రవేశించి భట్టనాథ సూ. 5-2-10) అని స్వయముగా మనసున ప్రవేశించిన వాడైనను, మీ మనస్సు దుఃఖము మొదలగు దోషములను కల్గినదగుటచే అచట స్వామి కాలును నిలుపలేడుకదా ! కావున మీరు ఆ దోషములను పోగొట్లుకొన ప్రయత్నింపుడు అనినచో, అందులకు సమాధానమును అనంతరసూక్తితో దివ్యసూరి పల్కుచున్నారు.

**అన్ఱు నేర్న్ద నిశాశరై క్కవర్న్ద వెజ్కణైక్కాకుత్తన్** - దర్శించిన వెంటనే **"జితం తే"** (జితంతా -1-1) అని మంగళాశాసనముచేయబడ తగినవాడుకదా స్వామి. అట్టి భగవానుని అసురులు చూచి సహింపలేక ఎదిరించిరి కదా? అను భావము. **"అన్ఱు నేర్న్ద"** అను ప్రయోగమువలన ధ్వనించును. అట్లు ఎదిరించిన దుష్టులను సంహరించుటకు తగిన క్రూరములైన బాణములను కలవాడు స్వామి. శ్రీరాముడు **"శ్రియా సార్థమ్"** (శైవపురాణమ్) అనునట్లు సీతాదేవియు, నిత్యసూరులవలె సర్వవిధబంధువైన లక్ష్మణుడును కలసి దండ కారణ్యమునకు పోయిరి. అచటికిని భరతుడు వచ్చి, వెంటబడుటచే, అచటనుండలేక వారు జనస్థానమును చేరిరి. ఆ అరణ్యమున నివసించు మునులున్న చోటికి చేరి **"అవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే"** (రా. ఆ. 5-33) "మీ కంటి ముందు నివసింపగోరుచున్నాము. మాకు చోటు ఇవ్వవలెను." అని ప్రార్థింపగా, వారును అచట ఉండటకు అనుమతించిరి. రామాదులు చక్కని పర్ణశాలను నిర్మించి, వాస్తు శాంతి బలి మొదలగు వానిని నిర్వహించి, అందు నివసించుచుండిరి. అపుడు ఋషులు **"ఏహి పశ్య శరీరాణి"** (రా. ఆ. 6-16) అనుచు ఆ రాక్షసులు తమను బాధించు రీతులను అన్నిటిని శ్రీరామునకు విన్నవించిరి. అనంతరము. ఖరదూషణాదులు విరోధులైవచ్చి ఎదిరింపగా, ఋషులను రూపుమాపిన ఆ రాక్షసులను తమ వింటితో బాణ వర్షమును కురిపించిన శ్రీరాముడే, తమ "రాగము మొదలగు దోషములను

వివేకమను బాణముతో నశింపచేసి". (సాత్త్వత సంహిత- 12-51) "ఆదిశేషుడను పడుకయు, అందమైన పాలకడలియు, తామరపూవు జన్మస్థానముగా కల లక్ష్మీదేవియు, తాను" (భట్టనాథ.సూ. 5-2-10) అని తమ మనస్సు నిండునట్లు ప్రవేశించియున్నవాడు అని కవి అనుచున్నారు.

**అన్ఱు** - జనస్థానములోనున్న ఆనాడు అని, రక్షకుడైన రాముడు అసురులచే బాధింపబడిన మునులను రక్షింపవచ్చిన ఆనాడు అనియు అర్థము.

**నేర్న్దనిశాశరరై** - మనస్సులో చీకటి (తమోగుణము) అలముకొనియున్నవారే కాక, పాము నిదురలేచి, రాత్రిలో సంచరించునట్లు నరహింసకు ఏకాంతమైన (తగిన) కాలమున వచ్చి, ఎదిర్చిన ఖరదూషణాది రాక్షసులను అని అర్థము. **"నేర్న్దనిశాశరరై"**, అనుటచే విభీషణాదులు వీరికంటే వేరుచేయబడుచున్నారు. వారు ఎదిరించినవారు కారు కదా ! **"విభీషణస్తు ధర్మాత్మా"** అని కదా శ్రీరామాయణ సూక్తి.

**అన్ఱునేర్న్దనిశాశరరై** - **"తే తం సోమ మివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణ, మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః"** (రా. ఆర. 1-11) అని దండకారణ్యవాసులైన ఋషులును, **"రామో రామోరామ ఇతి ప్రజానా మభవన్ కథాః, రామభూతం జగద భూత్ రామే రాజ్యం ప్రశాసతి"** (రా.యు. 131-102) అని అయోధ్యానగర ప్రజలును అందఱును రాముని చూడగానే మంగళాశాసనమును చేయుదురు. అనుకూలురు, ప్రతికూలురు అని బేధములేక అందఱు నోరార కీర్తింపతగిన కాలమున రాక్షసులు ఎదిరించి, నశించిపోయిరికదా ! అని ఈదివ్యసూరి బాధపడుచున్నారు.

**అన్ఱు** - ఇట్లు అందఱు అత్యంతాదరము కలవారైయున్న ఆసమయమున అనియు ఈ పదమునకు భావము.

**నేర్న్ద నిశాశరరై** - ఈ రూపసౌందర్యమునకు జితులు కాకుండ, బాణములను, ఆయుధములను గొని ఎదిరించిన రాక్షసులను అని అర్థము. నిశాచరులు పగలు బయట ముఖమును చూపింపని దుష్టులు.

**కవర్న్ద** - పైనపడిన అని అర్థము. బయలుదేరునపుడు వినయముగా

బయలుదేరి, పిమ్మట వేటకుక్కలు పరుగెత్తుకొని పైబడునట్లు మీదపడిన అని అర్థము. మఱియు, మారీచ, సుబాహులకు పిమ్మట ఏ ఎఱయు దొరుకక పోవుటచే, ఎఱను మింగని సర్పము వలె ఆవురావురుమనుచు రామబాణము శత్రువులపై బడి గ్రహించిన విధము తెలుపబడినదనియు చెప్పవచ్చును.

**వెజ్కణై** - స్వామివంటివే అతని బాణములును. **"దీప్తపావకసంకాశైః శితైః కాంచనభూషణైః, న త్వా మిచ్ఛామ్యహం ద్రష్టుం రామేణ నిహతం శరైః"** (రా.యు. 16-32) అనునట్లు సంధించునపుడు బాణములై, శత్రువులపై పడునపుడు జ్వలించు కాలాగ్ని వలెకదా రామబాణములు ఉండును. "దశరథుడు పొందిన మరకతమణితటాకమును (శ్రీరాముని- శఠ.సూ.)" ప్రవేశించి, శ్రమమును తీర్చుకొనకుండ, ఇట్లు అసురులు నశించిపోవుటను ఈ దివ్యసూరి సహింపలేనివారైరి. శ్రీరాముడు కడగంటి చూపుతో చూచిన మఱుక్షణమున శత్రువులను నశింపచేయు క్రూరత్వమును కల బాణములివి.

**వెజ్కణై** - క్రూరమైన వింటినుండి (శార్ఙ్గము నుండి) వెలువడునవి అగుటచే అవి క్రూరములైన బాణములై యుండును. అతడు అనుకూలురకు చల్లని నీరువలె చల్లనివాడై, ప్రతికూలురకు అగ్నిరూపుడై ఉండునట్లే, బంగారము పొదిగిన బాణములగుటచే అనుకూలురకు (భక్తులకు) అనుకూలములై, (ఆకర్షణీయములై), అగ్నిజ్వాలవలెయుండుటచే ప్రతికూలురకు భయంకరములై కదా శ్రీరామ బాణము లుండును.

శ్రీరామాయణ ప్రారంభమున వాల్మీకి నారదుని చూచి **"కో గుణవాన్, క శ్చ వీర్యవాన్"** (రా.బాల. 1-2) అని ప్రశ్నించెను. అదేరీతిలో వీరును **"ఉవన్దఉళ్ళత్తనాయ్. . ముడియన్"** **(గుణవాన్)** అని, **"అన్తునేర్న్ద. . . . కాకుత్తన్"** **(వీర్యవాన్ )**అనియు పల్కిరి. అందుచే ఇచట శ్రీకృష్ణ చరమశ్లోకములోని **"మామ్, అహమ్"** అను రెండు పదముల అర్థము (సౌశీల్య, వీర్యము)లను కవి తెలిపిరి. ఎట్లన- **"ఉలకమళన్దు"** అని లోకములను కొలిచిన స్వామిపాదముల సౌశీల్యమును గూర్చి పల్కి, **"కవర్న్ద వెజ్కణై కాకుత్తన్"**

అని భుజముల వీర్యమును తెలిపిరి. ఈ సౌశీల్యవీర్య గుణములు రామచంద్ర స్వామికి వైకుంఠనాధుడగుటచే వచ్చినవికావు. కకుత్థ్సవంశమున జన్మించిన కారణమున వచ్చినది అను అర్థము **"కాకుత్తన్"** అను పదముద్వారా వ్యక్తమగుచున్నది.

**కడియార్ పొళ్లిల్ అరఙ్గత్తమ్మాన్** - అట్లు లోకములను కొలుచుటచే కల్గినశ్రమము తీరుటకై, పరిమళము నిండిన తోటలను కల శ్రీరంగమునకు వచ్చి, పాదములను, భుజములను స్వామి శ్రమతీర చాచుకొని పరుండెను. "నీవు ఇచటికి వచ్చి నిద్రించుట హిరణ్యారావణాదులను సంహరించిన శ్రమము తీరుటకా ? ముల్లోకములను కొలిచిన ఆయాసము వలన కల్గిన శ్రమము పోవుటకా ? పల్కుము. నీ గొంతు విని మేమందఱము తెలిసికొనునట్లు చెప్పుము. ఓయీ ! నీవు నిద్రించునపుడు ఒక మూల ఎవరికిని తెలియకుండునట్లు నిద్రింపవలదా? ఇంకను ఆ అసురులు, రాక్షసులు మరల విజృంభించి, "అతడెక్కడ ?'' అనివెదకి కొనివచ్చినచో నీవుండుచోటు వారికి తెలియునట్లు ధ్వజమును ఇట్లు కట్టియుండవలెనా ?'' అని శఠకోపసూరి (8-3-5) తమకడుపును బాదుకొనిరి కదా. అట్లేకదా శ్రీరంగనాథుడును నిద్రించుచున్నాడు అని ఈ దివ్యసూరి వాపోవుచున్నారు.

ధ్వజము గోచరమైనపుడుకదా భగవానునడు ఎచటనున్నాడో తెలియును. అనగా దేవాలయ సమీపమునకు వెడలినపుడు ఆ దేవాలయముపై నున్న ధ్వజమును చూచి, అచట భగవానుడున్నాడని తెలిసికొనవీలగును. ఇచట అట్లుకాదు.**"దూరా ద్గంధో వాతి"** (తైత్తి. నా-9) అని దూరములోనున్న వారిని సైతము సువాసన ఆకర్షించునట్లు, దూరములోన భక్తులను సైతము గంధముతో ఆకర్షించునది శ్రీరంగము. **"సర్వగంధః సర్వరసః"** (ఛాందో. 3-14-2) అని కీర్తింపబడు భగవాను డిచట నున్నాడు కదా. కావున అచటి తోటలలోని పరిమళము **"కడియార్ పొళ్లిల్''** అని చెప్పదగినట్లుండును. భగవద్విశ్లేషమువలనఆర్తిని పొందినవారికిని అది శిశిరోపచారమును చేయునదియైయున్నది.

**అరజ్గత్తమ్మాన్** - అవతారమునకు పిమ్మట జన్మించినవారును తన సేవ కోలుపోకుండునట్లు స్వామిఇచటకు వచ్చి నిద్రించుటకు మూలము చేతనులతో అతనికి గల సంబంధము. అనగా స్వ-స్వామి రూప సంబంధము. ఇట్టీ సందర్భమువలన శ్రీరంగనాథుని భోగ్యత తెలుపబడినది.

**అరైచ్చివన్ద ఆడైయిన్‌మేల్** - మేఘవర్ణమునకు పరభాగశోభను కలిగించు ఎఱ్ఱనిరంగును కల అందమైన పీతాంబరముపై అని అర్థము.

**శివన్ద ఆడైయిన్‌మేల్ శెన్టదామ్** - అకలిలేనివాడు "అన్నముపై నాకు మనసుపోయినదే" అని ఆశ్చర్యపడునట్లు కవి తన మనసు పీతాంబరమున లగ్నమగుటను చూచి అచ్చెఱువొందుచున్నారు.

**ఎన్ శిన్దనైయే** - ఇహలోకమున చూచినచో గర్హ్యములై, పరలోకమున క్రూరమైన నరకమున పడతోయు లౌకికవాంఛలను కల్గించు (స్త్రీల) వస్త్రములలో ప్రవణమైన నా మనస్సు, దృష్టమున (ఇహలోకమున) ఆకర్షకమై, అదృష్టమున (పరలోకమున) మోక్షప్రదాయకమైన స్వామిపీతాంబరమున లగ్నమైనది.

**ఎన్‌శిన్దనై** - పాదముల గొప్పతనమును తెలిసిన పిమ్మట వేరు దేనిని అభిలషింపని నా మనస్సు అని భావము. నదిలో స్నానముచేయుచు రేవులో బిడ్డను పోగొట్టుకొని, పిమ్మట సభలో అతనిని చూచినట్లు, పాదములందు పోగొట్టుకొనిన తమమనస్సును పీతాంబరమున లగ్నమైనదిగా దివ్యసూరి చూచిరి. ఇచట మనశ్శబ్ద ప్రయోగ మొనర్పక "శిన్దనై" అనుటచే దివ్యసూరి చింతా విశేషము తెలియుచున్నది. ఇందుచే త్రివిక్రమావతారవృత్తాంతమును, రామావతార వృత్తాంతమును వీరు ఒక్కొక్క రీతిలో శ్రీరంగనాథునియందు దర్శించుచున్నారు అని తోచుచున్నది.

ఇట్లు పూర్వము **"కమలపాదమ్ వన్దెన్ కణ్ణినుళ్ళన"** అని స్వామి పాదము తానే ముందుగావచ్చి పురోగామియై అనుగ్రహించుటచే దివ్యసూరియొక్క సాధనా భావము తెలుపబడినది. **"శెన్టదామ్"** అనుచు తమ మనస్సు అభినివేశముపొంది నట్లు కవి పల్కుటచే ఇచట అధికారిస్వరూపము తెలుపబడినది. పూర్వము **"నీణ్ మదిళరజ్గమ్"** అని రక్షకత్వము చెప్పబడినది.

"కడియార్ పొళ్ళిల్" అనుటచే భోగ్యత తెలుపబడినది. మొదటి పాశురమున "నిమలన్ నిన్మలన్" అని అపేక్షానిరపేక్షముగా ఉపకరించు శుద్ధిని కలవాడని తెలుపబడినది. ఈ అర్థము సంగతమా ? అనినచో, అందులకు ఉదాహరణమును ఈ గాథలో పల్కి, సంగతమేననిరి.

**మునివాహనభోగము :**

ఇందు శ్రీరంగనాథుని శ్రీపాదముల ఎఱ్ఱదనమునకు సదృశములైన పీతాంబరము తన మనస్సుకు (చింతకు) విషయమైనదని కవి పల్కుచున్నారు.

**ఉవన్దు ఉళ్ళత్తన్నాయ్** - మహాబలిచే అపహరింపబడిన రాజ్యమును తిరిగి సంపాదించి తమకు ఇవ్వవలెనని ఇంద్రాదులు భగవానుని ప్రార్థింపగా, **"ఉదారా స్సర్వ ఏవైతే"** (గీతా7-18) అనునట్లు వారిపట్ల మిక్కిలి సంతోషించినమనస్సు కలవాడయ్యెను. బలి అసురుడే అయినను ప్రహ్లాదునితో అతనికి గల గర్భ సంబంధమును భావించి, తనపట్ల అనుకూల్యమునుకల అతనిని వధింపతలపక, అతని ఔదార్యమునకు అనుగుణముగా తాను అర్థియై వెడలి, అతడు మూడు అడుగులు దానమివ్వగా స్వీకరించెను. అతనియందు అనుగ్రహముకలవాడై, అతని తలపైననే కాక అపేక్షానిరపేక్షముగా అందటి తలలపై తన శ్రీపాదములను నుంచగా, అందులకు ఎవ్వరును అడ్డుపెట్టని కారణముచే సంతసించిన మనస్సును కలవాడై - అని ఈప్రయోగముయొక్క అర్థము. స్వామి లోకములను కొలిచి, అడిగిన మూడు అడుగులు ఇచ్చితిమని తలచు అసురునిముందే అన్ని లోకములను తన పాదములతో పరిచ్ఛిన్నముచేసి, అతని స్వామిత్వ దురహంకారమును పోగొట్టెను.

**అణ్డముఱ నివర్న్ద నీళ్ముడియన్** - పైన విస్తరించిన, కనక ఛత్రమువలెనున్న బ్రహ్మాండమును స్పృశించినట్లు వృద్ధిచెందిన గొప్ప కిరీటమును కలవాడు. అతనివలె అతని కిరీటమునకును వృద్ధిచెందుటకు తగిన మహిమకలదు. తన కర్మవశ్యత స్ఫుటమగునట్లు పుట్టుకనుండి జటలను, కమండలమును ధరించి తిరుగు పరమేశ్వరుడు చూచుచుండగనే ఇట్లు

కిరీటమును దాల్చుటచే స్వామి ఉభయవిభూతి నిర్వాహకత్వము తెలుపబడినది. ఈ త్రివిక్రమావతారవృత్తాంతమును ఇచట ఉట్టంకించుటచే ఈశ్వరులుగా తలపబడు ఇంద్రాదులు అర్థులగుటయు, "వేదములతో బ్రహ్మ స్తుతించి, కమండలములోని నీటితో స్వామి పాదమును కడిగెను" (భక్తిసార. సూ-9) ఇత్యాది రీతిలో బ్రహ్మ పాదములను కడిగి ఆరాధకుడగుటయు, రుద్రుడు ఆ తీర్థప్రసాదమును స్వీకరించి పావనుడగుటయును తెలుపబడినది. ఇందువలన పూర్వగాథలో పల్కిన ఇష్టప్రాపకత్వమును ఉదాహరించినకవి ఇందు అనిష్టనివర్తకత్వమును ఉదాహరించుచున్నారని చెప్పవచ్చును.

**అన్టు నేర్న్ద నిశాశరర్తై వెజ్గణై కాకుత్తన్** - దేవతలకును, ఋషులకును కూడ నిరసింపవీలుకానట్లు ముల్లోకములకు క్షోభ కలుగగా, దేవతలు శరణాగతులై వచ్చినవుడు తాను (శ్రీరామచంద్రునిగా) అవతరించి, తాటకాతాటకేయవిరాధకబంధఖరదూషణాదులను నిరసించి, లంకకు పరిఘయై యున్న ఉప్పుసముద్రమున పర్వతములతో మార్గమును నిర్మించి, చెట్లకొమ్మలపై నంచరించు వానరసేనను గొని, లంకయొక్క ప్రాకారములను కూలగొట్టినవాడగు భగవానుని మహిమతెలియక అగ్నికీటకము(మిడతవలె)వలె వచ్చి అతనిని ఎదిరించిన (అన్టు నేర్న్ద శబ్దార్థము) పగటియుద్ధమును తెలియని కూటయోధులను - అనగా వంచనాయుద్ధమును చేయువారిని- (ఇది నిశాశర శబ్దార్థము) అందటిని ఎఱగా గొనిన దీప్తపావక సంకాశములైన బాణములను కల (వెజ్గణై కాకుత్తన్ శబ్దార్థము). కకుత్స్థవంశములో పుట్టిన శ్రీరాముడు అని అర్థము.

**కాకుత్తన్** - మాయావియైన రాక్షసులను కూడ మోహింపచేయు మానుషస్వభావమును కల్గియున్నవాడు అనియు అర్థము. (**కడియూర్‌పొఱ్రిల్ అరజ్గత్తమ్మాన్**) - నిత్యసూరులు సైతము స్థావరరూపములను గొని, నిత్యామోదమునుకల ఆరామములచే పరివేష్ఠింపబడిన ఆలయములో (కడియార్‌పొఱ్రిల్ శబ్దార్థము) బ్రహ్మాదులు ఆరాధింపగా, తన సర్వస్వామిత్వము

ప్రకాశింప నిద్రించు శ్రీరంగనాథుని (అరజ్గత్తమ్మాన్ శబ్దార్థము). **(అరైచ్చివన్ద ఆడైయిన్‌మేల్)** -"పాదకాంతి పీతాంబరముతో కలసినదా ?" (శర.సూ. 3-1-1) అనునట్లు ప్రకాశించు నడుములో మధుకైటభుల రుధిరపటలములచే ఎఱ్ఱనిది అయ్యెనా! అనునట్లు పాటలవర్ణమును కల్గినదై, మరకతగిరి మధ్యభాగములో ఉదయకాలపు ఎండ వ్యాపించినట్లున్న పీతాంబరవిషయముగా - **(శెన్దదామ్ ఎన్ శిన్దనైయే)** అనాదికాలము తగనివిషయములలో ఆసక్తుడనై (స్త్రీలతో సంచరించి),వారి అంబరములలో లగ్నమైన నామనస్సు ఇతని పాదములను ఆశ్రయించిన నాచే కూడ తిరిగి కొనిరాబడుటకు వీలుకానట్లు ఆశ్చర్యకరముగా (స్వామి పీతాంబరములో) లగ్నమైనది. **"ఎన్‌శిన్దనై శెన్దదామ్"** అనుటచే ఇట్టి ఆశ్చర్యము తోచుచున్నది. **"శెన్దదు"** అనుటచే నేను ప్రేరింపగా పోలేదు. విషయవైలక్షణ్యముచే (పీతాంబర శోభాతిశయముచే) నామనస్సు అకృష్టమైనది అని తోచుచున్నది.

3. **మన్దిపాయ్ వడవేజ్గడమామలై వానవర్‌కళ్**
**శన్దిశెయ్య నిన్ఱా నరజ్గత్తరవినణైయాన్**
**అన్దిపోల్ నిఱత్తాడైయు మదన్‌మేల్ అయనై ప్పడైత్తతోరెళ్లిల్**
**ఉన్దిమే లదన్రో అడియే నుళ్లత్తిన్నుయిరే.**

మన్ది = (పనసపండ్లు వృక్షమునుండి పై భాగమువరకు నిండుగా పండియుండుటచే) మగ కోతులు, పాయ్ = ఒక గెలనుండి వేరొక గెలకు నిరంతరము సంచరించునట్టి, వడ = ద్రావిడదేశమునకు ఉత్తరపు సరిహద్దుగా నున్న, వేజ్గడమ్ = వేంకటాచలమను పేరునుకల్గినదియు, మామలై = ఔన్నత్యమును, విస్తృతిని కల తిరుమలలో, వానవర్ = పరమపదమునన్నున్న నిత్యసూరులు, శన్ది శెయ్యనిన్ఱాన్ = పుష్పములను గొని ఆరాధించునట్లు నిలచియున్నవాడై, అరజ్గత్తు = శ్రీరంగమున, అరవినణైయాన్ = ఆదిశేషునిపై పరుండియున్నవానియొక్క, అన్దిపోల్ నిఱత్తు ఆడైయుమ్ = ఎఱ్ఱని ఆకాశమువలె ఎఱ్ఱని రంగునుకల పీతాంబరమును, అదన్‌మేల్ = దానికిపైన, అయనైప్పడైత్తదు

= బ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన, ఓర్ ఎళ్లిల్ = సాటిలేని అందమునుకల, ఉన్దిమేలదు అన్ఱో = నాభిపైనున్నదికదా, అడియేన్ ఉళ్లత్తు = దాసునియొక్క మనస్సులోనున్న, ఇన్ ఉయిర్ = మంచి (తీయని) ఆత్మ.

**వ్యాఖ్య :** పీతాంబరముయొక్క సౌందర్యాతిశయము దివ్యసూరిని క్రమముగా నాభీకమలములోనికి కొనిపోయినది. మొదటిపాశురములో **"ఆదిపిరాన్"** అనుచు స్వామి లోకముల కన్నిటికిని కారణభూతుడై, సర్వస్మాత్ పరుడైయుండునని కవి పలుకగా, దీనిని విని కొందఱు **"సృష్టిస్థిత్యంత కరణీమ్ బ్రహ్మవిష్ణుశివాత్మికామ్"** (వి.పు. 1-2-16) అనునట్లు బ్రహ్మ, విష్ణువు, శివుడు ముగ్గురును జగత్కారణభూతులని ప్రసిద్ధమైయుండగా, ఇతడే జగత్కారణభూతుడని తెలియుట ఎట్లు అని ప్రశ్నింపగా ? శాస్త్రముద్వారా ఆకారణత్వమును ప్రకటించినచో, అది కర్మాధీనమైన ఆయా అధికారుల రుచికితగినట్లు పోకచెట్టు నీడవలె విపరీతముగా ప్రకాశించునని తలచి, **"త్రయో దేవా స్తుల్యా స్త్రితయ మిద మద్వైత మధికం త్రికా దస్మా త్తత్త్వం పర మితి వితర్కాన్ వికుటయున్, విభో ర్నాభీపద్మో విధిశివనిదానం భగవత స్తదన్యభ్రూభంగీపరవ దితి సిద్ధాంతయతి నః"** (శ్రీరంగ - పూర్వ - 116) అనియు, "అందమైన రూపములు కల బ్రహ్మ, విష్ణు, శివాత్మకములైన మూడు వస్తువులను జగత్కారణమని కొందరందురు. ఈ మూడిటికిని మించిన వేరొకవస్తువు కారణమని మరికొందరందరు. జగత్కారణభూతుడవైన స్వామీ ! తగినట్లు ప్రకాశించు మేఘమువంటి రూపమును కలవవాడా ! జగత్కారణత్వ ప్రయుక్తమైన తేజముతో ప్రకాశించు తామరపూవు నీనుండియే కదా ఉద్భవించినది.'' (శత.సూ.-72) అనియు చెప్పురీతిలో స్వామి తన తిరునాభీకమలమున జగత్కారణభూతులుగా ప్రసిద్ధులు అగు బ్రహ్మరుద్రులను సృష్టించి చూపగా, ఆనాభీకమలము తన పరత్వమును, అందమును చూపి పీతాంబరమున లగ్నమైన నామనస్సును తన వైపు ఆకర్షించుకొన్నది అని సమాధానించిరి. అందుచే అనుభావ్య విషయముయొక్క

సీమను చూచి కవి విరమించుటయో, లేక, తమకుగల ఆదరము తక్కువ అగుటచే విరమించుటయో కాదు. తమయొక్క చపలబుద్ధిచే అటు ఇటు మనస్సును పరిభ్రమింపనీయుచున్నారంతియే.

పూర్వగాథలో కవి "**ఉలకమళన్దణ్డముల నివర్న్ద నీణ్డముడియన్ కడియార్పొళ్ళిల్ అరఙ్గత్తమ్మాన్**" అని ఈలోకములన్నిటిని తన పాదములతో శ్రీరంగనాథుడు కొలిచెను అని పల్కిరికదా ! అట్లు చెప్పనగునా ? "అపుడు భూమిని కొలిచిన ఉపకారకుడైన స్వామి వచ్చిచేరు శ్రీవేంకటాచలము" (శఠ. సూ. 3-3) అనుచు వేంకటేశ్వరుని త్రివిక్రమరూపిగా శఠకోపసూరి పల్కిరి. వేంకటేశ్వరుని శ్రీపాదములను దర్శింపవలెనని ఆశపడిన నిత్యసూరులు "భూలోకమును కొలచిన తామర పుష్పముల జంటను ఏనాడో కదా మనము దర్శించుట ! అని తలచిరి" అనికదా శఠకోపసూరి పల్కిరి. (6-10-5) కావున ఈ భూమిని అంతటిని పూర్తిగా పాదములతో ఆక్రమించి, "ఓ భక్తులారా ! నా పాదముల క్రింద అమరియుండి ఉజ్జీవింపుడు" (శఠ. సూ.-6-10-11) అని తన శ్రీహస్తముతో "లోకమును కొలిచిన బంగారు పాదములను" (పరకాల. సూ. 5-5-8) చూపుచు నిలచినవాడు "తాను వృద్ధిచెంది, చల్లని నీటి సెలయేళ్లను కల్గిన వేంకటాచలముపై నిలచియున్నాడు." (భక్తిసార. సూ)అండకటాహము భిన్న మగునట్లు వృద్ధిచెందిన కిరీటమునుకల వాడైయున్నవాడు వేంకటేశ్వరుడే కదా ! అనినచో, ఆ శ్రీవేంకటేశ్వరుడే కదా ! ఇచట పరుండి, నిద్రించు శ్రీరంగనాథుడు అనుచున్నారు.

**మన్దిపాయ్ వడవేఙ్గడమామలై** - పీతాంబరశోభను అనుభవించు చుండగానే నాభికమలమునందు తాము ఆకర్షింపబడుటకు కారణము మనస్సు చాపల్యగుణములో వానరముతో పోలియుండుటచే, వానిని నిదర్శనముగా కవి పల్కుచున్నారు.

**మన్దిపాయ్** - తిరుమలలో పనసవృక్షములు మూలము మొదలు అగ్రమువరకు పండియుండుటచే అచటనుండు వానరములు ఆ జాతికి తగిన

చాపలముచే వానిని తినగోరును. ఒక కొమ్మలోగల ఒకపండును తినగోరినపుడు వేరొక కొమ్మలోనున్న పండును అవి చూడగానే, ముందు తినబోయిన పండును వదలి, వేరొక కొమ్మకు చేరునట్లు - శ్రీరంగనాథుని దివ్యావయవములలో తాము మగ్నులై, వానిలో ఏ దివ్యాంగమును దర్శింపవలెనో తెలియని కింకర్తవ్యతా మూఢులగుచున్నారు అని భావము. **"కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడమ్"** (అడవులను, వానరములను, వేటగాండ్రను కల వేంకటాచలము- భక్తిసార. సూ. 47) అనికదా వేరొక దివ్యసూరి సూక్తి.

**మన్దిపాయ్** - వానరములు ఒకదానిని వేరొకటి పట్టుకొనియుండు మాలగా వేలాడుచుండును. దేవాలయములోని వాద్యధ్వనిని అవి వినగానే దుముకుచు సంచరింప నారంభించును అనియు భావము. పరమపదము, వేంకటాచలము, శ్రీరంగము, అయోధ్య- ఇవి అన్నియు ఒకే విధమైన భోగస్థానములుగా నుండుటచే అందు అంతట మాటి మాటి భగవానుడు నివసించును.

**వడవేఙ్గడమ్** - వేంకటాచలమును **'వేఙ్గడమ్'** అనికాక, **"వడవేఙ్గడమ్"** అనుటకు ఏమి కారణమనిన- తమిళులు ద్రావిడదేశమునకు ఉత్తరపుసీమగా వేంకటాచలమును చెప్పుటచే, మఱియు వేదములచే, రామాయణ భారతాదులచే స్తుతింపబడుటయే కాక, తనుజన్మకు అనుగుణముగా తాము కవితలు అల్లు శబ్దములు ప్రయోగించుటకు సీమాభూమి ఇదియే అగుటచే అట్లు పల్కిరి.

**మామలై** - ఇచటి మహచ్ఛబ్దము పర్వతముయొక్క భోగ్యతాతిశయమును తెలుపుచున్నదనవచ్చును. లేక, "పరమాత్మ పోయిచేరు" (శఠ.సూ. 3-3-8) అని, **"మున్నమడైమినో"** (ముందుగా ఆశ్రయింపుడు- శఠ.సూ. 3-3-10) అనియు పల్కురీతిలో శేషి తన రక్షకత్వము సిద్ధించుటకొఱకు, శేషభూతులు స్వరూపసిద్ధికొఱకును వచ్చి చేరుటచే కల్గిన శ్లాఘ్యతను తెలుపుచున్నదనియు చెప్పవచ్చును. నిత్యసూరులు(పరమపదవాసులు) పరమపదమునుండి వేంకటేశ్వరుని దర్శింపవచ్చునపుడు తనశిఖరమున విశ్రమించి శ్రమతీర్చుకొన

వచ్చునట్టి ఔన్నత్యమును కల్గియుండుటను తెలుపుచున్నదని, లేక ఉభయవిభూతులు ఒకమూలలో అణగునట్టి విస్తృతిని కల్గియుండుటను తెలుపుచున్నదనియు చెప్పనగును. ఇది **"మా"** అను విశేషణముయొక్క తాత్పర్యము.

**వానవర్కళ్ శన్దిశెయ్యు** - నిత్యసూరులు వేంకటాచలముపై రాలు పూవులను గైకొని భగవదారాధనమును చేయగా భగవానుడు తన వాత్సల్యము, శీలము మొదలగు గుణములను ప్రకటీకరించుటకై వేంకటాచలమునకు వచ్చినిలచెను. భగవానుని పరత్వమును పరమపదములో దర్శించిన నిత్యసూరులు సౌలభ్యమును సేవింపగోరి తోటలచే చుట్టబడియున్న వేంకటాచలమునకు వచ్చిరి. పిమ్మట ఆ సౌలభ్యమునకు మూలమైన పరత్వమును దర్శించుటకై తిరిగి పరమపదమునకు వెడలిరి.

**నిన్రాన్** - తాను అట్లు నిలచుటలో ఒక ప్రయోజనము కలదని తోచునట్లు స్వామి నిలచెను. శ్రీరాముడు ఋశ్యమూక పర్వతముపై సుగ్రీవుడు మొదలగు వానరులకు, లక్ష్మణునకును సమానముగా తన దర్శనమును అనుగ్రహించినట్లు వేంకటేశ్వరుడు వానరములకు, నిత్యసూరులకును ఎట్టి భేదములేకుండ తన దర్శనమును అనుగ్రహించెను. **"వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః"** (రా.సూ. 35-2) అనుచు సీతాదేవి ఒకచెట్టునుండి వేరొక చెట్టుకు తిరుగు వానరమునకు వశిష్ఠశిష్యుడైన శ్రీరామునకు మధ్య స్నేహమెట్లు సంభవించెను? నా కటాక్షముతో, పురుషకారముతో ఇట్టి స్నేహమేర్పడవలసి యుండగా, నేనిట్లు చెఱలో వుండగా ఇది ఎట్లు సంభవించెను ? అని ప్రశ్నించెను. అపుడు హనుమానుడు **"రామసుగ్రీవయో రైక్యం దేవ్యేవం సమజాయత"** -(రా.సూ. 35-51) తల్లీ ! సర్వవిధకైంకర్యములును చేయగల లక్ష్మణుడు సమీపముననుండగా సుగ్రీవుని కింకరుడనగు నన్ను నీవద్దకు అంతరంగ దూతగా పంపగా నేనిచటకు నీవద్దకు వచ్చి నిలుచునంత గాఢముగా రామసుగ్రీవుల స్నేహము ఏర్పడినదనెను.

నిష్టాన్ - నిత్యసూరులు తిరుమలలోని స్వామి యొక్క సౌలభ్యమున అభినివేశమును పొంది వచ్చినిలుపగా, "గుడ్డి వారికొఱకు కట్టబడిన ధర్మశాలలో (జ్ఞానహీనులైన సంసారుల కొఱకు ఏర్పరచిన తిరుమల క్షేత్రములో) వెలుగునట్టి కన్నులను కలవారు (జ్ఞానాధికులైన నిత్యసూరులు) ప్రవేశింపనగునా ?'' అని అతడు తలచి, చదరంగ సాధనములతో ఆడువారివలె వానరముల పట్ల మనస్సును ప్రసరింపచేసి నిలచియున్నాడని లేక, "మేఘమండలము పర్యంతము వ్యాపించిన శిఖరములను కల, ఉత్తరదిశలో నున్న వేంకటాచలములో వేంచేసి యున్నట్టి భగవానునకు దీపారాధన చేయుటకు చంద్రుని జటలలో దాల్చిన శివుడు, తామరపువ్వులో పుట్టిన బ్రహ్మ, మొదలగువారు పూలబుట్టలను మొదలగు ఉపకరణములను సేకరించుకొని సంధ్యాకాలములో తిరుమలకు చేరుదురు'' (భక్తిసార. సూ. 45) అనునట్లు బ్రహ్మ రుద్రాదులు సాయం సమయమునవచ్చి ఆరాధింప, గొప్ప పరత్వముతో నిలచి యున్నాడని చెప్పవచ్చును.

నిష్టాన్ - భగవానుడు వేంకటాద్రిపై తాను ఇట్లు నిలచియున్న స్థితికి ఒక ఉద్దేశ్యము కలదని స్ఫురించునట్లు నిలచెను. నిత్యసూరులు ఆఉద్దేశ్యమును తెలిసికొనుటకై స్వామిని అనుసరింపగా, అతడు ఉత్తరద్వారము ద్వారా శ్రీరంగమునకు వచ్చి శయనించెను. ఇతడు పరుండియున్న రీతిని చూచి "లోకములను కొలిచిన పాదములకు నొప్పి కలుగుట చేతపరుంటివా నిలచియుండి తిరువెక్కాక్షేత్రమున పరుండుట ఏమి సౌలభ్యగుణము'' (తిరుచ్ఛన్ద-61) అని బాధపడక మిక్కిలి సంతోషించినవారై, ఇక ఇతడు సంసారుల జన్మ దుఃఖమును పోగొట్టినగాని ఇచటినుండి లేవడు'' అని ధైర్యముగా తిరిగిపోయిరట.

అరవినస్థైయాన్ - పూచిన పూవువలె సుకుమారమైన స్వామియొక్క దివ్యదేహమును కూడ సహింపలేనిమార్దవమును కల్గినదై, అరణ్యములలో, నదీతీరములలో పాదములను మోపి సంచరించుటచే భగవానునకు కల్గిన

శ్రమతీర్చునట్లు మార్దవము, చల్లదనము, సౌగంధ్యము, అను గుణములనుకల ఆదిశేషునిపై పరుండియున్నాడు. **"అరజ్గత్తరవినశైయాన్"** అనుటద్వారా కవి శ్రీరంగనాథుని పరత్వమును, సౌందర్యమును అనుభవించుచున్నారు.

**అరజ్గత్తరవినశైయాన్** - **"శేష్యే పురస్తా చ్ఛాలాయాం యావన్మే న ప్రసీదతి"** (రా.అయో. 111-14) అని చిత్రకూటపర్వతములో భరతుని తన ముందు శయనింప చేసిన శ్రీరాముడు తాను సముద్రతీరమున శయనించినట్లే, "సంసారులను ఉజ్జీవింపచేసి, వారిన పొందినగాని లేవను'' అని శ్రీరంగనాథుడు శయనించెను. మొదట సముద్రుని శరణాగతి చేసినను అతడు ప్రత్యక్షము కానపుడు **"చాప మానయ సౌమిత్రే"** (రా.యు. 21-22) అని అతనిపై శ్రీరాముడు కోపించినట్లు కోపింపడు కదా శ్రీరంగనాథుడు. తన తాళలేని స్వభావమును చూపి శరణుజొచ్చి యుండువాడు కదా ఇతడు.

**అన్దిపోల్ నిఱత్తాడైయుమ్** - ముందు పాశురములో వర్ణించిన ఎఱ్ఱని పీతాంబరము ఆభరణములలో చేరినదగుటచే తొలగింపదగినది. కాని, ఇది పుట్టుకతో నున్నది అనుటకు అనుగుణముగా **"అన్దిపోల్ నిఱత్తాడైయుమ్"** అని కవి అనుచున్నారు. సాయం సమయమున ఎఱ్ఱని (సంధ్యారాగరంజితమైన) ఆకాశమున నున్న మేఘమువలె ఎఱ్ఱని పీతాంబరము, శ్రీరంగనాథుని కటిప్రదేశమును ప్రకాశించుచున్నవి. దివ్యదేహము నెమలి కంఠము రంగును కల్గియున్నది. దానితో చేరిన, అనుగుణమైన పీతాంబరము సాయంకాలసమయమున ఎఱ్ఱని ఆకాశమున తోచిన కాలమేఘమువలె చూచువారి మనస్సును దోచుచున్నది. పూర్వగాథలోని **"అరైచ్చివన్ద ఆడై"** అను సూక్తియొక్క అర్థము ఇంకను ఇచట అనువర్తించుచున్నది.

**అదన్మేల్** - ఆ అందమునకు మించి -

**అయనై ఇత్యాది** - సృష్టికి అధిపతి యగు చతుర్ముఖుని తనయందు సృష్టించి, దానివలన కల్గిన పర్వతముచే స్ఫురించు అసమానమైన అందమును కల్గినదిగా శ్రీరంగనాథుని నాభీపద్మముండును కదా ! లోకమున తల్లి అందము

**"ప్రసవాంతం చ యౌవనమ్"** అనునట్లు సంతానము కల్గు వరకే వుండును. కాని బ్రహ్మను కనిన పిమ్మట నాభిఅందము అతిశయించినది. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్ . . . తం హ దేవమ్"** (శ్వేతా. 6-18) అనునట్లు బ్రహ్మను సృష్టించిన పిదప భగవానుడు వెలుగొందువాడయ్యెను అని వేదమే పల్కినది. (దేవ శబ్దము 'దివు-దీప్తౌ' అనుధాతువునుండి పుట్టినదగుటచే, ఈ శ్రుతివాక్యములోని దేవ శబ్దమునకు ప్రకాశించువాడను అర్థము ప్రకృతమున గ్రాహ్యము.)

ఒరెళ్ళిల్ - **"సౌందర్యాఖ్యా సరిదురసి విస్తీర్య మధ్యావరుద్ధా స్థానాల్పత్వాత్ విషమగతిజావర్తగర్తాభివాభిః, ప్రాప్య ప్రాప్తప్రథిమజఘనం విస్తృతా హస్తినాథ స్రోతోభేదం భజతి భవతః పాదదేశాపదేశాత్"** (వరదా - 55) అని కూరేశులు వరదరాజస్తవమున వల్కినరీతిలో, అందమైన కిరీటమను పర్వత శిఖరమునుండి, విస్తృతమైన వక్షఃస్థలమను పర్వతచటియలలోనికి దుమికి, ప్రవహించి, అచటినుండి క్రిందకు పోవునపుడు విశాలమగు దారి సన్నని నడుము అగుటచే సంకుచితమై, ఆ కారణమున అవరోధింపబడి, నాభీరూపమును పొందిన సుడివలె వెల్గుచున్నది.

**అడియేన్ ఉళ్ళత్తిన్నుయిరే** - దాసుడనైన నాలోన గల హృదయము

**ఉన్దిమేలదన్రో** - దాసుడనను స్వరూపజ్ఞానము వీరికి ఇపుడు కల్గి, **"పతిం విశ్వస్య", (తై. నా. 11) "యస్యాస్మి" (యజు.3-7), "దాసభూతా స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః"** (హారీత. సం.) అను మొదలగు ప్రమాణములను బట్టి దాసుడనని అనుటలేదు. **"గుణై: దాస్య ముపాగతః"** (రా.కి. 4-12) అని గుణకృతదాస్యమును పొంది, **"అడియేన్"** అని లక్ష్మణుని వలె పల్కువారును కారు. భగవానుని సౌందర్యమునకు వశులై **"అడియేన్"** అనుచున్నారు. స్వామి అవయవసౌందర్యమునకు, అనగా, నాభిసౌందర్యమునకు జితులై పల్కు మాట ఇది. **"ఉయిర్"** (ప్రాణము) అను పదము ఇచట మనస్సును తెలుపును. "శరీరమందు నివసించు మనస్సు" (శఠ. సూ. - 2-3-1) అనుచు శఠకోపసూరి

మనస్సును కీర్తించినట్లే, ఈ దివ్యసూరి స్వామి దేహసౌందర్యమును దర్శించి, సంతసించిన తమ మనస్సును **"ఇన్నుయిర్"** అని పొగడుచున్నారు. కొందఱిని (బ్రహ్మాదులను) సృష్టించిన నాభియే కదా నన్ను బాధించుచున్నది అని వాపోవుచున్నారు. (నాభీసౌందర్యము హృదయావర్జకము అని భావము) ఆ నాభీకమలము అధికారపురుషులైన బ్రహ్మాదులను సృష్టించును. **"అడియేన్"** (దాసుడను) అనువారిని బాధించును (నశింపచేయును) కాబోలు పిళ్లై అఱ్ఱకియమళవాళరైయర్ అను ఆచార్యులు శ్రీరంగనాథుని పాదసన్నిధిని చేరి, "స్వామీ ! నేను వేంకటేశ్వరుని సేవించిరావలెనని.యుంటిని" అనగా, "ఓయీ ! అయినచో అమలనాదిపిరాన్ ప్రబంధమును గానము చేయుము'' అని ఆజ్ఞాపించెను. ఆ ఆచార్యులును అట్లే ఆప్రబంధమును గానము చేసిరి. అపుడు శ్రీరంగనాథుడు వారితో "ఇక నీకు పోవలనని ఉన్నచో పొమ్ము, లేక ఇక్కడే ఉండవలెనని తోచిన ఉండుము'' అనెను. అపుడు ఆ ఆచార్యులు వేంకటేశ్వరుడే శ్రీరంగమునకువచ్చి, శయనించెనని ఈ గాథలో చెప్పబడుటను గమనించి, వేంకటాచలమునకు పోవుట, శ్రీరంగమున నుండుట రెండును ఒకటియేనని తెలిసి, తిరుమలకు పోవుట విరమించిరట. ఈ విధముగా ఆచార్యుల మనస్సులో పడునట్టిది శ్రీరంగనాథుని నాభీసౌందర్యము కదా ! ఇట్లు ఈ పాశురమున శ్రీరంగనాథుని యందు వేంకటేశ్వరుని రూపమును దర్శింపవచ్చునని తెలుపబడినది.

**మునివాహనభోగము :**

ఇట్లు ఈ దివ్యసూరి మొదటిరెండు గాథలతో భగవచ్ఛేషత్వ పర్యవసానత్వమును, అన్యశేషత్వనివృత్తిని అనుసంధించి, పిమ్మట శేషభూతమైన చేతనాచేతన సమూహమును ప్రతిపాదించు తృతీయాక్షరము (మకారమును) మొదలుగా గల ఈ తృతీయగాథచే శేషత్వజ్ఞానహీనులు (బద్ధులు), విచ్ఛేదములేని శేషత్వజ్ఞానమునుకలవారు (నిత్యులు), కాదాచిత్క శేషత్వజ్ఞానమును కలవారును (ముక్తులు) అగు జీవులు అందరు తమతమ

జ్ఞానానుగుణముగా ప్రతికూల-అనుకూలరూపములను రెండువిధములైన ప్రవృత్తులను కల్గియున్నతీరును ఉదాహరించుచు, భగవదనుభవమున తమకు మధ్యలోకల్గిన ఒకానొక అద్వితీయప్రావణ్యమును తెలుపుచు, సంతుష్టు లగుచున్నారు.

**మన్దిపాయ్ వడవేఙ్గడమామలై** - చపలురైన సంసారులకు నిదర్శనమైన వానరవర్గము తిరుమల కొండపైగల వృక్షములలో నున్న నానాశాఖలలో ఫలించిన క్షుద్రఫలములను భుజింపగోరి, **"గతాగతం కామకామా లభంతే"** (గీతా. 9-21) అనునట్లు ఒక శాఖనువిడచి, వేరొక కొమ్మపైదూకి తిరుగుటకు తగిన నిలయమిది. కలియుగములో భాగవతసంభావనను కల్గినదిగా పురాణప్రసిద్ధమగుటచే, దివ్యసూరులు అవతరించిన అగస్త్యభాషా(ద్రావిడభాషా) దేశమునకు ఉత్తారావధియైయుండి, పురాణప్రసిద్ధమైన, ఈశ్వరునివలె స్వరూపరూపగుణవిభూతుల ప్రభావముచే కల్గిన గొప్పదనమును కల వేంకటచలమునందు- అని అర్థము. **వానవర్కళ్ శెన్దిశెయ్యు నిన్ఱాన్** - పరమపదములోని కైంకర్యసామ్రాజ్యమునకు అధికారముగల ముక్తులు, నిత్యులు ఆయా దేశములకు తగిన రూపములను ధరించి, ఉచితమైన సేవలనుచేసి, వారు ఆశ్రయించుటకు ఉద్దేశ్యభూతుడై స్వామి ఉన్నాడు. **(అరఙ్గత్తరవిననైయాన్)** - అతిశయము (శక్తి) ఉన్నంతవరకు అధిరోహింపవలసినట్లు ఎత్తుగా ఉన్న వేంకటాచలముకూడ పరమపదమువంటిదే. అట్లుకాక సులభముగా చేరుటకు వీలయినట్లున్న శ్రీరంగనాథుని ఆలయములో సర్వకాలములందు వెంటనేఉండి, విచ్ఛేదములేని కైంకర్యమునుచేయు నిత్యసూరులకు దృష్టాంతమై, నిశ్శేషజగదాధార భూతుడైన తనను దాల్చుటకు తగిన జ్ఞాన, బలప్రకర్షను కలవాడై, సురభిళసుకుమార శీతలుడైన అనంతుడను పడుకపై నిద్రించు శ్రీరంగనాథునియొక్క అని భావము. **(అన్దిపోల్ నిఱత్తాడైయుమ్)** - ఆశ్రితుల అజ్ఞానాంధకారమును పోగొట్టగల్గిన సమ్యక్జ్ఞానమను సూర్యోదయమునకు ఉదయసంధ్యవలె, వారితాపత్రయములను పోగొట్టుపశ్చిమ సంధ్యవలె

ప్రకాశించుకాంతినిగల, కటిప్రదేశములోనున్న పీతాంబరము అనిఅర్థము. పీతాంబరము ఇంతకుపూర్వమే వర్ణింపబడినదికదా అనినచో, ఇది పైన అనుభవింపతగిన విషయమును అవలంబించుటకు వీలుగా అనుభవించిన అంశమును అనువదించినట్టైనది. అయినచో ఇచట అనుభావ్యవిషయ మేది ? అనినచో అందులకు సమాధానమును కవి పిమ్మట తెలుపుచున్నారు.

**అదన్‌మేల్ అయనై వృదైత్తదోరెళ్లిల్ ఉన్ది** - పూర్వము దర్శించిన పీతాంబరమునకు పైననున్నదై, ఆపీతాంబరశోభకు సదృశమైన ఎఱ్ఱని తామరపూవును కల్గినదై, అందు వ్యష్టిసృష్టి సమయములో ముందుగా అయోనిజుడైన బ్రహ్మను సృష్టించిన, అద్వితీయమైన అందమునుకల నాభి అని భావము. ఇచట బ్రహ్మయొక్క సృజ్యత్వము (బ్రహ్మ సృష్టింపబడతగిన వాడగుట) తెలుపబడగా, కైముత్యన్యాయమున రుద్రేంద్రాదుల సృజ్యత్వమును చెప్పినట్లే అగును. ఇందుచే జ్ఞానులకు శ్రియఃపతి తప్ప వేరొక శరణమును, వేరొక ప్రాప్యమును లేదన్నట్లయినది. ఇచట బ్రహ్మను తెలుపుట అతడు ముముక్షువులను సృష్టించిన ఉపకారమునకు ఉదాహరణము. **(మేలదన్నో)** - అనుటకు ఈ నాభినే అనుభావ్యముగా గొనియున్నదికదా ! అని భావము. అనగా పీతాంబరముయొక్క అనుభవము దీని అధీనమున నున్నదని భావము. **(అడియేనుళ్లత్తినుయిరే)- "ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావం చ సదా స్మర"** (విష్ణుతత్త్వమ్) అనునట్లు గొప్ప కరుణతోకూడిన కటాక్షముతో స్వభావదాస్యమునుకల నా (అడియేన్ శబ్దార్థము) సత్త్వోత్తరమైన మనస్సులో ప్రకాశించు (ఉళ్లత్తిన్ శబ్దార్థము) -స్వాదుతమమైన (ఇన్ శబ్దార్థము) నా ఆత్మస్వరూపము అని అర్థము. **"ఉళ్లమ్"** అనుటకు హృదయప్రదేశమనియు అర్థమును చెప్పవచ్చును. **"ఇన్నుయిర్"** అనునది భగవదనుభవమునకు తగినదగుటచే స్వాత్వికమైన ప్రాణములుఅను అర్థమును తెలుపుననియు చెప్పనగును. ఇందులకు అనుగుణముగా **"జ్ఞానీ తు పరమైకాంతీ పరాయత్తాత్మజీవనః"** (గీతార్థసంగ్రహే), **"మచ్చిత్తాః మద్గతప్రాణాః"** (గీతా 10-9) ఇత్యాదులు అనుసంధేయములు.

4. శతురమామధిళ్ శూళ్ళిలఙ్గైక్కిఱైవన్ తలైప్పత్తు
ఉదిర వోట్టి ఓర్వెఙ్గణై యుయ్త్తవనోదవణ్ణన్
మదురమా వణ్డుపాడ మామయిలా డరఙ్గత్తమ్మాన్ తిరువయి
ఱ్ఱుదరబన్ద మెన్నుళ్ళత్తుళ్ నిన్ఱులాకిన్ఱదే.

శతురమ్ = చతురస్రమై, మా = ఎత్తైన, మదిళ్ = ప్రాకారములతో, శూళ్ = చుట్టబడియున్న, ఇలఙ్గైక్కు = లంకామహానగరమునకు, ఇఱైవన్ = ప్రభువు అగు రావణుని, ఓట్టి = మొదటి దినమున జరిగిన యుద్ధములో వెనకకు తఱిమికొట్టి, (మరునాటి యుద్ధములో), తలై పత్తు = (అతని) పదితలలను, ఉదిర = (పనసపండ్లవలె) రాలునట్లు, ఓర్ = అద్వితీయమైన (సాటిలేని), వెమ్ = క్రూరమైన, కణై = బాణమును (బ్రహ్మాస్త్రమును), ఉయ్త్తవన్ = ప్రయోగించినవాడు, (భక్తులను విరోధినిరసనమును చేసితినను సంతోషముచే), ఓతమ్ వణ్ణన్ = సముద్రమువలె చల్లని రూపమును కలవాడై, వణ్డు = తుమ్మెదలు, మదురమా = మధురముగా, పాడ = పాడగా, (దానికి తగినట్లు), మా= గొప్పఱెక్కలను కల, మయిల్ = నెమళ్లు, ఆడు = నర్తించునట్టి, అరఙ్గత్తు = శ్రీరంగములో (శయనించియున్న), అమ్మాన్ = స్వామియగు శ్రీరంగనాథుని, తిరువయిఱు ఉదరబంధమ్ = నడుమునకు కట్టబడిన ఉదరబంధము (మొలనూలు), ఎన్ ఉళ్లత్తుళ్ = నామనస్సులో, నిన్ఱు = నిలచి, ఉలాకిన్ఱదే = స్వైరవిహారముచేయుచున్నది కదా ! (అని ఆనందము, ఆశ్చర్యమును)

ఇందు కవి శ్రీరంగనాథుని నాభీకమలముతో చేరిన ఉదరబంధమును సేవించుచున్నారు. ముందు గాథలో తమ మనస్సు నాభీకమలమునందు నుడిగుండములో వలె చిక్కుపడుటను చూచిన వీరు ఇపుడు ఆనాభీకమలమునకు ఆశ్రయమైన ఉదరమును, అందున్న బంగారు మొలనూలును దర్శించి, అనుభవించుచున్నారు. ఆ నాభికి బ్రహ్మ ఒక్కనికే స్థానమైనట్టి గొప్పతనమును, అందమును కదా కలదు ! కాని ఈ ఉదరమునకు,

ఉదరబంధమునకు అన్నచో (అంతకంటే గొప్పవైలక్షణ్యాము కలదు.) **"త్రివిధచిదచిద్బృందం తుందావలంబి వలిత్రయం, విగణయ దివైశ్వర్యం వ్యాఖ్యాతి రంగమహేశితుః, ప్రణత వశతామ్ బ్రూతే దామోదరత్వకరః కిణః తదుభయగుణాకృష్టం పట్టం కిలోదరబంధనమ్"** - (శ్రీరంగ. పూర్వ. 115) నిత్యులు, ముక్తులు, బద్ధులు, అను మూడు విధములుగా నున్న ఆత్మలను తన ఉదరమున ధరించుటచే ఏర్పడిన మూడు మడతలు, దానిక్రింద కృష్ణావతారమున యశోద టోలుకు గట్టిగా కట్టుటచే ఏర్పడిన కిణములును (కాయలు) స్వామి భక్తులకు సులభుడు అనుటను చూపుచున్నవి. ఈ పరత్వమును, సౌలభ్యమును కల్గియున్న వైలక్షణ్యముచే నాభికంటె తనకుకల వైశిష్ట్యమును స్వామి ఉదరమును చూపి, నాభీకమల సౌందర్యములో నిమగ్నమైన తమ మనస్సు తన పట్ల మరలునట్లు ఆకర్షింపగా, పిమ్మట ఆ ఉదరమును ఆశ్రయముగా కల మొలనూలుకూడ తన వైపు ఆకర్షించి, తమమనస్సున అది స్వైరసంచారమును చేయుటను కవి ఈ గాథలో తెలుపుచున్నారు.

**శతురమామదిళ్ . . .వెజ్గణైయుయ్‌త్తవన్** - రెండవపద్యములో అనుసంధించిన వృత్తాంతములు రెండింటిలో మొదటివృత్తాంతము (త్రివిక్రమవృత్తాంతము) న కల్గిన సందేహమును మూడవ పాశురములోని పూర్వార్ధము తీర్చినది. రెండవపాశురములోని రెండవ వృత్తాంతమునందు కల్గిన సందేహమును ఈ పాశురములోని పూర్వార్ధము తీర్చుచున్నది. **"అన్టువేర్న్ద నిశాశరర్హై క్కవర్న్ద వెజ్గణైక్కాకుత్తన్"** అని కదా ! అందు కవిపల్కిరి. జనస్థానమునకు శ్రీరాముడు, సీతాదేవియు, లక్ష్మణుడును కలసి వెడలి, అచట నున్న ఋషులతోను **"ఆవాసం త్వహ మిచ్ఛామి"** (రా. ఆ. 5-33) అని అపేక్షించిరి. ఋషుల వారి అనుమతితో అచట నివసించుకాలమున వారికి విరోధులై వచ్చిన జనస్థానవాసులగు ఖరాదులను నిరసించినట్లే, "మీ హృదయమునందు నివసింతును" (శఠ.సూ. 10-8-2) అని (దివ్యసూరి) అనుమతిని గొనివచ్చి, మీ మనస్సులో ప్రవేశించి, అచటి విరోధులైన రాగాదులను

నిరసించెనని మీరు పల్కుచున్నారు. ఆ రాగాదులు శబ్దాదివిషయాసక్తి వలనకల్గునట్టివి. ఆ ఆసక్తికిమూలము ఏది అనగా- అహంకారమమకారములను కోటలను ఏర్పరచుకొని, నవద్వారమను నగరమున వర్తించు **"ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే"** (గీతా. 2-67) అను రీతిలో చక్షురాదికరణములతో కూడిన మనస్సుకదా ! ఈ దుష్టమనస్సు మాఱినగాని రాగాదులు నశింపవు. ఆ రాగాదులు పోయినగాని భగవానుడు మనస్సున ఆశతో వచ్చిచేరడు. ఇట్లు అన్యోన్యాశ్రయ దోషము. అది అట్లుండనిండు, అతడే స్వయముగా అభిమానింపగా, **"శెన్దతామ్ ఎన్ శిన్దనై"** (నామనస్సును చేరినది) అనియు, **"ఉన్దిమేలదన్రో అడియేన్ ఉళ్ళత్తిన్నుయిర్"** (నాభియందు దాసుని దేహములోని ప్రాణములు లగ్నమైనవి) అనియు మీ మనస్సే ఆసక్త మగుచున్నదనుచున్నారు. మనస్సు అట్లు ప్రవణమగునట్లు రాగాదులను నశింపచేసినవాడెవ్వడు ? అనగా, ఆ జనస్థానవానులైన ఖరాదులకు జన్మస్థానమై, కోటలతోకూడిన లంకను, రావణుని సంహరించుటకు ముందుగానే, **"నేయ మస్తి పురీ లంకా"** (రా. సుం. 43-25) అను రీతిలో అసత్కల్పముగా చేసి, దానికి ప్రభువైన రావణుని కూడ సపరివారముగా అద్వితీయములైన బాణములతో సంహరించిన శ్రీరాముడే (శ్రీరంగనాథుడే) ఈ అహంకార మమకారములను నశింపచేసి, "మనస్సు అను రక్కసుని (రావణుని) వివేకమను బాణములతో నశింపచేసెను" (సాత్త్వత సంహిత - 12-51) అని తాత్పర్యము.

**శతురమామదిళ్శూళ్** - చతురస్రమై, క్రమరీతిలో కట్టబడి, రక్షకము కాగల్గిన, గొప్ప వైశాల్యమును కల్గిన కోటలచే చుట్టబడి యుండుట, క్రమపద్ధతిలో కట్టబడియుండు జలదుర్గ-వనదుర్గ, పర్వతదుర్గములను కల్గియుండుట, -అనగా **"వేలైశూళ్ వెప్పెడుత్త విజ్జిశూళ్లిలజ్గై"** (భక్తిసార. సూ. 39) అనునట్లు విశాలమైన సముద్రము అను జలదుర్గముచే చుట్టబడి, అనంతరము అరణ్యము అను వనదుర్గము, అందున్న పర్వతము అను గిరిదుర్గము, దానిపై గొప్ప కోటలను కల్గియుండుట.

**మామదిళ్** - అచటి కోటలకు సూర్యచంద్రులు కూడ వాని వెనుకనే ఒదిగియుండునట్టి వైశాల్యము, ఔన్నత్యము కలవు. భగవానుని విషయమున పల్కిన **"భీషోదేతి"** (తైత్తి. ఆనం. 8-1) అను సూక్తి రావణుని విషయమున అన్వర్థమగునట్లు కదా లంక ఉండెను. ప్రత్యక్షముగా తనకు ఎదురైన భగవానుని ఎదిరించునట్లు రావణుని చేసిన కోటకదా అది ! ఈ లంకాసౌందర్యమును, రక్షణను చూచి కదా నీచుడైన రావణుడు శ్రీరాముని ఎదిరించెను. ఇది తాను నిర్మించిన కోట అని అతడు గుర్తింపలేకపోయెను. కోటలోనుండియే శ్రీరాముని అతడు ఎదిరించుటచే, ఆ కోట అతనిని రక్షకము కాకుండుటయేగాక, వినాశహేతువయ్యెను. ఆ కోటను వీడి, శ్రీరాముని బాహువులనే రక్షకముగా ఆశ్రయించిన విభీషణుడు **"ఖస్థ ఏవ వ్యతిష్ఠత"** (రా. యు. 17-8) అని ఆకాశములో స్థిరముగా నిలచెను. (ఇది **వి+అతిష్ఠత** అనుపుడు 'వి' అను ఉపసర్గముయొక్క ధ్వన్యర్థము.)

**ఇలజ్జై** - కందిరీగల తుట్టవలె ఇతరులను బాధించు చోటుకు సత్పురుషులకు దరిచేర సాధ్యముకానట్లు దుర్గమములైన కోటలను, అగడ్తలను కల్గియున్నదని అర్థము. సీతాదేవి రావణుని చూచి **"ఇహ సంతో వా న సంతి సతో వా నానువర్తసే, తథా హి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా"** (రా. సుం. 21-9) అని ప్రశ్నించెను. నిజమునకు **"సతో వా నానువర్తసే"** అన్నప్పుడే **"ఇహ సంతో వా నసంతి"** అను అర్థమును చెప్పినట్లే అగును, కాని ప్రత్యేకముగా మరల ఏల చెప్పబడినది ? అనినచో, "నీవిట్టి అకార్యమును చేయుటకు హేతువు-కులపాంసనులు పలువురు లేకుండుట చేతనా ? లేక, నీవు నీకు లేకుండుట చేతనా ? అనగా, పరబ్రహ్మము ఒకటి కలదని నీవు తలపకపోవుటచేతనా ? మంచి మాటను పల్కువాడొకడు విభీషణునివంటివాడు ఉన్నచో అతనిని **"త్వాం తు ధిక్ కులపాంసనమ్"** (రా.యు. 16-15) అని తరిమికొట్టితివి కదా ! అట్టివాడు వేరొకడు లేకపోవుటచేతనా ? మిగిలినవారందఱును మూఢులేకదా ! మూఢులతో నిండిన లంకకదా" ఇది అనిభావము. హనుమానుడు లంకకు

రాగా, అతనికి రాక్షసులు ఎదిరించుటకుముందే లంకిణి అతనిని గమనించి ఎదిర్చెను కదా ! ఇట్లు ఒక స్త్రీసైతము ఎదిరింపగలుగునట్లు ఊరును (లంకయు), అగడ్తలును ఉన్నవి.

**ఇలజ్జైక్కిఅవన్** - "ఈ గుహలో సింహమున్నది" అనునట్లు, లంకాధిపతిగా ప్రసిద్ధిచెందిన రావణుడు పాలించులంక. ఇదియే కాక, **"లంకాం రావణపాలితామ్"** (రా. సుం. 1-39) అనునట్లు, "పులిదూరిన పొద" అని భయపడునట్లుగా భీతిచెందవలసినట్టిది లంక, దానికి నిర్వాహకుడైన రావణుని సామర్థ్యము.

**ఇఱైవన్** - భగవానుడు శ్రీవైకుంఠములో సభచేసి, వేంచేసియున్నట్లుగా, రావణుడును అహంకరించి, తాను లంకకు ప్రభువని తలచియున్న విధమును ఈ పదము తెల్పును. విరక్తుడైన హనుమానుడును **"యద్యధర్మో న బలవాన్ స్యా దయం రాక్షసేశ్వరః, స్యా దయం సురలోకస్య సశక్రస్యాభిరక్షితా"** (రా.సుం. 49-15) అని ప్రశంసించిన ఐశ్వర్యముకదా రావణునిది.

**ఇఱైవన్** - దుర్మార్గులందఱు ఆశ్రయించుటకై తగిన నీడయై (ఆధారమై) యున్నవాడు రావణుడు. ఒకడు సాత్త్వికుడైనచో అతడి వద్ద సత్పురుషు లందఱు చేరుదురు. అట్లే, దుర్మార్గునివద్ద దుష్టులందఱు చేరుదురు. ఎవరి కొఱకు (విభీషణుని కొఱకు) ఇతనిని (రావణుని) వధింపతలచుచున్నాడో, అతడే (రావణుడే) కొంచెము అనుకూలించినచో, అతనినే ఈ అగడ్తకు (లంకకు) కావలివానిగా (పాలకునిగా) స్వామి చేసియుండునుకదా, తల్లిని, తండ్రిని (సీతారాములను) కలువకుండునట్లు విడదీసిన నీచుడుకదా ఇతడు (రావణుడు)! **"తేన సీతా జనస్థానా ద్ధృతా హత్వా జటాయుషమ్"** (రా.యు. 17-17) అను సీతాహరణమునకు పరిహారముకలదు; కాని, ఈ జటాయు హననమునకు పరిహారములేదు కదా ! వీరి (దివ్యసూరి) మనస్సుకూడ ఈ (భాగవతాపచార రూప) పాపమునకు పరిహారములేదని కదా బాధపడినది.

**తలైవత్తుదిరవోట్టి** - ఇట్లు భగవదపచార - భాగవతాపచార -

అసహ్యాపచారములకు సీమా భూమియైన నీచుని వరబలముచే. మొలిచిన శిరస్సులను, పనసఫలములను గాలి వలె రాల్చెను. మొలుచు తలలను క్రిందపడు తలలు చూచునట్లుగా ఖండించుచు, స్వామి చిరకాలము లీలారసమును అనుభవించెను. దీనిని చూచిన దేవతలు "ఈవిధముగానే యుద్ధము కొనసాగినచో ఏమిగతి ?" అని భయపడగా, తనను వధింపవలెనని రావణుడు ప్రయోగించిన బాణములను క్రింద పడునట్లుచేసి, తటిమి అనియు అర్థము. అనుకూలించువాడు (భగవానుడైన శ్రీరాముడు) ప్రతికూలించినచో ఇక చెప్పవలసినదిలేదుకదా ! యుద్ధమున అలసిపోవునట్లు చేసి , తటిమికొట్టిన రీతి **"ఒట్టి"** అను పదము ద్వారా వ్యక్తము. ఈఅర్థము **"గచ్ఛానుజానామి"** (రా.యు. 59-114) అని శ్రీరామాయణమునను తెలుపబడినది కదా !

**ఓర్ వెజ్గణై యుయ్త్తవన్** - బాణములు అమోఘమ్ములైయుండుటయు, సంహరించిన గాని వెనుకకు తిరిగి రాకుండుటయును **"ఓర్"** అను శబ్దమువలన ప్రతీతమగుచున్నవి.

**ఉయ్త్తవన్** - ప్రయోగించినవాడు అని అర్థము. మరునాటి యుద్ధములో జయాపజయములు అవ్యవస్థితములని బ్రహ్మాదులు తెలుపగా, ఆశిరస్సులకు మూలమైన హృదయములో అద్వితీయమైన బ్రహ్మాస్త్రమును ప్రయోగించినవాడు. అతడు (రావణుడు) అత్యంతప్రాతికూల్యమును కల్గియున్నాడని తెలిసిన పిమ్మటనే స్వామి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను.

**ఓదవణ్ణన్** - రావణవధానంతరము యుద్ధములో అలసిన సుగ్రీవుడు మొదలగువారి యుద్ధశ్రమ పూర్తిగా తీరునట్లు స్వామి సముద్రస్వభావుడైయ్యెను. వారు ఒక సముద్రతీరముననున్న విధమున శ్రీరాముని అప్పటి సముద్రమువంటి స్వరూపస్వభావములు ఈపదముచే వివక్షితములు. రావణుని నిరసించుటయేతప్ప, లంకలోని స్థితి ఏమియు చెడకుండ అచటి ఐశ్వర్య మంతటిని విభీషణుని అధీన మొనర్చెను. అట్లు విభీషణున కొసగిన ఔదార్యమునకు తగినట్లు ఉదారస్వభావమైన సముద్రమువలె నున్నవాడనుటను

ఈ పదము తెల్పుచున్నదనియు చెప్పవచ్చును. సముద్రము ఔదార్యగుణమునకు ప్రతీకకదా ! లేక, ఈ పదము శ్రీరంగనాథుని తెలుపుచున్నదనియు భావింపవచ్చును. శ్రీరంగనాథుడును సముద్రముతో ఉపమింపబడెను కదా ! దీనివలన శత్రువులను శరములతో, అనుకూలురను, (భక్తులను) అందముతో బాధించున్నదనియు తాత్పర్యము.

**మదురమా వణ్డుపాడ మామయిలాడ రఙ్గత్తమ్మాన్** - స్వామి తన కార్యము పూర్తి కాగానే అనుచరులకు ఆడుటకు, పాడుటకు అవకాశమిచ్చెను. కొందఱు పాడ ప్రారంభించినచో, ఆడువారును మరికొందఱు ఉండవలెను కదా ! తమ్మెదలు పాడగా, నెమళ్లు నాట్యము ఆడసాగెను. నెమలి తన పింఛమును విప్పినపుడు వనమునకు గొడుగుపట్టినట్లున్నది (సౌందర్యాధాయకమైయున్నది). "మాతలి రావణుని ముందు తన రథమును నడుపగా వంచకుడైన రావణుని ప్రధానమైన శిరస్సులు వాలి పడునట్లు అతని శరవర్షమును ప్రయోగించిన నాథుడు నన్ను రక్షించుటకై వచ్చుట ఏవిధముగాను కానలేకుంటిని" అని గోదాదేవి (5-3) తన వంటి ఒక వనిత (సీత) యొక్క విరోధియగు రావణుని ప్రధానశిరస్సు తెగి కిందపడునట్లు శరవర్షమును వర్షించిన ఆ వీరుడు నా విరోధిని కూడ నిరసించుటకు రాలేదు అని నిర్నిమేషముగా ఎదురుచూచినది కదా ! అట్లు ఎదురుచూడవలసిన అవసరము లేకుండునట్లు "రణరంగమున రాక్షసరాజు అగు రావణుని వధించిన మన వీరుడైన శ్రీరాముడు వేంచేసి యున్న గొప్ప ఆలయము శ్రీరంగము" (శ్రీ.ప్ర. -11)అని కీర్తించినట్లు ఆవీరుడు తానే స్వయముగా రావణవధానంతరము ఆ యుద్ధశ్రమ తీరునట్లు దక్షిణపు వాకిలిద్వారా ప్రవేశించి, శ్రీరంగమున శయనించెను. శ్రీరంగములోని తోటలు నిత్యవసంత ఋతువుతో కూడినవై, మధువును స్రవించునవియై యుండుటచే, ఆ మదువును ఆకంఠము పానముచేసి, దానివలన కల్గిన హర్షమును వెలువరించుటకై తుమ్మెదలు ఝుంకారగీతములను పాడినవి. వానికి సంశ్లేషమువలన ఎట్టిశ్రమలేకుండుటచే వాని పాట అంతయు

మధురముగానుండునట్లు **"తెన్నా తెనా"** అని ధ్వనించుచుండగా, ఆ గానమునకు ఆడువారివలె గొప్పనెమళ్లు ఈ ఊరిలోని తోటల పైన సంచరించునట్టి మేఘములను చూచి గర్వించి, నాట్యమాడును. ఈ ఊరిలో నివసించువారు సహజముగనే సరసతను (ఆనందమును), గర్వమును కల్గియుందురు కాబోలు ! భగవానుడు పరరూపముతో వైకుంఠమున నున్నప్పుడు నిత్యులు, ముక్తులును ఆ స్వామిని సేవించి, **"హావు హావు హావు"** (తైత్తి. భృగు 10-6) అని ఆనందింతురు, రామకృష్ణాదిరూపమున అవతరించినపుడు **"గాయంతి కేచిత్. . . . నృత్యంతి కేచిత్"** (రా.సుం. 61-14) అను రీతిలో నిత్యసూరులకంటె తక్కువవారగు తిర్యక్కులైన సుగ్రీవాదులును స్వామిని సేవించి ఆడుదురు, పాడుదురు. అర్చారూపియై శ్రీరంగమున శయనింపగానే, సుగ్రీవాదులకంటె తక్కువవైన, పక్షిజాతికి చెందినవగు తుమ్మెదలు, నెమళ్లను ఆనందముగా పాడును, ఆడును. ప్రభువు తెల్లచొక్కాను తొడిగి మారువేషమున సంచరించునపుడు, అతనిని సేవించుటకై సేవకులును నల్లచొక్కాలను దాల్చి అనుసరించునట్లే, పరమపదములోని భగవానుడు శ్రీరాముని అవతార రూపమున భూమిపై, శ్రీరంగనాథుని రూపమున శ్రీరంగమున వెలసినపుడు నిత్యసూరులును సుగ్రీవాదులుగా, నెమళ్లుగా, తుమ్మెదలుగా వెలసిరి. **"సర్వైః పరివృతో దేవైః వానరత్వముపాగతైః"** (రా.యు. 114-17) అనుచు ఈ అంశము శ్రీరామాయణమున తెలుపబడినది కదా ! దీనివలన శ్రీరంగములోని పక్ష్యాదులును నిత్యసూరుల రూపములే అని తాత్పర్యము. ఈ భావమును శ్రీపరాశరభట్టరు శ్రీరంగరాజస్తవములో **"అహ్నాతసహజదాస్యాః"** ఇత్యాది శ్లోకముద్వారా అనుసంధించిరి.

**అవజ్గత్తమ్మాన్** - సంసారులకొఱకు శ్రీరంగమున పరుండి, తనయొక్క స్వామిత్వమును స్పష్టపఱచినవాని అని అర్థము. లేక, **"అమ్మాన్"** అనుటచే సౌలభ్యపరాకాష్ఠచే ఏర్పడిన మహత్వమును ఈపదము తెలుపుచున్నదనియు చెప్పనగును.

**తిరువయిఱ్ఱుదరబందమ్** - పూర్వమే నడుము **"శిఱ్ఱిడైయుమ్"** (శఠ.సూ.5-5-8)అనునట్లు ఏ ఆభరణము లేకున్నను మంగళాశాసనము చేయవలసినట్లు అందముగా నుండును. **"ఆభరణస్యాభరణమ్"** అనురీతిలో నున్న మొలనూలుతోపట్టముకట్టినట్లైనది.

**ఎన్నుళ్లత్తిల్ నిన్ఱులాకిన్ఱతే** - ఆ పీతాంబరమునందును నిలువనీయక, తిరునాభీకమలమునుండి ఆకర్షించి, దీనికి ఆశ్రయమైన నడుమునందును పోనీయక తానే పూర్తిగా పాలించి, ఆక్రమించి, రక్షించి, తన ఆధిక్యము పూర్తిగా తోచునట్లు ఉదరబంధము మత్తగజమువలె గర్వముతో అడ్డముగా నిలబడి నామనసున సంచరించుచున్నది. **"విశ్వస్యాయతనం మహత్"** (త్తైత్రి.నా. 11) అనియు, **"వెళ్ఞమ్ వాడు"** (శఠ.సూ. 8-6-4) అనియు పల్కునట్లు నా విశాలమైన మనస్సున నిలచి, ఊరేగుచున్నది.

**మునివాహనభోగము :**

రెండవ, మూడవపాశురములలో బ్రహ్మరుద్రాదులు బ్రహ్మాది కారత్వమును, కర్మమూలములైన జన్మాదులను కల్గియుండుట తెలుపబడినది. నాల్గవపాశురములో బ్రహ్మరుద్రాదులు వరములనిచ్చి రక్షించిన రావణుని నిరసించిన వృత్తాంతముతో, దేవతాంతరముల తక్కువదనమును, **"బ్రహ్మ స్వయంభూః చతురాననో వా రుద్రః త్రినేత్రః త్రిపురాంతకో వా"** (రా. సు. 51-45) ఇత్యాదిగా వారి అల్పశక్తిమత్త్వమును అనుసంధింప బడినది. బ్రహ్మాదులను అందరిని తనలో ఏకదేశమున నిలపి రక్షించిన గొప్పతనమును కల స్వామి ఉదరముయొక్క (రూపముచే) తక్కువదనము, (గుణముచే) గొప్పదనముల వలన ఏర్పడిన అఘటితఘటనాశక్తికి రక్షకమై ప్రాకారమువలెనున్న ఉదరబంధము తనమనస్సులో స్థానమునుగొని సంచరించుచున్నది. ఇది చాలా ఆశ్చర్యకరము అని కవిఅనుచున్నారు. లేక, ముందుమూడుపాశురములు అష్టాక్షరిలోని ప్రథమపదమగు ఓంకారములోని వర్ణములగు అకార ఉకార మకారములతో వరుసగా ప్రారంభింపబడుటచే అష్టాక్షరిలోని ప్రథమపదార్థము

ప్రతిష్ఠితముకాగా, నాల్గవపాశురముతో **"న నమేయం తు కస్యచిత్"** (రా.యు. 36-11) అనుచూ ఎవరికిని తలవంచని దురహంకారియైన రావణుని వధించి, **"దశేంద్రియాననం ఘోరం యో మనోరజనీచరమ్, వివేకశరజాలేన శమం నయతి యోగివాన్"** (సాత్త్వతసం. 12-51) అనునట్లు ముముక్షువుల మనస్సు అహంకారమమకార దూషితములు కాకుండునట్లు చేయు శ్రీరామచంద్రుని దివ్యచరిత్రను పురస్కరించుకొని, "నేనునూ నాకు చెందినవాడనుకాను, నావి అనునవి ఏమియును లేవు'' -అనునట్టి నమశ్శబ్దార్థమును ఇందు ప్రతిపాదితార్థముగా కవి తెలుపుచున్నారు అనియు చెప్పవచ్చును.

**శదిరమామదిళ్. . . తలై పత్తుదిర** - కులపర్వతములను చేర్చి నిర్మించినట్లున్న గాఢతను, దార్ఢ్యమును, ఔన్నత్యమును కలిగినవై, ఎనిమిది దిక్కులలోగల దిక్పాలకులకును తల ఎత్తి చూడ వీలులేనట్టి, దుర్భేద్యములైన ప్రాకారములతో అంతటా పరివేష్ఠితమై, జలదుర్గ- గిరిదుర్గ- వనదుర్గములతో దుర్గముల కన్నిటికిని ఉదాహరణప్రాయమగునట్లున్న ప్రసిద్ధమైన లంకకు ఈశ్వరుడై, రావణుడు దుర్గబల- వరబల- భుజబల- సైన్యబలములతో గర్వించెను. మాల్యవంతుడు, అకంపనుడు, మారీచుడు మొదలగు రాక్షసులతోపాటు, హనుమానుడు, విభీషణుడు మొదలగు సత్త్వప్రకృతినికలవారితోపాటు ఎట్టి భేదములేక అందఱు అవిగీతముగా పల్కిన శ్రీరామచంద్రుని మహిమను తెలిసినను, చూచినను, మతిభ్రమించుటచే **"తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి"** (రా.సుం. 21-20) అనిన సీతామాత మాటను వినలేదు. **"అరాక్షస మిమం లోకం కర్తాఽస్మి నిశితైః శరైః, న చే చ్ఛరణ్య మభ్యేషి మా ముపాదాయ మైథిలీమ్"** (రా.యు. 41-66) అని శ్రీరాముడు పల్కిన పరమహితమైన సూక్తిని కూడ అనాదరించెను. యుద్ధమునకు పంపిన మహాబలులైన సేనానాయకులు అందఱును వధింపబడగా, తాను స్వయముగా యుద్ధముచేయునపుడు **"రిపూణా మపి వత్సలః"** (రా.యు. 66) అని ప్రసిద్ధుడైన శ్రీరాముడు తన అపరాధమును సైచి, 'రేపు రమ్ము' అని

దయతో విడువగా, లజ్జలేనివాడై, మండోదరి మొదలగు స్త్రీలముఖములను చూడగల్గెను. పిమ్మట కుంభకర్ణుని, ఇంద్రజిత్తును పోగొట్టుకొని, తాను నేరుగా మరలవచ్చి యుద్ధముచేసెను. తాను ప్రయోగించిన అస్త్రములన్నియు నిరుపయోగములు కాగా, కోపముతీరక ఇంకను చల్లారని యుద్ధాభిలాషను కలవాడైయున్న రావణునిచూచి "ఇక ఇతని శిరస్సులను ఖండించుటతప్ప వేఱొక గతి లేదు" అని శ్రీరాముడు తలచి, ఒక తల క్రిందపడగా వేరొక తల చూచునట్లు పూర్వము చేసిన చిత్రవధవలెకాక, ఒకే పర్యాయము పదితలలును కిందపడునట్లు - అని ఈ ప్రయోగముయొక్క భావము.

**ఓట్టి యోర్ వెఙ్గణై యుయ్త్తవన్** - తానే వెడలి రావణుని పదితలలను గ్రహింపవలెనను కోపమును కల్గినదగు అద్వితీయమైన బాణమును విడచి, దానికి తగిన ఎఱను అందించి, దానిని ఉజ్జీవింపచేసినవాడు అనిఅర్థము. ఇది **"ఉయ్త్తవన్"** అను ప్రయోగముయొక్క స్వారస్యము అర్థము. బాణముయొక్క ఆశుకారిత్వముచేతను, రావణుని ధైర్యముచేతను పదితలలు రాలినను అతని దేహము మాత్రము తలతఱుగపడిన పనసవృక్షకాండమువలె నిలచియుండెను. **(తలైపత్తుదిర ఓట్టి)**- అనుటకు ముందు యుద్ధములో రావణుని ఓడించి, **"గచ్ఛానుజానామి"** (రా.యు. 59-114) అని తఱిమికొట్టినవాడని, **"ఓర్ వెఙ్గణై యుయ్త్తవన్"** అనుటకు ఆ పిమ్మట వధకొఱకు అద్వితీయమైన అస్త్రమును విడచినవాడనియు అర్థమును చెప్పవచ్చును. **(ఓదవణ్ణన్)** - దర్శించువారి పాపమును, తాపమును పోగొట్టగల్గిన సముద్రమువలె నల్లని వర్ణమునుకల దివ్యదేహమును కలవాడు అనిభావము.

**మదురమా వణ్డుపాడ మామయిలాడ అరఙ్గత్తమ్మాన్** - రావణుని వధించి, వీరలక్ష్మితో వచ్చి నిలచిన అందమునుచూచి, బ్రహ్మాదులు స్తోత్రమును చేయగా, అప్సరసలు మంగళనాట్యము చేసినట్లు, **"ఆత్మానం మానుషం మన్యే"** (రా.యు. 120-11) అను శ్రీరాముని రూపమునకు అనురూపముగా నిత్యులు, ముక్తులును కలసి రూపాంతరములను పొంది, (తుమ్మెదలుగా, నెమళ్లుగా

మాటి) వచ్చిరి అన్నట్లు అతిమధురముగా, జ్ఞానాదిగుణమాహాత్మ్యమును కలవగు తుమ్మెదలు రాగయుక్తముగా పాడగా, ఆ పాటకుతగినట్లు గుణాధికములైన నెమళ్ళు నృత్యముచేయుగా - ఈ గీతనృత్తములతో మంగళోత్తరమైన ఆలయములో తాను సర్వాధిపతి అనుట వ్యక్తమగునట్లు నిద్రించు శ్రీరంగనాథుని అని అర్థము. **(తిరువయిఱ్ఱుదర బంధ మెన్నుళ్ నిన్నులాకిన్దదే)** - **"దామోదరం బంధగతమ్"** అనునట్లు బంధగతులకు (బద్ధులకు, అనగా సంసారులకు) మోక్షహేతువైన దామోదరత్వమును ప్రకటించు ఉదరములో ఉదరబంధమను పేరునుకల ఆభరణము అతిక్షుద్రుడనయిన రాగదూషితమైన నా మనస్సులో "ఇదియే నివాస భూమి" అనునట్లు నిలచి, అంతులేని భోగ్యతా ప్రకాశకములైన వ్యాపారములను చేయుచున్నది అని భావము. ఈగాథలో అష్టాక్షరియొక్క, భగవానుని దివ్యదేహము యొక్క మధ్యలో కలుగు అనుభవము అనగా నమశ్శబ్దార్థముయొక్క అనుభవము, భగవానుని మధ్యభాగమగు నడుము యొక్క అనుభవమును ప్రస్తుతములు.

5. **పారమాయ పళ్ళవినై పఱ్ఱఱుత్తెన్నై త్తన్**
**వారమాక్కి వైత్తాన్ వైత్తతన్ఱి యెన్నుళ్ పుకున్దాన్**
**కోరమాతవమ్ శెయ్దనన్కొల్ ? అఱియే నరజ్గత్తమ్మాన్ తిరు**
**వారమార్పతన్ఱో వడియేనై యాట్కొణ్డదే.**

పారమాయ = మిక్కిలి భారమై, పళ్ళవినై = అనాదికాలముగా ఆర్జించిన పాపములను, పఱ్ఱఱుత్తు = సవాసనగా పోగొట్టి, ఎన్నై= పాపములకు ఆకరమైన నన్ను, తన్ = తన విషయములో, వారమాక్కివైత్తాన్ = పక్షపాతమును (ప్రావణ్యమును) కల్గియుండునట్లుచేసెను, వైత్తతన్ఱి =అట్లు ప్రావణ్యమును కల్గియుండునట్లు చేయుటయే గాక, ఎన్నుళ్ = నాహృదయములో, పుకున్దాన్ = ప్రవేశించెను, (ఇట్లు ప్రవేశించుటకు మూలముగా), కోరమ్ = ఇంద్రియములను శ్రమింపచేయుతగిన, మా తవమ్ శెయ్తనన్ కొల్ = గొప్పతపస్సును చేసితినా ? ఏమి ? అఱియేన్ = తెలియను, అరజ్గత్తు =

శ్రీరంగమున శయనించియున్న, అమ్మాన్ = సర్వస్వామియైన, శ్రీరంగనాథునియొక్క, తిరు = లక్ష్మీదేవిని, ఆరమ్ = ముత్యాలహారమును కల్గిన, మార్పతన్తో = ఆ వక్షఃస్థలముకదా, అడియేనై = స్వామి సౌందర్యమున ప్రావణ్యమును కల దాసుడనగు నన్ను, ఆళ్ కొణ్డతు = దాసునిగా గ్రహించినది, ఏ = ఆశ్చర్యము.

"నాకు ఆలంబనమగు (సహాయభూతయైన) లక్ష్మీదేవితోపాటు, ముత్యాలహారమును కల్గియున్న స్వామి వక్షఃస్థలము నానుండి స్వరూపానురూపమైన కైంకర్యమును గ్రహించినది." అని ఇందు కవి అనుచున్నారు. మూడవగాథలో కవి స్వామి నాభీకమలము బ్రహ్మను ధరించియున్నట్టి తన గొప్పతనమును, అందమును చూపి, తమ మనస్సును పీతాంబరమునుండి తనపట్ల ఆకర్షింపగా, అచట అది సుడిగుండములో చిక్కుకున్నట్లదయినదని తెలిపిరి. పూర్వగాథలో (నాల్గవగాథలో) దీనిని చూచిన స్వామి ఉదరము సకలచేతనాచేతనములను తానే ధరించియున్నట్టి అతిశయమును, యశోదాదేవిచే దారముతో కట్టబడినందులకు గుర్తులు అయిన కిణములను తాను కలిగియుండుటను చూపి, తన సౌలభ్యమును, సూక్ష్మమైన కటిప్రదేశమును చూపి, ఆ నాభీకమలమునుండి తమ మనస్సును తనపట్ల ఆకర్షించినదనిరి. అచటినుండి తమమనస్సును పోనివ్వక, ఆ కటిసౌందర్యమునకు పట్టము కట్టినట్లున్న కటిబంధము (మొలనూలు) తమ మనస్సునందు స్వైర సంచారములను చేయుప్రకారమును అందుకవి తెలిపిరి. కాని ఆ ఉదరమునకు ఏదోఒక సమయమున (ప్రళయసమయమున) సకలాండములను ధరించుయున్న అతిశయము, ఏదోఒకసమయమున యశోదాదేవి కట్టినందున ఏర్పడిన సౌలభ్యమునుమాత్రమే కదా కలదు ! అట్టిది కాదుకదా స్వామి వక్షఃస్థలము ! **"శ్రీవత్స సంస్థానధర మనంతే చ సమాశ్రితమ్, ప్రధానమ్"** (వి.పు. 1-22-69)అనియు, **"ఆత్మాన మస్య జగతో నిర్లేప మగుణామలమ్, బిభర్తి కౌస్తుభమణిం స్వరూపం భగవాన్ హరిః"** (వి.పు.

1-22-68) అనియు చెప్పునట్లు సర్వకాలము చేతనాచేతనములను శ్రీవత్స కౌస్తుభ రూపమున ధరించియున్న గొప్పతనమును, అతని స్వరూపాదులకు నిరూపకభూతయై, సౌలభ్యమునకు పర్యంతసీమయైయున్నట్టి లక్ష్మీదేవికి అంతః పురమైయుండు గొప్పతనమును, ఉభయవిభూతినాథుడనుటకు గుర్తుగా సమర్పించిన వనమాలను దాల్చియున్న ఆకారమును కల్గినదై, **"అక్కువడ ముడుత్తావైత్తాలి పూణ్డ వనత్తశయున్"**,"శంఖముల సరముల నడుమున కూర్మరూప ఆభరణమును కంఠమున దాల్చిన అనంతశాయి అయినవాడు" (భట్టనాథ సూ. 1-7-2) అనునట్లు యశోదాదేవి అలంకరించిన ఆభరణములను కల్గినదైకదా స్వామి వక్షఃస్థలముండును. అందుచే ఆ ఉరము ఉదరముకంటె తనకుగల ఆధిక్యమును, సౌలభ్యమును, "హారము మొదలగు ఆభరణముల కలయికచే ఏర్పడిన అందమును కల్గినదానిని నేనే కదా !, అందుచే కీర్తికి ఆకరమైన నాతో స్వామి సన్నవినడుము సమానమగునా ? అని తన గర్వమును చూపి, ఆ ఉదరబంధమునుండి తనమనస్సును తనవైపునకు ఆకర్షింపగా, కరణమగు తమ మనస్సుకు మాత్రమేకాక, కరణియగు తమకును స్వరూపజ్ఞానాదులను కల్గించి దాస్యమును గొన్న రీతిని (దాసునిగాచేసికొన్న రీతిని) ప్రకృతమున దివ్యసూరి తెలుపుచున్నారు.

**పారమాయ పళ్ళవినైపర్రఱుత్తు ఎన్నై త్తన్వారమాక్కివైత్తాన్** - పూర్వపాశురములో రాగాదిదోషములకు అంతర్భూతమైన మనోరాక్షసుని (మనస్సు అను రాక్షసుని) శ్రీరంగనాథుని మూలమూర్తి అనుగ్రహించిన వివేకమను శరములచే నశింపచేసిన తీరు తెలుపబడినది కదా ! అందు కల్గిన ఒక సందేహమునకు సమాధానరూపము ఈ గాథ. శ్రీరంగనాథుడు అనుగ్రహించిన వివేకశరములతో మనోరజనీచరుని జయించితిమి అంటిరికదా! ఆ వివేకజ్ఞానము - **"సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్"** (గీతా. 14-17) అనునట్లు సత్త్వముయొక్క అభివృద్ధివలన కల్గును కదా ! ఆ సత్త్వము రజోగుణము, తమోగుణమును ఉపశమించినచో జనించునట్టిది. ఆ రజస్తమస్సులన్నచో

"కర్మవశ్యా గుణా హ్యేతే" (వి.పు.2-13-70) అనునట్లు కర్మవశ్యములై యుండును. అట్టి కర్మలు **"ధర్మేణ పాప మపనుదతి"** (తైత్తి. నా. 50) అనురీతిలో నివృత్తికర్మానుష్ఠానముద్వారా పోగొట్టుకొన వీలయినవి. ఆ కర్మానుష్ఠానమునకు తగిన జన్మమేమాత్రము అవకాశములేని మీకు ఆ దుష్కర్మములు నశించుట ఎట్లు సంభవము ? అనగా, అట్టి అనుష్ఠేయములైన సాధ్యకర్మములచే పోగొట్టుకొనిన కదా కర్మానుష్ఠానమునకు అవకాశముండుట, లేనిచో లేకుండుట అనెడి క్రమము. **"కృష్ణం ధర్మం సనాతనమ్"** (భార. ఆరణ్య. 87-26) అని, **"రామో విగ్రహవాన్ ధర్మః"** (రా.ఆ.37-13) అని, **"అఱమ్ఞవరాకినిన్ఱ వరజ్గనాక్"** (ధర్మమేమూర్తీభవించినట్లున్న శ్రీరంగనాథుడు-శ్రీ.ప్ర. 6) అనియు కీర్తింపబడునట్టి సిద్ధధర్మస్వరూపుడైన భగవానుడే సహాయముగా నుండి ఆదుష్కర్మలను పోగొట్టెను అని తాత్పర్యము.

**పారమాయ** - ''పరమపదమునకు స్వామియైన వానిని స్తోత్రముచేయుగల్గినవాడను'' (శఠ.సూ. 4-5-9) అని, ''భగవానుని ఆనందింపచేయ వాక్ శక్తిని కల'' (శఠ.సూ. 6-4-9) అనియు పల్కిన, గొప్ప వాక్పటిమనుకల శఠకోపసూరి "అనాదియైన, అంతములేని కర్మపరంపరలు'' (శఠ.సూ. 3-2-2) అనినరీతిలో ఈ దివ్యసూరియు **"పారమాయ"** అనుచున్నారు. అల్పశక్తినికల తాను సంపాదించినదే అయినను, కర్మబాహుళ్యముచే ఆకర్మల రీతి ఎట్టిదో చెప్పసాధ్యము కాకుండనుండును. సర్వశక్తియైన భగవానుడు పోగొట్టునపుడు కూడ అవిఏర్పడిన క్రమమున పోగొట్ట సాధ్యముకాదు. అనగా కేవలకృపవలన మాత్రమే పోగొట్ట సాధ్యమే కాని, ఒక్కొక్కటిగా అనుభవింపచేసి పోగొట్టుదమన్న స్వామికి వీలులేదు. సమూహముగా పోగొట్టవలసినదే. ఇక కర్మల వివరము ఏమనగా- తాను చతుర్విధ దేహములందు ప్రవేశించుటకు హేతువైయున్నవి. ఆయా శరీరములందలి రుచికి మూలమైయున్నవి. విషయప్రావణ్యమునకు మూలమైయున్నవి. దేవతాంతరములకు తాను శేషమని తలచు బుద్ధికి

మూలమైయున్నవియు, భగవానుని ఆశ్రయించి, ముక్తానందమును కోఱక, ప్రయోజనాంతరములను పొంది నివర్తించుటకు హేతువులైయున్నవియు, అల్పములైనయును. ఇవి అన్నియు ప్రత్యేకముగా సమూహములుగా (అనేకములుగా) నుండును.

ఇవియేకాక, విహితానాచరణముచే, నిషిద్ధాచరణముచే, పాపిష్ఠి వారితోడి సహవాసముచే ఏర్పడుటచే మూడు విధములైయుండును. మఱియు మానస-వాచిక-కాయిక రూపమునను మూడు విధములై యుండును. **"యద్బ్రహ్మకల్పనియుతానుభవేఽప్యనాశ్యం తత్కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే"** అని కూరేశుల వైకుంఠస్తవమున (60) చెప్పబడిన రీతిలో కర్మఫలానంత్యమును **"పారమాయ"** అనుటద్వారా తెలుపుచున్నారనియు చెప్పనగును. సంహరించుటయు నరకములోనే, సృష్టించుటయును నరకములోనే. ఇట్లు కర్మలు భార మగుటకుగల కారణము ఇకపై తెలుపబడుచున్నది.

**పழவினை** - కాలము అనాది, ఆత్మ నిత్యము, అచిత్సంసర్గముకూడ అనాదిగనే అనువర్తించునుకదా ! ఇట్లు ఇంతవరకుగల కాల మంతటికిని పూర్ణభోజనము నిచ్చినవికదా నాకర్మలు. **"సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"** (గీతా. 18-66) అనుచు భగవానుడే స్వయముగా పోగొట్టవలసినట్టివి ఈ కర్మలు.

**పற்றறுத்து** - ఉపాయశీలురు పునాదిని తవ్వి, గోడను పడగొట్టురీతిలో సవాసనగా కర్మలను పోగొట్టి అని అర్థము. (ముక్తానందము నకు కర్మలు అడ్డు అగుటచే గోడగా వానిని వ్యాఖ్యాత రూపణము చేసిరి) కర్మసంబంధము లేని నిత్యసూరులకును పాపసంబంధముండవచ్చునేమోకాని, ఈదివ్యసూరికి ఉండదు అని చమత్కారము. అజ్ఞానము, తత్కృతమైన కర్మము, దానికి మూలమైన దేహసంబంధమును అను మూడింటిని వాసనారుచులతో పోగొట్టి- అని భావము. అనగా అజ్ఞానము-అజ్ఞానవాసన - అజ్ఞానరుచి, కర్మ- కర్మవాసన- కర్మరుచియు, దేహము-దేహవాసన-దేహరుచి -అనువీనిని పోగొట్టి అనితాత్పర్యము. క్రమమున అనుష్ఠించు సాధ్యకర్మయైనచో కదా క్రమమున

పోవలసియుండుట. సిద్ధరూపుడగుటచే సవాసనగా వెంటనే వానిని ఒకేసారి స్వామి పోగొట్టెను. ఇట్లు అనాది కాలార్జితములైన కర్మలను సవాసనగా పోగొట్టుటమాత్రమే కాదు -

**ఎన్నైత్తన్‌వారమాక్కివైత్తాన్** - **"ఈశ్వరోఽహ మహం భోగీ"** (గీతా. 16-14) అని అహకరించియున్న నన్ను తనపట్ల పక్షపాతమును కల్గిన వానినిగా చేసెను **(ఎన్నై)**- **"అహ మస్మ్యపరాధానా మాలయః"** (అహిర్బుధ్న్య. సం. 37-30) అనియు, "పాపమే చేసి పాపినైతిని" (కలివైరి.సూ. 1-9-9) అనియు పల్కురీతిలో అపరాధములే నిరూపకములుగా కల్గియున్న నన్ను అని అర్థము. ఈ పాపమునకు మూలమును తెలియని నన్ను అని, పాపముల ఉత్పత్తికి ఆకరమనియును చెప్పవచ్చును. **"అఘమహోదధిః"** అని అర్థము. "ఇట్లు బాధపడితినే" అను అనుతాపమునుకూడ లేకుండనున్న నన్ను అనియు భావము.

**తన్ వారమాక్కివైత్తాన్** - వారమనగా అధికమైన ప్రీతి. ఇతడు చెల్లింపవలసిన ఋణమును నేనే చెల్లించెదనని ఒక జీవుని ఋణమును (కర్తవ్యమును)తన యందు భగవానుడు ఆరోపించుకొనునట్లు నా పాపమును అంతటిని పోగొట్టి నన్ను తనకు అధీనునిగా చేసికొనెను అనిభావము. లేక, అల్పానందములను వీడి తననే లక్ష్యముగా గొనునట్లు నన్ను చేసెననియు చెప్పవచ్చును. (భక్తుడు **'అహ మస్మి అపరాధానా మాలయః'** (అహిర్బుధ్న్య సం. 37-30) అనుచు తనను **'అహమ్'** శబ్దముచే నిర్దేశించునట్లే భగవానుడును **"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"** (గీతా. 18-66) అనుచు తనను **'అహం'** శబ్దముతో నిర్దేశించు కొనుటచే వీరిద్దరిమధ్య నామసామ్యము కలదు. అందుచే భక్తుని పాపములను **"సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"** (గీతా. 18-66) అను ప్రతిజ్ఞను అనుసరించి నిర్హేతుక కృపతో పోగొట్టి, అతనిని ఋణవిముక్తుని చేయునని పిండితార్థము)

**వైత్తాన్** - తమ తలంపులేకుండగనే భగవానునివలన వచ్చినదని తోచునట్లు చేసెను అనిభావము. "ఎదిర్చిన ఆయుధపాణియైన రాక్షసుని

ఆయువు ముగియునట్లు అతనిని చంపి జయమును పొందిన వీరుడైన భగవానుడును నేను చేసిన పాపములను నశిపంచేయగలడా'' (తిరుచ్చంద-116) రావణుని సపరికరముగా వధించి, జయించిన పిమ్మట నన్ను తనతో సమానముగా చేయుటచే యమాదులచే నన్ను గూర్చి తలచుటకు వీలుకానట్లు అయితిని.

**నైత్తతన్ని ఎన్నుళ్‌పుకున్దాన్** - ఇట్లు చేసిన మంచికితోడు నాదుష్కర్మలను సవాసనగా పోగొట్టి, తానుతెలిసిన భక్తి రూపాపన్న జ్ఞానమునకు తననే విషయముగా చేయుటయే కాక, నేను సన్నిహితుడనైనచో పూర్వపు రుచి-వాసనలను ఆరోపించుకొని, పూర్వమువలె మరల దుష్కర్మలను చేసి, దూరముగా తొలగిపోవచ్చును అని తలచి, ఆరుచివాసనలు నాలో ప్రవేశింప కుండునట్లు నా మనస్సున ప్రవేశించి, తన వాసనాబలముచే అవి నిర్మూల మగునట్లు చేసెను అనిభావము.

**ఎన్నుళ్‌పుకున్దాన్** - "దాసునిలో ఉన్నాడు, దాసుని శరీరములోఉన్నాడు" (8-8-2) అనియు, "నిలవలేనని నామనస్సున నిండుగా ప్రవేశించెను" (10-8-2) అనియును శఠకోపసూరి పల్కురీతిలో ఎంతయో గొప్పతనమును కలవారి విషయమున కటాక్షించునట్లు నా నైచ్యమును చూడకనే వసిష్ఠుడు చండాలుని ఇంటిలో ప్రవేశించునట్లు నాలో ప్రవేశించెను.

**ఎన్నుళ్ పుకున్దాన్** - తన తాళలేని తనముచే దాహార్తుడు తటాకమునందు దిగి లోపలకు మునుగునట్లు స్వామియు నామనస్సులో ప్రవేశించెను. **"అనశ్నన్నన్యః"** (ముండక. 3-3-1) అనునట్లు మనస్సుతో సంబంధములేకుండనుండువానికి అది లేనిదే జీవింపలేనట్లు అయ్యెనని చమత్కారము.

**కోరమాతవమ్ శెయ్‌దన కొల్** - పూర్వమే ఘనముగా నున్న తపస్సుకు తోడు ఈ భగవత్ప్రాప్తి రూపఫలమును పొందుటకు ఏ ఘోరతపస్సును చేసితినో ! **"తపసా విన్దతే మహత్"** (భార. వన. 89-19) అనునట్లు చిరకాలము అతిఘోరమైన తపస్సును చేసితినా ? **"మహతా తాపసా రామ మహతా చాపి**

**కర్మణా"** (రా.ఆ. 66-3) అనుచు వాల్మీకి భగవద్రూపుడైన శ్రీరాముని పుత్రునిగా దశరథుడు గొప్ప తపఃఫలముగా పొందెననెను కదా ! అట్లే **"తే తం సోమ మివోద్యంతమ్"** (రా.ఆ. 1-11) అనెడి భగవానుడైన శ్రీరంగనాథుని పొందుటకు గొప్ప తపస్సును చేయవలెను కదా ! **(అటియేన్)** - తెలియను. నాకు తెలిసి అట్టి తపము ఏదియు లేదు.

ఇట్లు దివ్యసూరి శంకింతురేమి ? అన్నచో, తాము పొందిన ఫలము అట్టి వారికే లభించును కావున. అతడు (భగవానుడు) కావేరీ నదీతీరమున పరుండి తపస్సు చేసెనో ? ఏమో ? తెలియదు. రావణునితో జరిగిన ఘోరమైన యుద్ధములో తనను అర్పించుకొనిన జటాయువువలె "ఏ మంచిని చేసితిని నా మనస్సులో ఇట్లు ప్రకాశించుటకు" (శఠ.సూ.10-6-8) అనియు తమపట్ల ఏ పుణ్యమును కానరాకుండుటచే ఇట్లు కవి సంశయి[illegible]చుచున్నారు. నిర్హేతుకముగా శ్రీరంగనాథుడు ఇట్లు అనుగ్రహించుటయా ! అని కదా ఇచట దివ్యసూరి విద్ధులగుచున్నారు. దీనివలన భగవానుడు నిర్హేతుకముగా వీరిని అనుగ్రహించెనని భావము. తమను, తమ సంపదను నాకు అధీనమొనర్చినవారికి నన్ను, నా సొత్తును అధీనమొనర్చుట సారహీనమైనది. అని తలచి, అన్ని విధముల కరుణించినను ఏమియు అనుగ్రహింపనివాని వలె కదా అతృప్తుడై భగవానుడుండును. "నీ దాసులకు ఏమి ఉపకారము చేయుదునని ఎల్లప్పుడు చింతించుచున్నావు" (పెరియతిరువన్దాది -53) అని భగవానుడు శఠకోపసూరిచే ప్రశంసింపబడినాడు కదా !

**"అటియేన్"** (తెలియను) అనుచు పల్కినవారే ఇట్టి ఘనమైన ప్రాప్తికి తప్పక ఏదో హేతువు ఉండియుండవలెనని తలచి, ఆ కారణమును తెలిసితిననుటను పిమ్మట తెలుపుచున్నారు.

**అరఙ్గత్తమ్మాన్ తిరువారమార్పతన్రో వడియేనై యాట్కొణ్డదే** - ఈ దివ్యసూరి తపఃఫల మిట్టిది. అనగా, లక్ష్మీదేవితో, హారములతో కూడిన శ్రీరంగనాథుని వక్షఃస్థలదర్శనమే ఘోరతపముతో సమానము అని అర్థము.

గొప్ప తపస్సువలన కోరిన ఫలము సిద్ధించునట్లే, స్వామి వక్షఃస్థలము దివ్యసూరికి స్వరూపానురూపమైన ఫలమును అనుగ్రహించినదని భావము.

**అరఙ్గత్తమ్మాన్** - వీరి విరోధిని పోగొట్టి, ఉజ్జీవింపచేయుటకై శ్రీరంగనాథుడు ఇచటకు వచ్చిపరుండెను కాబోలు. ఈ దివ్యసూరికి కల్గు ప్రయోజనము తన ప్రయోజనముగా తలచి, స్వామి తాను ప్రయత్నించుటకు హేతువైయున్న స్వామిత్వ- స్వత్వరూప సంబంధ మిచట (**'అమ్మాన్'** అను పదముచే) తెలుపబడినది. ఈ ఫలముకొఱకు నదీతీరమున నుండి తపస్సుచేసినవాడు అతడే. లేనిచో, ఈ ఘనమైన ఫలమునకు వేరొక కారణముండుటకు వీలులేదు కదా !

**తిరువారమార్పతన్నో** - లక్ష్మీదేవిని, హారములనుకల వక్షఃస్థలము కదా ! **"హిరణ్యవర్ణామ్"** అనియు, **"హిరణ్యప్రాకారామ్"** (శ్రీసూక్తము) అనియును స్తుతింపబడు లక్ష్మీదేవికి స్వామి వక్షస్సు అంతఃపురమై యున్నది. దానికి బంగారు ప్రాకారములుగా హారములు అమరియున్నవి. ఇచట లక్ష్మీదేవిని తెలుపు **"తిరు"** శబ్దప్రయోగమువలన తమకు ఆలంబనముగా తల్లినీడలో ఒదిగియుండుటను దివ్యసూరి తెలిపిరి. ఇతనిని గూర్చి (జీవునిగూర్చి) **"తేన మైత్రీ భవతు తే"** (రా.సు. 21-20) అనియు, భగవానుని గూర్చి **"న కశ్చి న్నాపరాధ్యతి"** (రా.యు. 116-44) అనియు తాను చెఱలో నుండియేపల్కి, వారిఉభయులను కలుపుటకు చూచునట్టి లక్ష్మీదేవి స్వామి వక్షఃస్థలములో నున్నచో ఇక ఆమె భక్తులను స్వామితో చేరునట్లు చేయునని చెప్పవలసినది లేదుకదా ! అందమైన వక్షఃస్థలమున హారములు, ఆ హారములకు అందమును కల్గించునట్టిది వక్షఃస్థలము. హారములవలన ఆ వక్షఃస్థలమునకు అపూర్వమైన అతిశయము కల్గుచున్నదనుట కంటె, దాని అందమునకు దృష్టిదోషము కలుగకుండునట్లు హారములు కప్పిపుచ్చుచున్నవని చెప్పవలెను. **"సర్వభూషణభూషార్హా: కిమర్థం న విభూషితా:"** - (రా.కి. 3-15) అను శ్రీరామాయణ సూక్తిని శ్రీకృష్ణసూరి ఇట్లే వ్యాఖ్యానించుట ఇచట గమనార్హము) శ్రీరంగనాథస్వామి దివ్యావయవములును **"సర్వభూషణ భూషార్హా:"** అనునట్టివి కదా !

**అడియేన్** - కూలికి సేవకులు పనిచేసినట్లు, దివ్యసూరి పూర్వము చేసిన కైంకర్య మంతయు అందమునకు జితులై చేసినసేవ. ఇది స్వాభావికమైన, ఆజానసిద్ధమైన కైంకర్యము. హనుమానుడును **"దూతో రామస్య"** (రా.సుం 36-2) అని మొదట పల్కినను, పిమ్మట సీతాదేవి అనుగ్రహము కల్గిన వెంటనే **"దాసోఽహం కోసలేంద్రస్య"** (రా.సుం. 42-34) అనెను. (ఇచట **"దూత-రామ"** శబ్దములచే స్వామి అందమునకు జితుడై ఆ అందముసేవించుట అనుకూలిని గాని దూత్యమును మునుముందు చేసెనని, పిమ్మట సీత అనుగ్రహమువలన స్వరూపసిద్ధమైన దాస్యమును కల్గిన వాడయ్యెనని క్రమేణ స్ఫురించుచున్నది)

**అడియేనై** - జ్ఞానానందములకంటె ముందుగా శేషత్వమును ప్రథమనిరూపకముగానున్న నన్ను అని అర్థము. సర్వనామశబ్దము బుద్ధిస్థభావములను పరామర్శించును కదా !

**ఆట్కొణ్డదే** - నేను కోల్పోయిన శేషత్వమును నాకు అనుగ్రహించినది కదా ! అధికారమునకు తగినవాడు పట్టాభిషిక్తుడైనట్లు, నా స్వరూప విరోధిని, ఆశ్రయణవిరోధిని, ఉపాయవిరోధిని, ఉపేయవిరోధిని, భోగవిరోధిని పోగొట్టి, స్వరూపానురూపమైన కైంకర్యమును నాకు అనుగ్రహించినది. తనయొక్కగొప్పతనమును, అందమును, దర్శింపచేసి, నన్ను అనన్యార్హశేషత్వమును కల్గినవానినిగా చేసి, లక్ష్మీదేవిని **"న కశ్చి న్నాపరాధ్యతి"** (రా.యు. 116-44) అనునట్లుచేసి, శ్రీరంగనాథునిద్వారా నా విరోధిపాపములను సవాసనగా పోగొట్టి, ఆ శ్రీరంగనాథుని భోగ్యతను నాకు ప్రకాశింపచేసి, అది నా హృదయమున ప్రవేశించునట్లు చేసి, నా స్వరూపానురూపమైన కైంకర్యమును గ్రహించినది స్వామి వక్షఃస్థలమే కదా అని సారము.

**అడియేనై యాట్కొణ్డదు తిరుమార్పతన్రో** - అన్యులను కొందఱను సరిదిద్ది, వారినుండి కైంకర్యమును గ్రహించుటకు, "ప్రవహించు కావేరీనది చుట్టియున్న శ్రీరంగములో నాగపర్యంకమున పవళించియున్న ఆశ్చర్యచేష్టితుని యొక్క లక్ష్మీనివాసమగు వక్షము, మరకతమణి వంటి వన్నె, భుజములు,

పవిత్రములైన తామరపూవులవంటి కన్నులు, ఎఱ్ఱని పెదవి, పగడము వంటి అధరము, చక్కని కిరీటము- వీనినన్నిటివలన కల్గిన తేజస్సు" (శ్రీ.ప్ర. 20) అని, తానున్న ఊరికి అలంకారమైన నదీసౌందర్యమునుండి అన్ని అందములు దర్శింపచేయవలసియున్నవి. కాని, నన్ను దాసునిగా చేసికొనుటకు నాకు వక్షఃస్థలసౌందర్య మొక్కటియే పర్యాప్తమైనది, స్వామిసౌందర్యమున మునిగిన నన్ను అతని గుణములు (కల్యాణగుణములు- దారములు) కదా రక్షించినవి - అని కవి హృదయము. అందమున మగ్నులైనవారిని గుణములను చూపి కాపాడవచ్చును; కాని, గుణములలో మగ్నులైన వారిని రక్షించుటకు ఆగుణమే (ముఖముపై నీటినే కదా చెల్లుదురు) ఆవశ్యకము. (నీటిలో మునిగిన వారిని కాపాడుటకు ఆ నీరే కదా ఉపాయము.)

ఈ పాశురమున "వైత్తదన్ని ఎన్నుళ్‌పుకున్దాన్" అనుటద్వారా దివ్యసూరి అంతర్యామి బ్రాహ్మణమున చెప్పబడిన విధమున చేతనాచేతనములలో అంతర్యామిగా అంతట వ్యాపించియుండు భగవానుని వ్యాప్తియు, శక్తియు శ్రీరంగనాథుని యందు కలదని తెలిపిరి.

**మునివాహనభోగము :**

ఇకపై రెండు పాశురములలో అష్టాక్షరిలోని మూడవదియైన నారాయణశబ్దముయొక్క తాత్పర్యరూపముగా లక్ష్మీదేవి నివసించుటచే అసదృశమైన స్వామి వక్షఃస్థలమును, కంఠసీమను అనుభవించుచున్నారు.

**(పారమాయ పఴ్వినై పఱ్ఱఱుత్తు)**- కాలతత్త్వము ఉన్నంతవరకు ప్రాయశ్చిత్తము చేసికొన్నను తీరనివిధమున సంచితమై, అనాదికాలము అనువర్తించు సాంసారికకర్మకలాపముతో గలసంబంధము సవాసనగా వీడిపోవునట్లుచేసి అని అర్థము. **(ఎన్నై తన్‌వారమాక్కివైత్తాన్)** - ఇట్లు కర్మపరవశుడనై, ఇంద్రియకింకరుడనై, అట్టివారే అయిన ఇంద్రాదులను ఆరాధించి, తనివితీరక వారిపట్ల పక్షపాతమును చూపుచున్న నన్ను (ఎన్నై

శబ్దార్థము), అపహత పాప్మడై, స్వామిత్వమునకు పరాకాష్ఠయై, సూరిభోగ్యుడగు తనయొక్క (తన్‌శబ్దార్థము), అంతఃపురస్త్రీలవిషయమునవలె ఇతరులకు ఎట్టి భాగములేనట్లు చేసి, తన అసాధారణకైంకర్యమును నాకు అనుగ్రహించి, పిమ్మట నేను ఏసమయమునను మాఱకుండునట్లుచేసెను. (వారమాక్కివైత్తాన్ శబ్దార్థము)

**వైత్తదన్రి ఎన్నుళ్ పుకున్దాన్** - నన్ను అనన్యునిగా చేయుటయేగాక, పూర్వము ప్రయోజనాంతరములలో ఆసక్తినికల నా హృదయములో, అనన్యప్రయోజనవిషయమై, దస్యులచే (దొంగలచే) గ్రహింపబడిన తన రాజధానిలో (నాహృదయములో) ఆదస్యులను ఓడించి, తిరిగి ప్రవేశించెను. **కోరమాదవమ్ శెయ్‌దనన్ కొల్ ? అటియేన్** - అనాధికారముగా కోల్పోయిన నన్ను తిరిగిపొందుటకు అకర్మవశ్యుడైన భగవానుడు తానే స్వయముగా అవతారక్షేత్రమైన అయోధ్యను విడచి, ఆశ్రితులు ఉండు స్థలమగు లంకకును పోకుండ, గంగకంటె పవిత్రమైన కావేరినదియొక్క మధ్యభాగమున అతిఘోరమైన గొప్పదైన ఒకానొక తపస్సును చేసెనో ఏమో ? తెలియదు. ఇది అత్యద్భుతమైన, అతివాదగర్భమైన ఉత్ప్రేక్ష. అనగా, సర్వసంసారమును నివర్తింపచేయునదియై, అమోఘమైయున్నదొక **"మోక్షయిష్యామి"** (గీతా.18-66) అనునట్టి సంకల్పరూపమైన తపస్సును స్వామి చేసెనని తాత్పర్యము. లేక, ఈ గొప్పఫలమును పొందుటకు అయోగ్యుడనయిన నేను దీనికి తగిన అమోఘమయినదగు ఒక మహాతపస్సును చేసి, తత్ఫలమును పొందినవాడను కావలెను కదా ! దీనికి **"త్వయి నిహితభరోఽస్మి సోఽహం యతః"** (వరదస్త -91) అని, **"తవ భరోఽహ మకారిషి ధార్మికైః"** (శ్రీరంగరాజస్తవే. ఉ. 102) అనియు పల్కురీతిలో ఇపుడు నేను, ఇతరులును తెలియగల్గిన ఏ తపస్సును చేసినట్లు తెలియలేను- అని ఈశ్వరుని సహజకృపాగుణప్రాధాన్యమున ఈసూక్తియొక్క తాత్పర్యము అనియు చెప్పవచ్చును.

ఇట్లు క్షుద్రుడయిన నాపట్ల దయచూపినవాడు తనను తాను రక్షించుకొనలేని అలక్ష్మీకులలో ఒకడు కాడు. అతడు"తాను అచట ఉండగనే

క్షణమైనను వీడిపోలేనని పల్కు అలమేలుమంగ నివసించు వక్షఃస్థలమును కలవాడు" (శఠ.సూ. 6-10-10) అగుటయు, శేషభూతులైన తమకు సిరిగలవాడే కైంకర్యప్రతిసంబంధి అగుటయును నివర్తింపని తమ చిత్తమునకు తెలుపుచున్నారు.

**అరఙ్గత్తమ్మాన్. . . .ఆట్కొణ్డదే** - అందటికిని దర్శింపవీలుండునట్లు సర్వసహిష్ణువై, ఆలయములో శయనించు సౌలభ్యకాష్ఠతో విరోధింపని స్వామిత్వకాష్ఠను కల శ్రీరంగనాథుని శేషిత్వపూర్తికి లక్షణమైన లక్ష్మి, సౌందర్యప్రవాహమునకు ఆనకట్ట కట్టినట్లున్న వక్షఃస్థలము కదా, స్వాభావిక శేషిత్వానుభవరసికుడనై, దానికిమించి గుణములచే దాస్యమును పొందినవాడనగు నన్ను స్వరూపానురూపమైన స్తోత్రాదిశేషవృత్తిలో అన్వయింపచేసి, దానికి (ఆస్తోత్రమునకు) లక్ష్యమై నిలచినది. ఈ పాశురములోని పదములందు క్రమముగా నారాయణశబ్దములో వివక్షితములైన అనిష్టనివర్తకత్వము, ఇష్టప్రాపకత్వము, లోపలబయట వ్యాపించియున్న వ్యాప్తివిధము, నిత్యకృప, ఉపాయమునకు ప్రధానమైన సౌలభ్యము, ప్రాప్యతకు ప్రధానమైన స్వామిత్వము, సర్వానుగుణమైన శ్రియఃపతిత్వము, భూషణాస్త్ర నిరూపకములుగా నున్న భువనములను దాల్చు భోగ్యతమమైన విగ్రహయోగము, నారశబ్దార్థమైన దాసుని (భక్తుని) స్వరూపము, దాస్యఫలముగా ప్రార్థింపబడు కైంకర్యము అను అంశములు అనుసంధేయములు.

6. **తుణ్డ వెణ్ పిఱైయన్ తుయర్ తీర్త్తవన్ అఞ్జిఱైయ**
**వణ్డువాழ் పొழிల్శూழ்అరఙ్గనగర్మేయ వప్పన్**
**అణ్డరణ్డ పకిరణ్డ త్తొరుమానిల మెழுమాల్వరై ముற்றுమ్**
**ఉణ్డ కణ్డఙ్కణ్డీ రడియేనై యుయ్యక్కొణ్డదే**

తుండమ్= కలామాత్రమై, వెణ్ = తెల్లగానున్న, పిఱైయన్ = చంద్రుని జటాజూటమున కలవాడగు రుద్రునియొక్క, తుయర్ = భిక్షను అర్థించుచు తిరుగుటకు కారణమైన పాతకమును, తీర్త్తనన్ = పోగొట్టినవాడై, అమ్ =

అందమైన, శిత్రైయ = తెక్కలనుకల్గిన, వణ్డు = తుమ్మెదలు, వాళ్ = నివసించుచున్న, పొళ్రిల్‌శూళ్ = తోటలచే చుట్టబడియున్న, అరఙ్గనకర్ = శ్రీరంగమును ఆశ్రయించి, మేయ = నిద్రించుచున్న, అప్పన్ =తండ్రియైనవాడు, అణ్డర్ = బ్రహ్మాండములలోనున్న చేతనులను, అణ్డమ్ = బ్రహ్మాండము, పకిరణ్డమ్ = ఆ అండమునకు బయటనున్న అణ్డములను, ఒరు = అద్వితీయమైన, మానిలమ్ = మహాపృథివిని, ఆ భూమికి ఆధారభూతములైన, ఎళ్లు = ఏడు, మాల్వరైయుమ్ = కులపర్వతములను, మర్రుమ్ = మిగిలిన అన్నిటిని, ఉణ్డ = గ్రసించిన, కణ్డమ్ కణ్డీర్ = కంఠమే కదా ! అడియేనై = దాసుడనగు నన్ను, ఉయ్యక్కొణ్డదు = సంసారమున చిక్కుకొనకుండకాపాడినది, ఏ = ఆశ్చర్యము.

వ్యాఖ్య : ఈ పద్యమున సర్వలోకములను గ్రసించిన శ్రీరంగనాథుని కంఠముయొక్క సొబగు నన్ను ఉజ్జీవింపచేసినది అని కవి అనుచున్నారు. స్వామి వక్షఃస్థల సౌందర్యము దివ్యసూరిని కంఠసీమలో పైకి తేలునట్లు చేసినదనియు చెప్పవచ్చును. ముందు పాశురమును కవి శ్రీరంగనాథుని వక్షఃస్థలము హారాద్యాభరణశోభను, లక్ష్మీదేవికి తాను అంతఃపురమైయున్న అతిశయమును చూపి తమను స్వామి కటిప్రదేశమునుండి పైకివచ్చునట్లుచేసి, తనకు అధీనునిగా చేసికొనుటనుకదా పల్కిరి. ఇందు ఆ వక్షఃస్థలమునకు పైననున్నదై **"రమయతు స మాం కంఠః శ్రీరంగనేతు రుదంచితక్రముకతరుణగ్రీవాకంబుప్రలంబమలిమ్లుచః, ప్రణయవిలగల్లక్ష్మీవిశ్వంభరకరకందళీకనకవలయక్రీడాసంక్రాంతరేఖ ఇవోల్లసన్"** అని పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కినరీతిలో బాలక్రముకవృక్షము యొక్క కంఠమువలె ప్రకాశించునదియై, రేఖాత్రయాంకితమై, రెండు చివరలలో సన్ననిదై, మధ్యలో బలిసియుండుటచే, మధురమైన నాదమును కల్గియున్నదగుటచే పాంచజన్యమువలె యున్నకంఠము - **"అలర్‌మేల్ మజ్గైయుఱైమార్బా"** (శఠ.సూ. -6-10-10) అనునట్లు లక్ష్మీదేవికి అంతఃపురమైయున్న ఆకారము, హారములతో అలంకృతమైన ఆకారమును

మాత్రమే కదా ఈ వక్షఃస్థలమునకు కలదు. లక్ష్మీదేవివంటి, అందమైన గాజులను ముంజేతులకు అలంకరించు కొనియున్న దేవేరులు" (భక్తిసార.సూ.) ఎందరో సాభరణములైన తమ కరములతో ఆలింగనము చేసికొనుటచే, ఆ ఆభరణములు ఒత్తుకొనగా వానిచే ముద్రితమైనదానిని నేనే కదా! ప్రళయాపత్తు వచ్చినపుడు సకల బ్రహ్మాండములను, అందున్న చేతనాచేతనములు అన్నిటిని రక్షించిన దానిని నేనేకదా ! అంతియేకాక, లక్ష్మీదేవి వక్షఃస్థలముననున్నను ఆలింగనము చేసికొనునది నన్నే కదా, మఱియు, పాండవులు దూతగా పంపినపుడు మెడలో కట్టిన పత్రముయొక్క గుర్తు నాయందే కదా కలదు ! (పూర్వము వార్తలను ఒకచోటినుండి వేరొక చోటికి పంపుటకై పావురములవంటి పక్షులను ఉపయోగించెవారు. అలవాటుపడిన పావురముల మెడలో తాము పంపదలచిన సందేశములను వ్రాసిన చీటిని కట్టి వానిని వదలెడివారు) వక్షః స్థలమునకు ఆభరణములైన హారములకును నేనేకదా ధారకుడను" అని తలచినట్లు తన ఆభరణ శోభను, యౌవనమును, ఆపన్నివారకత్వస్వభావమును చూపి, నన్ను సంసారమను ప్రళయమునుండి ఉత్తీర్ణుని చేసి, ఉజ్జీవింపచేసినదని కవి పల్కుట ఇందలి విషయము.

**తుణ్డవెణ్ పిఱైయన్ తుయర్‌తీర్త్తవన్** - ముందు గాథలో -నా అజ్ఞానముచే నాచే గాని, ఇతరులచే గాని పోగొట్టుకొన వీలుకాని అనాదికాలార్జితములై, **"అవశ్య మనుభోక్తవ్య"**మై, గొంతును పట్టుకొని పీడించు దుష్కర్మలను, లక్ష్మీదేవి పురుషకారముకాగా **"తత్క్షణాదేవ నశ్యతి"** (కృష్ణాష్టకము) అనునట్లు శ్రీరంగనాథుడు నశింపచేసెననిరి. దీనిని వినినవారు, **"పారమాయ పఴవినై"** అను (భారములైన ప్రాచీన దుష్కర్మలను) లక్ష్మీ పురుషకారముకాగా పోగొట్టెననుట ఆశ్చర్యముగానున్నదే ! ఇది ఉపపన్న మనుటను మేము తెలియుట ఎట్లు ? అనగా, నావలె తన అజ్ఞానముచే ఈశ్వరాభిమానియైన రుద్రుడు లోకగురువై, తనకు తండ్రియైన బ్రహ్మయొక్క శిరస్సును నఖములతో ఖండించి, దానివలన తనచేతను, ఇతరులచేతను పోగొట్టవీలులేనట్టి

పాతకమును సంపాదించి, అది పోవుటకై క్షీరాబ్దినాథుని వద్దకు రాగా, అచట భగవానుడు లక్ష్మీసహితుడుగా ప్రత్యక్షమై **"శ్రీమాన్ మయా భిక్షాం ప్రయాచితః"** (మాత్స్య, పు. 184) అనునట్లు అపేక్షానుగుణముగా ఆమె (లక్ష్మీదేవి) పురుషకారముకాగా, రుద్రునకు బ్రహ్మహత్యవలన కల్గిన పాతకమును తీర్చినట్లే, **"స ఖలు బ్రహ్మహా భవేత్"** అనునట్టి నాయొక్క బ్రహ్మహత్యాపాతకమును పోగొట్టెను అనుచు దివ్యనూరి ఇందు పల్కుచున్నారు. జీవుడు మహాపాతకాదిపాపములను ఆచరించి, మహారౌరవాది నరకములలో అచిత్సముడై యుండి, యమభటుల చేతులలో అలసిపోవునంతవరకు బాధలను అనుభవించి, వారు విడిచినవెంటనే, **"స్థావరక్రిమయోఽబ్జా శ్చ పక్షిణ శ్చ సరీస్పపాః"** (వి.పు. 2-6-33) అనురీతిలో ముందుగా స్థావరాదియోనులలో జన్మించి, పిమ్మట **"మానుష్యం ప్రాప్య లోకేఽస్మిన్ స మూకో బధిరోఽపి వా, నాపక్రామతి సంసారాత్ స ఖలు బ్రహ్మహా భవేత్"** అనునట్లు మనుష్యజన్మను పొందగల్గి, శ్రోత్రాదికరణములును తన అధీనమునుండునట్లు పొంది, వానినిగొని భగవానుని ఆశ్రయించి నామసంకీర్తనముచేసి, తద్ద్వారా ఈ సంసారమును దాటని వాడైనచో, అతడు **"బ్రహ్మహా"** (బ్రాహ్మణఘాతకుడు) అనబడుచున్నాడు. పురుగును చంపువానికి, బ్రాహ్మణ శరీరమును వధించిన వానికిని హింస సమానమే అయినను, బ్రాహ్మణవధను బ్రహ్మహత్య అనుటకు కారణ మేమనగా ఆ బ్రాహ్మణుని జన్మవృత్తముచే కల్గిన గౌరవమువలన కదా ! అట్లే, **"యస్యాత్మా శరీరమ్"** (బృహ- 5-7-22) అనునట్లు భగవచ్ఛరీరభూతమైన ఆత్మను అపహరించి, స్వామినారాయణత్వమునకు భంగముకల్గించువానిని **"బ్రహ్మహా"** అనుటలో దోషములేదుకదా !

**తుణ్డవెణ్ పిఱైయన్ తుయర్తీర్త్తవన్** - "గంగతో కూడిన ఎఱ్ఱని జటలుగల, నీలకంఠుడు . . . అగు వాని శాపము తీరునట్లు వక్షఃస్థలమునుండి పరిమళితజలమును (స్వేదమును) ఇచ్చినవాడు'' (భక్తిసార. సూ.-113) అనునట్లు తీర్థసేవచేతను, తనతపస్సుచేతను, తనశక్తిమత్త్వముచేతను రుద్రుడు పోగొట్టుకొనలేని గొప్పపాతకమును, లక్ష్మీదేవి పురుషకారముకాగా, తన వక్షః

స్థలములోని స్వేదజలముచే స్వామి పోగొట్టుట తమపాతకమును తీర్చుటకు నిదర్శనముగా నుండుటచే, రుద్రుని ఉదాహరణముగా ప్రస్తుతమున కవి స్వీకరించుచున్నారు. మొగలిరేకును అలంకరించుకొని వచ్చువారివలె కలావశిష్టుడైన తెల్లని చంద్రుని జటలో కల్గిన రుద్రుని పాపమును పోగొట్టినవాడు అని ఇచటి అర్థము.

కలావశిష్టుడైన చంద్రుని తన జటలో అలంకరించుకొని రుద్రుడు వచ్చెననుటకు ఇట్లు ఆవన్నుడై వచ్చునవుడును అలంకరించుకొని దృప్తుడైవచ్చెనని భావము. చంద్రుని తెల్లదనముచే ఎఱ్ఱని జటలకు పరభాగ శోభకల్గినది. బరువును మోయువారు తమ తలలపై చుట్టుకొని, తల చుట్టలో తాటిమట్టను పెట్టుకొనునట్లు, రుద్రుడు సాధకుడైనను సుఖప్రధానుడై, స్వాభిమానమును కల్గియున్నవాడయ్యెను. అయినను అతనికి ఆపదవచ్చినచో భగవానుడు తప్ప వేరొక రక్షకుడు లేడుకదా ! దీనివలన రుద్రుడు ఒక దేవతను (చంద్రుని) ఆభరణముగా కలవాడగుటచే అతిశయమును కలవాడైనను, భోగప్రధానుడను విషయము, ముముక్షువు కాదనుటయు వ్యక్తమగుచున్నవి.

**వెణ్పిఱైయున్ తుయర్** - ఏనుగునకు దానిగొప్ప రూపమునకు తగినరీతిలోనే (ఎక్కువగానే) గొప్పవాతమువచ్చునట్లు రుద్రుని గొప్పతనమునకు తగినట్లే గొప్పదుఃఖము కల్గెను. లోకమున కంతటికిని శంకరుడైన (సుఖప్రదుడైన) వానికి వచ్చిన పాతకము కదా అది ! రుద్రుడు తన గర్వముచే బ్రహ్మశిరస్సును ఖండించిన పిమ్మట అతని పుత్రత్వము నశించినను, తానుతండ్రి అగుటచే బ్రహ్మ అతనిని వధింపక, గర్వము నశించుటకై **"కపాలీ త్వం భవిష్యసి"** (మాత్స్య. పు. 182)అని శపింపగా, ఇతడు చేతిలో "దుర్గంధమును కల బ్రహ్మకపాలమును చేతిలో గొని ముల్లోకములో బిచ్చమెత్తి తిరిగినవాడు" (కలివైరి. సూ. 6-9-1) అనునట్లు కపాలమును గొని, బలిభుక్కు (కాకి) అగు జయంతుని వలె **"త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య"** (రా. సుం. 38-33) అనునట్లు ముల్లోకములందు తిరిగి, క్షీరాబ్ధికి చేరగా, **"ఇడర్కెడుత్త తిరువాళన్"**

(దుఃఖమును తీర్చిన శ్రీపతి) అనునట్లు, లక్ష్మీసహితుడై వచ్చి, దుఃఖమును తీర్చెను. **"తత్ర నారాయణ శ్రీమాన్ మయా భిక్షాంప్రయాచిత:, విష్ణుప్రసాదాత్ సుశ్రోణి ! కపాలం తత్ సహస్రధా విస్ఫుటితం బహుధా స్వప్నలబ్ధధనం యథా"** (మాత్స్య. పు. 182) అని దుర్మానియైన రుద్రుడు తానే తనకిష్టమైన భార్యను చూచి చెప్పుగొప్పరీతిలో భగవానుడు అతని దుఃఖమును తీర్చెనుకదా ! ఈ శ్లోకమును పూర్వాచార్యులు వ్యాఖ్యానించిన తీరు ప్రకృతమున ప్రస్తోతవ్యమను భావనతో తెలుపబడుచున్నది.

**తత్ర** - ఆ పరమపదమును, **(నారాయణః)** ఈ పదము జీవుల అపరాధమును చూడక రక్షించుటకు మూలమైన (స్వస్వామిభావరూప) బంధవిశేషమును తెలువుచున్నది. **(శ్రీమాన్)** - సిరిని కలవాడు అట్టిబంధవిశేషమున్నను, స్వామి **"క్షిపామి"** అన్నచో అతనిని ఓర్చుకొనునట్లు చేయు లక్ష్మియొక్క నిత్యసంబంధము ఈపదముచే స్పష్టము. **(మాయా భిక్షాం ప్రయాచిత:)** - లోకమంతయు నమస్కరించి ప్రార్థించునపుడు, వారికి అందటికిని అపేక్షితముల నిచ్చు నేనే ప్రార్థించితిని. **(విష్ణుప్రసాదాత్)** - నామనస్సులో నుండి, నా ఆరాటమును పూర్తిగా తెలిసినవానిని ప్రసాదమువలన. (విష్ణుశబ్దము భగవానుని సర్వవ్యాపకత్వమును తెలుపును కావున రుద్రుని మనస్సులో కూడ నివసించి, తద్దుఃఖమును తెలిసికొని స్మరించెనని ఈ విష్ణు పదము వలన స్ఫురించుచున్నది) **(సుశ్రోణి)**- ఇట్లు నేను రక్షింపబడుటకు నీ సౌభాగ్యము కారణము సుమా ! **(తత్ కపాలమ్)** - ఎప్పుడును నిండకుండ, చేతిని విడువకుండనున్న కపాలము. ('తత్' అనునది సర్వనామశబ్దము అగుటచే, సర్వనామ శబ్దమునకు బుద్ధిస్థపరామర్శిత్వము కలదు కావున ఈ భావము స్ఫురించుచున్నది) **(సహస్రధా)** - వేయి ముక్కలుగా రూపము కంటికి కనుపించనంతగా చూర్ణమైనది. భగవానుడు విరోధిని పోగొట్టునపుడు పూర్వము విరోధి ఏర్పడినదనుటకూడ తెలియనట్లు సవాసనగా పోగొట్టుననుటకు ఈ వృత్తాంతము ఉదాహరణము.

**తుణ్డవెణ్ పిఱైయన్ తుయర్ తీర్త్తవన్** - చంద్రుని క్షయ రోగమును పోగొట్టిన వాడనియు భావము. ఈ ఐతిహ్యమువలన చంద్రుని దుఃఖమును పోగొట్టినట్లే, నాదుఃఖమును కూడ (దివ్యసూరి దుఃఖమును) పోగొట్టునని తాత్పర్యము ఇచట స్ఫురించుచున్నది.

**అఞ్జిఱైయ వణ్డువాళ్ పొళ్ళిల్‌శూళ్ అరఙ్గనకర్‌మేయవప్పన్** - లోకములో శివునివంటి ముఖ్యులైనవారు బ్రహ్మహత్యను చేసి, ఆ పాపమును పోగొట్టుకొని విధమును తెలియక పరిభ్రమించుచుండగా, తాను దూరముననుండతగదని వారి రక్షణార్థముగా దటికివచ్చి శయనించియున్న ఉపకారకుడు. అందమైన ఱెక్కలనుకల తుమ్మెదలు నివసించు తోటలను చుట్టును కల శ్రీరంగమున శయనించియున్న తండ్రి. (అప్పన్ అనుపదమునకు ఉపకారుడని, తండ్రి అని అర్థములు కలవు.) ఆరుద్రుడు భగవానుని వక్షఃస్థలములోని స్వేదజలమును పొంది ఆనందించినట్లు, శ్రీరంగములోని తుమ్మెదలును అచటి తోటలలోని మధువును తాగిన కారణముచే కల్గిన హర్షము వాని ఱెక్కలలో చూడగల్గురీతిలో అతిశయించి యుండునని ఈపదముల కలయికచే స్ఫురించుచున్నది.

**వణ్డువాళ్ పొళ్ళిల్** - తుమ్మెదలు ఆ శ్రీరంగనాథుని వైపు పోకుండ అచటి తోటల రమణీయతలో ఆర్ద్రహృదయమును కల్గినవై, కదలలేకుండ నుండును. అట్లే, తమనుకూడ స్వామి తన సౌందర్యమును అనుభవింపచేసి, ఆర్తిని తీర్చెనని కవి భావము, లేక, **"ఉభాభ్యా మేవ పక్షాభ్యా మాకాశే పక్షిణాం గతిః, తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః"** (నార. పు. 64-11) అనునట్లు, "తుమ్మెదలారా ! రండి" (తిరువిరు-55) అనబడు తుమ్మెదలవంటి ముముక్షువులు అగు సాత్త్వికులు- ఱెక్కలవంటి సమ్యక్‌జ్ఞాన- సత్కర్మలను మోక్షసాధనములను గొని ఉజ్జీవించుట ఇచట తెలుపబడుచున్నదనియు చెప్పవచ్చును. శ్రీరంగనాథునకు ఆభరణమై, ఊరికిని ఆభరణమైయుండు తోటలు ఇవి. ఈతోటలకు ఆభరణమైయుండు తుమ్మెదలు, ఆ తుమ్మెదలకు ఆభరణమైయుండు అందమైన ఱెక్కలు అను భావము. 'అమ్' అను విశేషణమును సర్వత్ర అన్వయించుట ద్వారా ఏర్పడును. పరమేశ్వరుడు

ప్రార్థింపగా అతనికి ఒక్కనికి అనుగ్రహించిన తీరు పూర్వము తెలుపబడినది. ఇపుడు, అపేక్షానిరపేక్షముగా సకల జగత్తుల ఆపదను పోగొట్టినది స్వామికంఠమే అనుటను సోదాహరణముగా తెలుపుచున్నారు.

**అణ్డరణ్డమ్** - అండాంతర్వర్తులైన అండములలో నుండు చేతనులను కల్గిన ఈ అండము.

**పకిరణ్డత్తు** - బయటగల అండములు. ఇట్టి, బయటనున్న పలు బ్రహ్మాండములు.

**ఒరువానిలవ్ం** - ఇట్టి అండములను ధరించియుండుటచే అద్వితీయమైన పృథివి (**ఒరు**- అను సర్వనామ శబ్దముచే ఈ అద్వితీయత్వము స్ఫురించుచున్నది)

**ఎఝువాల్వరై** - ఈ అండములు, భూమియు పాతాళమున పడకుండునట్లు శంకుస్థాపనము చేసినట్లు ఈభూమిలో వ్యాపించియున్న కులపర్వతములు ఏడును.

**మర్రుముణ్డకణ్డమ్ కణ్డీర్** - ఈ అండములను ప్రత్యేకముగా చెప్పుట ఎందులకనగా, వానిని అట్లు పల్కుట కవికి ప్రీతికరములు కావున. శ్రీరంగనాథుని కంఠమును దర్శించిన వెంటనే ప్రళయకాలమున లోకములను స్వామి దానిద్వారా గ్రసించి, ఉదరమున నుంచుకొనుట గుర్తుకువచ్చును కదా !

**ఉణ్డ కణ్డవ్ం** - పూర్వము చెవికి కొంతకాలము ఆభరణము ధరించివిడచిన గుర్తువలన ప్రకృతమున ఆ ఆభరణము లేకున్నను పూర్వము ధరించి యుండుట తెలియునట్లే, భగవానుడు పూర్వము ప్రళయకాలమున లోకములనన్నిటిని గ్రసించుటను కంఠము సూచించుచున్నదనుట ఈ పదము వలన వ్యక్తమగుచున్నది.

**మర్రుముణ్డకణ్డమ్** - బయటనున్న బ్రహ్మాండములలోని జీవులను పాతాళాదులను అన్నిటిని గ్రసించిన కంఠము.

**ఉణ్డకణ్డమ్** - శేషభూతునకు (సేవకునకు) కైంకర్యము ధారకమైయుండునట్లే, బ్రహ్మాండాదుల గ్రసనము స్వామికి ధారకమై యుండునుకాబోలు. **"అత్తా చరాచరగ్రహణాత్"** (బ్ర.సూ. 1-2-9), **"యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవతి ఓదనమ్"** (కఠ. 1-2-15) అని ఈవిషయము బ్రహ్మసూత్రములలో, వేదములో చెప్పబడుచున్నది కదా !

**అడియేనై యుయ్యక్కొణ్డదే** - నాకు స్వరూపజ్ఞానమును కల్గించి, సంసారసముద్రమునుండి ఉత్తీర్ణుని గావించి, తీరమును చేర్చి, **"సన్త మేనమ్"** (తైత్తి. ఆనం. 6) అనునట్లు చేసినది ఇట్టి స్వామికంఠమే కదా ! అని ఈప్రయోగ తాత్పర్యము.

**మునివాహనభోగము :**

పూర్వగాథలో కైంకర్యార్థులైన కవి తమ కైంకర్యమునకు విరోధులగు నిరుపాధిక స్వామిత్వాభిమానమూలములను అన్నిటిని భగవానుడు పోగొట్టినరీతిని తెలిపిరి. ఇందు ఐశ్వర్యార్థులయొక్క ఐశ్వర్యవిరోధి యగు భిక్షుకదశను పోగొట్టు విధమును సోదాహరణముగా తెలుపుచున్నారు.

**తుణ్డవెణ్పిఱైయన్ తుయర్ తీర్త్తవన్** - ఈశ్వరుడను పేరునుకల తనకును పూర్ణతలేదనుటకు సూచకమనునట్లు శకల (ఖండ) మాత్రమై ప్రకాశించు చంద్రకళను ధరించు రుద్రుడు బ్రహ్మకు పుత్రుడైనను తండ్రిపట్ల అపరాధమును చేసి, దానిచే గొప్ప పాతకమును పొందినవాడై పరిభ్రమించుచు, ఒకానొక సమయమున సముద్రముమధ్యలో ఉన్న ఓడ ఒడ్డుకుచేరునట్లు, కారుణికుడైన భగవానుని చేరి, "తండ్రీ ! నా శాపమును పోగొట్టుము" (పరకాల. సు. 1-5-8) అని ప్రార్థింపగా ఇతని శాపమును తీర్చినవాడు అని భావము. దీనిచే ఈశ్వరుడను పేరుగల రుద్రుడుకూడ కర్మవశ్యుడనుట, తననుతాను రక్షించుకొనలేని ఇతడు వేరొకరిని రక్షింపజాలడనుట, సర్వేశ్వరుడే సర్వానిష్టనివర్తకుడనుటయును తెలుపబడినవి. (**అఞ్జైయ వణ్డు వాళ్ పొఴిల్**

**శూఘ్లురజ్గ నకరమేయవప్పవ్)** - ఆర్తిని కలవారు కోటినచో వారికి దూత్యము చేయుటకు, దోషములేని పూవులవంటి "తన పాదములయందు" (తిరువిరు. 54) వారిని చేర్చుటకు హేతువైన (అమ్ శబ్దార్థము) గతికి సాధనములై, అభిగతములైన ఱెక్కలను కల (శిఱైయుశబ్దార్థము) తుమ్మెదలు అభిమతభోగమును పొంది నివసించు (వణ్డువాళ్ శబ్దార్థము) దివ్యోద్యానములచే చుట్టబడియున్న (పొళ్లిల్‌శూళ్ శబ్దార్థము) శ్రీరంగ నగరములో నిత్యవాసమును చేయునట్టి (అరజ్గనగర్‌మేయ శబ్దార్థము) సర్వలోకపిత(అప్పన్ శబ్దార్థము) అని భావము. ఇందుచే అందరికి కారణభూతుడై, కరణకరళేబరముల నిచ్చి ఉపకరించినవాడు, అందఱి కంటికి లక్ష్యభూతుడై వచ్చి శ్రీరంగమున శయనించి, ఇంద్రియములు విషయాంతరములయందు ఆసక్తములు కాకుండునట్లు కాపాడిన శ్రీరంగనాథుడనుస్వామియొక్క ఉపకారాతిశయమును ఉదాహరించినట్లయినది. **"నరా జ్జాతాని తత్త్వాని"** (భార. ఆను. 186-7) ఇత్యాది ప్రమాణముల అర్థము ఇచట అనుసంధేయము. కారణావస్థలో అన్ని కార్యములను (చేతనాచేతనములను అన్నిటిని) ఉపసంహరించి, పిమ్మట సృష్టించుటకు ఉదాహరణముగా **"వఱ్ఱిప్పోర్ క్కడలర్పైయన్ విఘ్లుజ్గామల్ తాన్‌విఘ్లుజ్గి"** అను రీతిలోఅన్నిటినీ ఉజ్జీవింపచేసిన ఉపకారమునుచూపి, "ఫాలనేత్రుడు, చతుర్ముఖుడు మొదలుగా గలవారు భగవానుడు గ్రసించి ఉమిసిన ఎంగిలి దేవతలు కానివారు కలరా" (కలివైరి. సూ. 11-6) అను అర్థమును పల్కుచు తమను సంసారార్ణవము కబళింపకుండ స్వామి కాపాడుటను దివ్యసూరి ఇకపై స్మరించుచున్నారు. **(అణ్డరణ్డబకిరణ్డత్తు. . . ఉయ్యక్కొణ్డదే)** - బ్రహ్మాండములందున్న దేవాదివర్గములు, అండములు, ఆభరణములు, అండములలో పంచాశత్‌కోటి విస్తీర్ణమైన మహాపృథివిచే, కులపర్వతములచే ఉపలక్షితములైన కార్యములనన్నిటిని తన ఉదరములో పెట్టుకొని, రక్షించుటకై మింగిన స్వామి కంఠమే సుమా ! స్వరూపమును తెలిసిన నన్ను స్వానుభవముచే ఉజ్జీవింపచేసినది. అణ్డాదులకంటె చిన్నవగు

కులపర్వతములను కవి ప్రత్యేకముగా పల్కుటచే అన్నిటినిగ్రసించుట ఆశ్చర్యముకాదనుట ఇచట ధ్వనించుచున్నది.

7. **కైయినార్ శురిశఙ్గనలాళియర్ నీళ్వరైపోల్**
**మెయ్యనార్ తుళపవిరైయార్ కమళ్ నీళ్ముడి యెమ్**
**ఐయనార్అణియరఙ్గనా రరవిన్ణైమిశై మేయమాయనార్**
**శెయ్యవాయ్ ఐయో ! ఎన్నైచ్చిన్దై కవర్న్దదువే**

కైయిన్ = శ్రీహస్తములో, ఆర్ = అందము అతిశయించిన, శురి = దక్షిణావర్తములను కల, శఙ్గు = పాంచజన్యమను శంఖమును, కనల్ = శత్రువులపై అగ్నిని ఉమియు, ఆళియర్ = సుదర్శనమను చక్రమును కలవాడై, వరైపోల్ = పర్వతమువలె, నీళ్ = అందము అతిశయించియున్న, మెయ్యనార్ = గొప్పరూపమునుకలవాడై, కమళ్ విరైయార్ = సుగంధమునిండియున్న, తుళపమ్ = తులసీమాలచే అలంకృతమై, నీళ్ = ఉన్నతమైన, ముడి = కిరీటమును కల్గినవాడై, ఎమ్ ఐయనార్ = మాతండ్రి యైనవాడై, అణి = సంసారమునకు (ఈలోకమునకు) ఆభరణమైన, అరఙ్గనార్ = శ్రీరంగమునకు వచ్చి, అరవిన్ణై మిశై = శేషుడను పడుకలో, మేయ = పవళించునట్టి, మాయనార్ = ఆశ్చర్యకరములైన లీలలను కల శ్రీరంగనాథుని, శెయ్యవాయ్ = ఎఱ్ఱని అధరము, ఐయో = అయ్యో !, ఎన్నై = (స్త్రీల ఎఱ్ఱని అధరములలో ఆసక్తిని కల) నాయొక్క, శిన్దై = చిత్తమును, కవర్న్దదు = తనపట్ల ఆకర్షించినది, ఏ = ఆశ్చర్యము.

ఇందు స్వామి అధరముల అందమున తాము చిక్కుపడుటను కవి తెలుపుచున్నారు. ఏఱును దాటబోయి తెప్పను పోగొట్టుకొన్నట్లు, ముందు పాశురమున కవి **"మఱ్ఱొన్ఱినై కణ్డామ్ కణ్ణేర్ అడియేనై యుయ్యక్కొణ్డదే"** అనుచు స్వామికంఠము తన ఆపత్సఖత్వాదులను చూపి, తమను తన కధీనునిగా చేసికొనుటను తెలిపిరి. దీనికి మించి, పవళము వలె ఎఱ్ఱనిదగు స్వామి అధరము **"ఉలకముణ్డ పెరువాయన్"** (శఠ. సూ-6-10-1) అనునట్లు

స్వామి ఆపత్సఖత్వగుణమునందును ముందున్నదానను నేనేకదా ! స్వామితన ఆశ్రితరక్షణకు తగినట్లు **"సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ" (రా.యు. 18-33), "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన" (రా.యు. 18-3) , "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (గీతా. 18-66)** అని మొదలుగా పల్కునట్టి **"మెయ్మ్మైప్పెరువార్త్తై"** (సత్యమైన గొప్పవచనములు) (గోదా.సూ. 11-10) అన్నిటికిని ప్రధానకారణము నేనేకదా ! ఏదో ఒక ఆభరణమువలన ఏర్పడు అందమును మాత్రము కల్గియుండుట కాక, స్వాభావికమైన సౌందర్యమును కల్గినదానను నేనే కదా ! **"కరుప్పూరమ్ నాఱుమో ? కమలప్పూనాఱుమో ? తిరుప్పవళచ్చెవ్వాయ్ తాన్ తిత్తిత్తిరుక్కుమో"** (గోదా. సూ. -7-1) అని గోదాదేవి తన దేశికులను (ఆచార్యులను) అడుగునట్టి సౌగంధ్యము, సారస్యము మొదలగు భోగ్యతలను కల్గినదానను నేను కదా !.అనునట్లు తనవైలక్షణ్యమును చూపి, తన (కవియొక్క) మనస్సును స్వామికంఠసీమనుండి తనవైపు బలాత్కారముగ ఆకర్షింపగా, "ఎట్టిని అధరములతో నిట్లు చిరునవ్వుతో కూడ నామనస్సునందు వేంచేసియున్న ఆవిధముతప్ప నేను వేరొక విధముగా తెలియను" (శఠ.సూ.-8-7-7) అనునట్లు ఆ 'పవళసదృశమైన అధరమున" (గోదా. సూ. 7-1) తాను అపహృతహృదయులై చిక్కుపడిన రీతిని ఇందు కవి పల్కుచున్నారు. అయినచో, **"శెయ్యవాయ్యైయో వెన్నై చ్చిన్దైకవర్న్దదు"** అని పల్కినంతనే సరిపోవుచుండగా, ముందు ఇన్ని విశేషణములను ప్రయోగించుట ఏల ? - అనినచో, పూర్వము అయిదవ పాశురమున **"పారమాయ పఴవినై పఱ్ఱఱుత్తు ఎన్నై వారమాక్కి వైత్తాన్"** అనుచు అనేకజన్మములందు ఆర్జించిన పాపరాశినికల నాయందు రక్షణకు తగిన ఏ హేతువు లేకున్నను, నా నైచ్యమును చూడకనే, సవాసనగా ఆపాపరాశిని పోగొట్టెనని పల్కి, అది సంభవమా ? అనుప్రశ్నకు, ఈశ్వరాభిమానియై, దుర్మానియైన రుద్రుని పాపమును అతని తక్కువదనమును గమనింపక పోగొట్టినట్లు, నా నైచ్యమును గమనింపక పాపములను పోగొట్టెనని రుద్రుని ఉదాహరణముగా ఆఱవ పాశురమున పల్కిరి.

దీనిని వినినవారు - "ఇది విషమోదాహరణము సుమా ! ఆ రుద్రుడు - **"తదా దర్శితపంథానౌ సృష్టిసంహారకారకౌ"** (భార. శాంతి. 350-19) అనునట్లు సంహారమను అధికారమున పురుషోత్తమునిచే నియుక్తుడగుటచే అధికారపురుషుడై, అతనికి బ్రహ్మశిరస్సును ఖండించుటచే వచ్చిన ఆపద అనునది ప్రామాదికమై, ఏదో ఒక సందర్భమున కల్గినదనుటచే దానిని **"తన్నలఙ్గల్ మార్పిల్ వాశనీర్"** (తన, వకుళ మాలికను కల వక్షఃస్థలములోని స్వేదజలముచే) అనునట్లు స్వామి స్వేద జలముచే పోగొట్టనచ్చును కాని, మీరు **"శ్రుతిః స్మృతిః మమైవాజ్ఞా"** (విష్ణుధర్మే. 6-31) అనునట్లు భగవదాజ్ఞారూపమైన వేదవైదికమర్యాదను అతిక్రమించినవారై, అంతకుమించి అకృత్యకరణ-కృత్యాకరణ (చేయరానివి చేయుట, చేయవలసినవి చేయకుండుట) అనునట్టి పాపములను అనాదికాలముగా, పూర్ణముగా చేయుచున్నవారుకదా !, అందుచే మీ వద్ద ఎట్టి సాధనము లేకున్నను మీ పాపములను అట్లు సవాసనగా (సమూలముగా) పోగొట్టసాధ్యమా ? అది అట్లుండ నిండు, రుద్రుడు దేవతలలో ముఖ్యుడగుటచే, ఏనుగుపైనున్నవాడు ఏనుగుపైనున్న వానికి వేరొకడు సహాయపడురీతిలో గొప్పవాడగుస్వామి గొప్పవాడగు రుద్రునకు సహాయము చేయవచ్చునుగాక ! మనుష్యులలో అందఱిలో తక్కువవారైన మీ పాపములను భగవానుడు పోగొట్టునా ? అంతియేకాక, **"బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ"** (సామవేదే) అనునట్లు బ్రహ్మకు రుద్రుడు జ్యేష్ఠపుత్రుడగుటచే తనకు పౌత్రుడు అని స్వామి సహాయము చేయవచ్చును. అట్టి సంబంధ విశేష మేదియు మీకుస్వామితో లేదే !, మఱియు, ఆ రుద్రుడు "ముల్లోకములలో బిచ్చమెత్తి తిరుగువాడు" (కలివైరి.సూ. 6-9-1) అనునట్లు లోకమంతయు తిరిగి, క్షీరాబ్ధివద్దకు పోయినపిమ్మటకదా స్వామి అతని పాతకము తీర్చినది !, మీరును అట్లు క్షీరాబ్ధివద్దకు పోయితిరా ?" అని ప్రశ్నింపగా వీనికన్నిటికిని ప్రత్యుత్తరరూపముగా అవతరించినది ఈ పద్యము.

**కైయినార్ శురిశఙ్గనలాళియార్** - **"కరిమునిన్దకైత్తలమ్"** (కువలయాపీడము అను ఏనుగును కోపించి ప్రహరించిన కరతలము- తిరునెడు - 25) అనియు,

**"పరిఘోపమా:"** (రా.కి. 3-15) అనియు పల్కురీతిలో ఎట్టి ఆయుధములను దాల్చకున్నను స్వామిబాహువులు శత్రువులను నిరసింపగల్గునవియై యుండగా, అవి అచింత్యమైన శక్తినికల దివ్యాయుధములను దాల్చి, **"ఎప్పోదుమ్ కైకళ్లలానేమియాన్"** (భక్తిసార. సూ.) (ఎల్లప్పుడు వీడని చక్రాయుధమును శ్రీహస్తములో కలవాడై) యుండుట మనపాపములను తీర్చుట కొఱకే కదా ! అనుట ఇందలి సారాంశము.

శ్రీపాంచజన్యమునకు దక్షిణావర్తము స్వభావమైనట్లే, శ్రీసుదర్శనమునకు శత్రువులపై అగ్నిని వర్షించుట స్వభావముకదా ! ఊరకనే శత్రువులను నిర్జింపగల్గు స్వామి తన హస్తములలో అందమునిండిన, దక్షిణావర్తమును కల శ్రీపాంచజన్యము, ప్రతిపక్షముపై అగ్నిని వెదజల్లు సుదర్శనము అనువీనిని కల్గియుండుట మరింత శోభాధాయకము. **"స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్"** (గీతా. 1-19) అనియు, "క్రూరులైన అసురులు అదరునట్లు ఘోషించు" (గోదా.సూ. 7-2) అనియు పల్కురీతిలో విరోధివర్గమును తన ధ్వనితో నిరసింప గల్గు పాంచజన్యమును, **"కరుతుమిడమ్ పొరుతు"** (స్వామి తలచినచోటికి చేరి- శఠ.సూ.10-6-8)) అనునట్లు విరోధివర్గమును, **"కూఱాయ్ నీఱాయ్"** (ఖండములగునట్లు, బూడిదఅగునట్లు - శఠ.సూ. 6-10-2) అనురీతిలో నశింపచేయు సుదర్శనమును స్వామి ధరించియుండుట నశింపచేయ వీలుకాని నా పాపములను పోగొట్టుటకొఱకే కదా !

ఇచట వ్యాఖ్యాత ప్రాసంగికముగ రెండు ఐతిహ్యములను ఉదాహరించిరి. శ్రీపరాశరభట్టరు తిరుక్కోట్టియూర్ (గోష్ఠీపురము) అను ఊరిలో నివసించునపుడు ఒకానొక ఉత్సవ దినమున కోళరియాళ్వాన్ అను ఆచార్యులను చూచి తెఱ్కాళ్వాన్ అను ఆచార్యులు సుదర్శనస్పర్శవలననే తమ సర్వపాతకములును నశించునని పల్కిన వార్త ఇచట స్మరింపతగినది. గోష్ఠీపురములో భట్టర్ నివసించునపుడు అనంతార్యులు భట్టర్‌ను చూచి, పరమపదనాథుడు ద్విభుజుడా ? చతుర్భుజుడా ? అని ప్రశ్నింపగా, "రెండును

సంభావితములే'', అని సమాధాన మిచ్చిరి. అపుడు మరల అనంతార్యులు "వీనిలో అందమైనదేది?'' అని అడుగగా, "ద్విభుజుడైనచో శ్రీరంగనాథుని మూలమూర్తి వలెయుండును; చతుర్భుజుడైనచో ఉత్సవమూర్తివలె ఉండును. రెండును హృదయంగమములే'' అని భట్టరు బదులిచ్చిరట.

**కైయినార్ శురిశఙ్గనలాళియర్** - మనవలెకాక, పరమార్థ విదులైనవారు శ్రీరంగనాథుని చతుర్భుజునిగా కదా దర్శించిరి. వారిలో ఈ దివ్యసూరి ఒకరు. **(నీళ్వరైపోల్ మెయ్యనార్)** - దివ్యాయుధములు అనావశ్యకములన్నట్లు పర్వతముతో వేరొక పర్వతమును నశింపచేసినట్లు, మేరుమందర సదృశములైన నా పాపరాశులను, పోగొట్టగల్గిన పర్వతమువంటి దృఢమైన రూపమును కలవాడు. పర్వతమును, సముద్రమును స్వామికి ఉపమానముగా చెప్పుట ఏదో ఒక ఉదాహరణము పల్కుట కొఱకుమాత్రమే. నిజమునకు అవి ఏవియు స్వామికి చాలవు. కావుననే **"నీళ్"** అనువిశేషణముచే భోగ్యతా ప్రకర్షము తెలుపబడినది. ఇది పర్వతముకంటె స్వామి రూపమునకుకల వైలక్షణ్యమును సూచించుచున్నది. **"పచ్చైమామలైపోల్మేని"** (పచ్చని గొప్పపర్వతమువంటి మేని- శ్రీ. ప్ర. 1) అనబడు భగవానుని రూపమును దర్శించువారికి దివ్యాయుధములు ప్రకాశకమైయున్నవి. అంతకు మించిన శోభాతిశయమును కలిగినది శ్రీహస్తముల దివ్యాయుధముల కలయిక.

**తుళవవిరైయార్ కమళ్తణ్ముడి** - రుద్రునివంటి ఉన్నతుల కార్యమును చేసినవాడు తక్కువవారైన మీ కార్యమును చేయుబోవునా ? - అనినచో, బ్రహ్మరుద్రాదులకు మాత్రమే శేషి (స్వామి) అని కాదు కదా భగవానుడు కిరీటమును దాల్చియుండుట ! **"పిశునయన్ కిల మౌళిః"** (వరదరాజ. 25) అనియు, **"పతిం విశ్వస్య"** (తైత్తి. నా. 11) అనియు పల్కురీతిలో అతడు ఉభయవిభూతులకు (ఈలోక-పరలోకములకు) నాథుడు అని కదా !

**తుళవవిరైయార్ కమళ్** - తులసీమాల **"సర్వగంధః"** (ఛాందో) అని ప్రస్తుతింపబడిన భగవానుని సైతము తన సుగంధముతో పరిమళింపచేయ గల్గినదై, పరత్వసూచకమై యుండును.

**నీళ్‌ముడి** - దీర్ఘమైన కిరీటము. దాని దైర్ఘ్యము ఎంతటిది అనగా అట్ట అడుగుననున్న నా వరకు వచ్చి, అనుగ్రహించునంతటిది.

**ఎమ్మైయనార్** - రుద్రునకు భగవానునకుమధ్య ప్రౌతపితామహరూప సంబంధవిశేషము కలదు కదా ! మీకు అదిలేదు కదా ! అని ప్రశ్నింపగా, అందులకు సమాధానమును కవి పిమ్మట పల్కుచున్నారు. అతనికి (రుద్రునకు) పౌత్రత్వరూప బంధమొక్కటే కదా ఉన్నది ! స్వామితో **"మాతా పితా భ్రాతా"** (సుబాల. 16) ఇత్యాదిగా తెలుపబడిన సర్వవిధబంధుత్వమున్నది నాకే కదా ! (రుద్రునిచే పౌత్రత్వరూపమైన సంబంధవిశేషమొక్కటే అనుసంధింపబడగా, ప్రసన్నుడనగునాచే సర్వవిధబంధుత్వము అనుసంధింపబడుచున్నదని అర్థము)

**ఎమ్మైయనార్** - నన్ను కన్నతండ్రి. **"పితేవ పుత్రస్య"** (గీతా. 11-44) అనురీతిలో నా వద్దగల దోషములను క్షమింపవలసిన పితృత్వరూపబంధమును కలవాడుకదా !

**అణియరఙ్గనార్** - ఆ రుద్రుడు క్షీరాబ్ధివరకు వెడలికదా తన కార్యమును సఫలమొనర్చుకొనెను. మీరు అంతవరకు పోలేదు కదా ! అనగా, అందులకు ప్రత్యుత్తరముగా, అతడు (రుద్రుడు) "ముల్లోకములందు బిచ్చమెత్తి తిరుగువాడు" (కలివైరి. సూ. 6-9-1) అగుటచే అంతవరకు పోయి కార్యము సఫలమొనర్చుకొనగల్గెను. రోదించు బాలకునివలెనున్న నావంటివారిని రక్షించుటకొఱకు కదా, (సంతతి నూతిలోపడగా అతనిని కాపాడుటకై తానుకూడ ఆ నూతిలో దూకు తల్లివలె,) ఈ లీలావిభూతిలోని శ్రీరంగమునకు వచ్చి స్వామి పరుండియున్నాడు అనుచున్నారు.

**అణియరఙ్గనార్** - **"మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః"** (సుబాల. 16) అనునట్లు స్వామి పితృత్వము సర్వక్షేత్రములలోని మూర్తులకు సాధారణముకాదు. **"తిరవఙ్గత్తులోఙ్గుమ్"** (శ్రీరంగమున అతిశయించియున్న- శ్రీ.ప్ర- 37) అనునట్లు కేవలము శ్రీరంగనాథుడే నాతండ్రి అని తాత్పర్యము. (ఈ భావము **"ఎమ్మైయనార్ అణియరఙ్గనార్"** అనుటచే స్ఫురించును.)

**అణి యరఙ్గవార్** - భూమికి అలంకారమైన శ్రీరంగమునకు వచ్చి పరుండినవాడు. (అణిశబ్దస్వారస్యము ఇది) ఆభరణము ధరించినవానికి శోభను కల్గించును. అట్లే, శ్రీరంగము రక్షకుడగు శ్రీరంగనాథునకు శోభాధాయకమగును. కావున అది ఆభరణముగా తెలుపబడుట సార్థకము. స్వామిచేతనులతో సంబంధమునుకలవాడైయుండగా దూరముగానుండక, సంసారమునకు ఆభరణమువంటి శ్రీరంగమునకు వచ్చి, సన్నిహితుడై యుండుటను ఈ పదము తెల్పుచున్నది.

**అరవిన్దైమిశై మేయ మాయనార్** - ఇంతమాత్రమేనా ! **"యత్ర రామ స్సలక్ష్మణః"** (రా.యు. 17-1) అనియు, **"వాకణైమిశైనమ్బిరాన్ శరణే శరణ్ నమక్కు"** (శేషశయ్యపై పవళించియున్న మన స్వామిపాదములే మనకు శరణము - శఠ.సూ. 5-10-11) అనియును పల్కురీతిలో (ఆదిశేషుని) పురుషకార బలమును కలదనుట ఇచటి భావము.

**అరవివణైమిశై మేయ** - రత్నముల నన్నింటిని వస్త్రమును పఱచి. విశదముగా చూపునట్లు, తన అందమును తెలియనివారికి ఆదిశేషుడను పడుకపై పరుండి స్వామి దర్శింపచేసెను. దీనిచే దివ్యాంగములకు రత్నసామ్యము, ఆదిశేషునకు వస్త్రసామ్యము స్ఫురించుచున్నది. ఈ భావము **'మేయ'** అను శబ్దమువలన ఏర్పడినది.

**అరవినణైమిశై మేయ** - ఆదిశేషుడు తాను పురుషకారమును చేసి, కొందఱిని భగవానునకు రక్షింపతగినవారిగా చూపినపుడు, స్వామి వారిని రక్షింపకున్నచో తాను ఊరుకొనక భగవానుని రక్షణోన్ముఖునిగా చేయును.

**అరవివణైమిశైమేయ మాయనార్** - **"స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః"** (రా.యు. 38-25) (నిద్రించునపుడును శ్రీరాముడు శత్రువులను తపింపచేయువాడు) అనునట్లు శత్రునిరసనమునకై తాను లేచియుండి, ఏదైన ప్రయత్నింపవలెనా ? 'పులి నివసించుపొద' అన్నచో మృగము లన్నియు అరణ్యమున దూరముగాపోవునట్లే, ఆశ్రితుల విరోధులనందఱను తానున్న

సన్నివేశమును చూపుటతోనే పూర్తిగా నశింపచేసిన ఆశ్చర్యచేష్టితులు. "మా పాపములు అన్నియు అడవియందు చేరినవా ఏమి ? చూడలేకుంటిమి అహా!" (శఠ.సూ. 54) అని శఠకోపసూరి కీర్తించిన రీతిలో ఆశ్చర్యభూతుడు.

**మాయనార్** - పరుండియున్న స్వామి శోభ అంతట వ్యాపించినది. అందఱికిని నిద్రించునపుడు అన్ని విధములైన వికారములు కల్గును, కాని, **"న మయా బోధిత: శ్రీమాన్"** (రా.యు. 38-25) అనునట్లు, స్వామి నిద్రించునపుడు తోచు శోభ మేల్కొని యున్నప్పటి శోభకే అలంకారమగును అనియు భావము.

**మాయనార్** - "కిడన్దదు ఓర్ కిడక్కైక్కణ్డవ్" (పరుండిన అద్వితీయమైన సన్నివేశమును దర్శించి- శ్రీ.ప్ర. -23) అనునట్లు ఇపుడు మనమును చేరి, సేవింప చూచినను, శయనసౌందర్యమును తదేకముగ సేవింపనీయక, చాలును అననీయకయున్నట్టి స్వామియొక్క ఆశ్చర్యకరమైన శయన సన్నివేశప్రకారము ఈపదము తెల్పుచున్నదనియు చెప్పవచ్చును.

**మాయనార్ శెయ్యవాయైయో వెన్నై చ్చిన్దై కవర్న్దదువే** - నా నైచ్యమును అనుసంధించి, వెనుకంజనేయుచున్న నన్ను, స్వాభావికసౌందర్యమును, భోగ్యతను కల స్వామి అధరము తన స్మితమును చూపి, దగ్గరకు చేర్చుకొని, నా మనస్సును అపహరించినది. (**'శెయ్య'** అనుటకు అందము అని అర్థము.) అధరమునకు శోభ స్మితమువలన వచ్చును; కావున స్మితముతో కూడిన అధరమను అర్థ మిచట **"శెయ్యవాయ్"** శబ్దమునకు వివక్షితము

**ఎన్నై చ్చిన్దై కవర్న్దదు** - **"తువర్త్తశెవ్వాయనార్కే తువక్కుఅత్తురిశనన్"** (పగడమువంటి ఎఱ్ఱనిపెదవినికలవానికే లోబడిఉన్న) అనునట్లు నన్ను కదా ఇట్లు లోబరచుకొన్నది (ఇది ఎన్నైశబ్దార్థము)

**శెయ్యవాయ్** - స్త్రీల అసత్యమైన స్మితమునకు పరవశులైనవారికి ఈ స్మితమును దర్శించినచో నిలువసాధ్యమా ! **ఐయో**- అధరమును, స్మితమును అనుభవింప శక్తిచాలకుండుటచే కవి "ఐయో" అనుచున్నారు.

**ఐయో** - తనను నేను పూర్తిగా దర్శింపవలెనని శ్రీరంగనాథుడును ఆశపడెను. నేను కూడ సంపూర్ణముగా ఆ స్వామిని అనుభవింపవలెనని తలచితిని. ఆ ప్రయత్నమును సాగనీయక మధ్యలో ఎఱ్ఱని స్వామి అధరము నన్ను అపహరించుచున్నదే ! అయ్యో ! అనియు భావము. **ఎన్నై** - శిలవంటి నామనస్సును స్వామి అధరము ద్రవింపచేసి, ఆ నీటిని కూడ తానే గ్రసించినది. నాచిత్తమును అపహరించి, నా ఆత్మాపహారదోషమును నివారించినది. చిత్తమున్నకదా నా ఆత్మ నాదని తలచునట్టి ఆత్మాపహారమునకు అవకాశముండును. అదిలేకుండ చేసినది. ప్రధానశేషిని దర్శించిన పిమ్మట ద్వారశేషి (ద్వారపాలకులు. పురుషకారభూతులు) మాత్రమున నిలువదు కదా (ద్వారశేషి మనస్సు, ప్రధానశేషి భగవానుడు - భగవానుని దర్శింపగానే చిత్తము రూపుమాసి భగవానుని చేరినది) ఈ పాశురములో దివ్యనారి శ్రీరంగనాథునియందు పరమపదనాథుని రూపమును దర్శింపవచ్చుననిరి.

**మునివాహనభోగము :**

ఇకపై నాల్గు గాథలలో అష్టాక్షరిలోని **"నారాయణాయ"** అను పదములోగల చతుర్థీవిభక్తియొక్క అర్థమగు, ప్రపన్నునకు ప్రార్థనీయ కైంకర్యమునకు ప్రస్తావకమగు అనుభవము తమను ఇపుడు పరవశులుగా చేసిన రీతిని కవి పల్కుచున్నారు. అందు **"కైయినార్"** అనుప్రస్తుతపాశురములో దివ్యాయుధములతో కూడిన స్వామిహస్తమును అవలంబనముగా గొని శిరస్సువరకు పోయి తమ మనస్సును "స్వచ్ఛమైన మందహాసమును కల దొండపండువంటి పెదవిని కల స్వామిని" అని (శఠ.సూ.5-3-8) "అందము ఘనీభవించిన పగడపు తీగతునకయా ?" (శఠ,సూ. 7-7-3) అనదగిన శ్రీరంగనాథుని అధరములోని అందము తనను వశీకరించుకొనుచున్నది అనుచున్నారు.

**కైయినార్. . .ఆళియర్** - పాంచజన్యము స్వామి శ్రీహస్తమునకు ఆయుధమగుటకు, ఆభరణమగుటకును పర్యాప్తము అగునట్టి విశిష్ట

సన్నివేశమును కల్గినది. దక్షిణావర్తరూపమగుటచే ప్రణవాకారమ్మై, శబ్దబ్రహ్మమయమ్మై, నిరతిశయానందహేతువైన శ్రీ పాంచజన్యమును, దానవులనబడు వనమునకు దవాగ్నియై, మనన్త్రత్యాభిమానియైన శ్రీసుదర్శనమును చేతిలో కలవాడై అని అర్థము. దీనిచే మంత్రమును (పాంచజన్యమును), మనస్సును అనుకూలచింతకు అనుగుణముగా చేయదగిన ఉపకరణమును (సుదర్శనమును) శ్రీరంగనాథుడు కలవాడని తెలుపబడినట్లయినది. దివ్యాయుధములు శ్రీరంగనాథుని మూలమూర్తి హస్తములలోని రేఖలలో రహస్యముగా ఒదిగియుండి, ఉత్సవమూర్తి రూపములో స్ఫుటముగా ప్రకాశించును.

**నీళ్వరైపోల్ నెయ్యనార్** :- స్వరూపమువలె కేవలము సూక్ష్మదృష్టిని కలవారిచే (యోగులచే) మాత్రమే దర్శింపబడుటయే గాక, మాంసచక్షువులతో సామాన్యులు కూడ దర్శింప తగినట్లు పర్వతమువంటి ఉన్నతమ్మైన దివ్యరూపమును కలవాడు. **(తుళపవిరైయార్ కమళ్ నీళ్ముడి ఎమ్మైయనార్)** - సర్వాధికారత్వ సూచకమైన తులసియొక్క పరిమళమును కూడ పరిపూర్ణము చేయునట్లు పరిమళితమ్మై, విభూతిద్వయసామ్రాజ్యమును సూచించు దివ్యకిరీటమునుకల సర్వలోకపిత అని భావము. **(అణిరఙ్గనార్)**- పరమపద - క్షీరార్ణవముల కంటె గుణాతిశయములచే భక్తులకు హృద్యతమమైనది అగుటచే ఉభయవిభూతలలో సాటిలేని ఆభరణమనదగినదై (అణిశబ్దార్థము), సౌలభ్యాతిశయముకలిగినదగు శ్రీరంగవిమానమును శయనస్థానముగా కలవాడు (అరఙ్గనార్శబ్దార్థము), అందటికి సమీపమున నున్నవాడగుటచే **"అణియరఙ్గనార్"** అని ప్రయోగింపబడినదనియు చెప్పవచ్చును. ఛందస్సుకొఱకు **"అణ్ణి"** అనుశబ్దము **"అణి"**గా మారినది. **"అణ్ణి"** అనగా సమీపము.

**అరవినణైమిశైమేయ మాయనార్**- తమ జ్ఞానబలములు రూపునొందినట్లున్న అనంతుడను అనుకూల దివ్యపర్యంకములో (అరవినణై మిశై శబ్దార్థము) అంతులేని, తేటపడిన అమృతతటాకమువలె ఆశ్రితులకు

అనుభవింపతగినవాడై (మేయశబ్దార్థము). **"చింతామణి మివోద్వాంత ముత్సంగేఽ నంతభోగినః"** (శ్రీరంగరాజస్తవే పూర్వ-8) అనునట్టి అత్యాశ్చర్యభూతుడైనవానియొక్క అనిఅర్థము.

**శెయ్యవాయైయో ఎన్నై చిన్దైక్కవర్న్దదువే**- "విలక్షణమైన, అద్వితీయమైన ఫలమా ? ఏమి ?" (శఠ.నూ. 7-3-3) అనదగినట్లున్న వర్ణమును, మాధుర్యమును కల్గినదై ఏడులోకములను లోపల దర్శింపతగినట్లున్న ఎఱ్ఱనిఅధరము నా మనస్సును దోచినది. **"ఐయో"** అనునది ఆశ్చర్యమునుకాని, పూర్ణముగాఅనుభవించుటకు వీలుపడుటలేదనుటను కాని, అనుభవ రసాతిరేకమునుకాని సూచించును.

8. **పరియనాకి వన్ద వవుణుడల్ కీణ్డ అమరర్ -**
**క్కరియ వాదిప్పిరా నరఙ్గత్తమలన్ ముకత్తు**
**కరియవాకి ప్పుడైపరన్దు మిళిర్న్దు శెవ్వరియోడునీణ్డ వ-**
**ప్పెరియవాయకణ్గళెన్నై ప్పేదమై శెయ్దనవే**

పరియనాకి = (బ్రహ్మఇచ్చిన) వరబలముచే వృద్ధిచెందిన శరీరమును కలవాడై, వన్ద = "వేరు పరతత్త్వమున్నది" అనిన ప్రహ్లాదుని బాధించుటకై వచ్చిన, అవుణన్ = అసురుడైన హిరణ్యాకశిపుని, ఉడల్ = శరీరమును, కీణ్డ = గుచ్చి వధించినవాడై, అమరర్క్కు = బ్రహ్మాదిదేవతలకు, అరియ = దటిచేరవీలులేనివాడై, ఆతి = కారణభూతుడై, పిరాన్ = తాను ముందుగా తలచివచ్చి ఉపకారముచేయువాడై, అరఙ్గత్తమలన్ = (అందఱికిని సహాయపడుటకై) శ్రీరంగమునకు వచ్చి శయనించియుండుటచే కల్గిన శుద్ధినికల శ్రీరంగనాథుని, ముకత్తు = ముఖమండలములో, కరియ ఆకి = నల్లనివై, పుడై పరన్దు = విశాలములై, మిళిర్న్దు = మెఱయునట్టివై, శెవ్వరియోడు = (చివరలో) ఎఱ్ఱని జీరలనుకల్గి, నీణ్డ = ఆకర్ణాంతము విస్తరించిన, అప్పెరియవాయ = అట్టి పెద్దవైన, కణ్గళ్ = నేత్రములు, ఎన్నై = (ఱాయివంటి కఠినమైన మనస్సునుకల) నన్ను, పేతైమై శెయ్దన = తనపట్ల పక్షపాతమును కలవానినిగా చేసినది.

ఇందు కవి శ్రీరంగనాథుని అందమైన నేత్రములు నా జ్ఞానమును అపహరించినవి అనుచున్నారు. ముందు పద్యమున **"శెయ్య వాయ్యైయా వెన్నె చ్చిన్దైకవర్న్దదు"** అనుచు అధరములో దివ్యసూరి అపహృతచిత్తులగుటను క్రీగంట చూచిన స్వామి నేత్రములు - **"శెయ్యవాయ్ ఐయో"** అనుచు అధరమును వీరు స్తుతించిరి. రక్తిమను కల్గిన అందము ఒక్కటియే కదా ఆ అధరమునకు కలదు. ఎఱుపు, నలుపు, తెలుపు అను వర్ణముల కలయికవలన కల్గు పరభాగశోభచే ఏర్పడు అందమును కల్గినవారము మేమే కదా ! **"జాయమానం హి పురుషం యం పశ్యేత్"** (భార. శాంతి. 358-73) అనునట్లు జాయమానదశలో మేము కటాక్షించిన పిమ్మటనే జీవుడు సాత్త్వికుడై, ముముక్షువు అగును. అపుడు కదా ! స్వామి **"మిత్రభావేన సంప్రాప్తమ్ న త్యజేయమ్"** (రా.యు. 18-3) అనుమొదలుగాపల్కు వచనములు అన్నియు జీవించుట ! (సార్థకము లగుట) అంతియే కాక, కృష్ణావతారములో మహాభారత యుద్ధమున "ఆయుధములు ధరింపను'' అనినను, పిమ్మట స్వామి ఆయుధమెత్తుటచే అసత్యము అయినట్లుకాక, **"మెయ్మ్మైమ్మ్పెరువార్త్తై"** (సత్యమైన గొప్పసూక్తిని- గోదా.సూ. 11-10) అని అందఱు విశ్వసించునట్లు, వాత్సల్యమూలముగా పల్కినవార్త అని తెలియునట్లు స్వామి మనస్సులోని వాత్సల్యమునకు ప్రకాశకములైయున్నవి మేమే కదా ! అది అట్లుండనిండు, **"యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** (ఛాందో. 1-6-7) అనియు, **"అనైత్తులకుముడైయ వరవిన్దలోశనన్"** (లోకమునంతటిని కలిగియున్న అరవిందలోచనుడు శఠ.సూ. 6-7-10) అనియు పల్కునట్లు భగవానుని పరత్వమునకు ప్రకాశమైనవియు మేమే కదా ! మఱియు, **"పుండరీకాక్ష రక్ష మామ్"** (భార.సభా. 66) అనియు, **"పుండరీకాక్ష న జానే శరణం పరమ్"** (జితంతే 1-8) అనియు పల్కురీతిలో భక్తులు తమ ఆపద నివారింపబడుటకు ఉపాయముగా ఆశ్రయించునదియును మమ్ములను పురస్కరించుకొనియే అగుటచే స్వామి ఉపాయభావమును పూర్ణము కావించువారము మేమే కదా ! "తామరసనేత్రుని, నిత్యసూరులును

పలవరించుస్వామిని" (శఠ.సూ. 2-6-3) అనునట్లు భగవానునకు భోగ్యతా ప్రకర్షకల్గుట మా సంబంధమువలన కదా !"- అనునట్లు తమ అతిశయమును చూపి **"అవ్వాయన్ఱి యానఱియేన్"** (ఆపెదవితప్ప దేనిని నేనెరుగను) అనియున్న తమను **"తామరైక్కణ్ణనై అఱ్ఱుత్తీర్న్దు"** అనునట్లు (తామర నేత్రునకు అత్యంత పరతంత్రుడనై) (శఠ.సూ. 7-3-3) చేసిన రీతిని ఇందు దివ్యసూరి పల్కుచున్నారు. శఠకోపసూరి ప్రబంధమైన తిరువాయ్‌మొழ்రిలో ప్రస్తుతమైన "నామనస్సు పండినపండువలె భోగ్యమగు స్వామిఅధరమునందు వశమగుటయు, ఎఱ్ఱని తేజస్సునుకల కిరీటమునకులోబడుటయు శంఖ, చక్రములను సేవించి సంతోషించుటయు" (7-3-3) అనునంతవరకు గల అర్థమును పూర్వమును పల్కిరి. ఇపుడు **"తామరైక్కణ్‌గళుక్కు అఱ్ఱుత్తీర్న్దు"** (స్వామి తామరసనేత్రములందు వేరు విషయమునుస్మరింపనట్లు-ప్రవణమై- 7-3-3) అను ప్రయోగముయొక్క భావమును కవి అనుసంధించుచున్నారు.

**"పారమాయ పழவినై పఱ్ఱఱుత్తు"** అని శ్రీరంగనాథుడు తమయొక్క అజ్ఞానమును, అసత్కర్మలను గమనింపక, లక్ష్మీదేవి పురుషకారము కాగా, తాము అనాదిగా ఆర్జించిన పాపములను పోగొట్టిన రీతిని కవి పల్కినవారై, అది సంభవింపసాధ్యమా ? అను జిజ్ఞాసు ప్రశ్నకు అది వీలగుననుటను రుద్రుని దృష్టాంతముగా గొని చెప్పిరి. పిమ్మట ఆ దృష్టాంతము విషమదృష్టాంత మనుచు కొన్ని పూర్వపక్షములను కొందఱు పలుకగా, వానికి క్రమముగా సమాధానమును కూడ పల్కిరి. ఇక **"పారమాయ"** అను పద్యములో ఏర్పడిన శంకకు సమాధానముగా ప్రకృత గాథ అమరియున్నది. అది ఎట్లనగా "అనాదిగా ఆర్జించిన మీరు మీ పాపములను పూర్తిగా స్వామి పోగొట్టెను అంటిరి. మరల కలుగకుండునట్లు పాపములు నశించుట (అవిద్యాసంచితకర్మ అనియు, అనాది-అవిద్యాసంచిత పుణ్యాపాపకర్మప్రవాహప్రవృద్ధమనియు చెప్పునట్లు) ఆ కర్మలకు హేతువైన అవిద్య నశించినపుడు కదా సాధ్యపడును. ఆ అవిద్య నశించినదా ?" అను అశంకకు, "ఆ అవిద్య అనునది తనతో సంబంధమును

కలవారిని భగవంతునియందు ప్రావణ్యమును కలవారినిగా చేయనీయక, వారిచే విపరీతకార్యములను చేయించునది కదా ! అట్లే, తనతో సంబంధమును కల ప్రహ్లాదుని భగవత్ప్రవణుని కానివ్వక, అతనిచే విపరీతములను అనుష్ఠింప చేయబోయిన హిరణ్యకశిపుడు **"తమో హిరణ్యరూపేణ పరిణామ ముపాగతమ్"** అనునట్లు తమోగుణము మూర్తీభవించినట్లుగా కదా యుండెను. అట్టి హిరణ్యుని "అచట అపుడే ఆ హిరణ్యకశిపుడు నశించునట్లు ప్రత్యక్షమైన" (శఠ.సూ. 2-8-9) అనురీతిలో నృసింహరూపుడై వచ్చి, తన కరనఖములతో గిల్లి, వధించినట్లు జ్ఞానహస్తముతో నా అవిద్యను శ్రీరంగనాథుడు పోగొట్టెను అనుచున్నారు.

**పరియనాకి** - భగవద్గుణములను అనుసంధించి క్లేశపడకుండ, శేషత్వమును తెలిసి కృశింపకుండ, సర్వేశ్వరుని ఆశపడి, దానివలన కల్గిన ఆర్తిచే శరీరము వాడిపోకుండ, నరసింహునకు సైతము వెనుకంజవేయ వలసివచ్చునట్లు బలిసియున్నవాడై అని అర్థము. ఆత్మవస్తువు అనునది ఒకటి కలదు, దానికి భగవానుడే శేషియై యుండుటచే అట్టి శేషియైనవానిని నేను నాశేషత్వమను స్వరూపముయొక్క సిద్ధికొఱకు పొందవలెనని, "తలచి, బాధపడి, మనస్సులో ఆర్తిని పొంది, కరగి'' (శఠ.సూ.1-5-2) అనునట్లు శరీరమును కృశింపచేసికొనువాడు కాడు కదా హిరణ్యకశిపుడు ! (లేక) పరమాత్మను ఆశపడి, పొందలేక పోవుటచే భక్తి ఉత్కటమై "దాసుడనైన నా శరీరము నీయందు ప్రీతిరూపమై, నీరై అలమటించి శిథిలమగునట్లు నన్ను కరగించు సర్వేశ్వరా !" (శఠ.సూ.5-8-1) అనునట్లు శరీరమును క్లేశపఱచి, కృశించిన వాడు కాదు కదా ! అనిఅర్థము. **"పరమేశ్వరసంజ్ఞోఽజ్ఞ ! కి మన్యో మయ్యవస్థితే"** (వి.పు. 17-23) అనునట్లు తనయొక్క అహంకార మమకారములతో పెంచి వృద్ధిచేసి, **"బలవాన్ బ్రహ్మరాక్షసః"** (కైశిక పురాణమ్ -16)అనువిధమున బలియునట్లు చేసిన శరీరముకదా హిరణ్యకశిపుని దేహము. రాజుల ఆహారము కొఱకు కొందఱు మేతపెట్టి, కొన్ని పెంపుడు పందులను పెంచుదురు. అట్లే,

నరసింహమూర్తి నఖములకు ఎఱ చాలునట్లు దేవతలు తమ వరములతో అతని దేహమును పెంచి వృద్ధిచేసిరి, అనంతరము దీనివలన కలుగబోవు అనర్థమును వారు తెలియకుండుటచే అతనికి వరముల నిచ్చి అట్లు బలియునట్లు పెంచిరి. అదియే పిమ్మట వారు బాధపడుటకు, కృశించుటకును హేతువైనది.

**వన్ద** - పూర్వము హిరణ్యకశిపుడు నరసింహునిపైకి వచ్చిన సన్నివేశమును దివ్యసూరి ఇపుడు తలచి ఆస్థానే భయశంకను పొందుచున్నారు. ఇపుడును హిరణ్యకశిపుడు స్వామి మీదకువచ్చునట్లు వీరికి తోచుచున్నది కాబోలు ! అనుకూలుడై వచ్చినవాడు కాడు అతడు, భగవానుడనువాడు లేడను జ్ఞానహీనుడు కదా ! 'భగవానుడు ఉన్నాడు' అనెడి వానిని బాధించుటకును వచ్చిన అతని క్రూరతను తలచి కవి భీతిల్లుచున్నారు.

**అవుణవ్** - ఇట్లు భగవద్భాగవతులపట్ల అతడు కోపించుటకు ఏమి కారణము ? - అనినచో, **"ఆసురీం యోని మాపన్నాః"** (గీతా. 16-20) అనునట్లు అసురుడై, మూఢుడగుటచే.

**ఉడల్ కీణ్డు** - చక్రాయుధమునకును వెనుకంజ వేయవలసి వచ్చునట్లు కదా హిరణ్యకశిపుని దేహము రక్తమాంసాదులతో నిండి బలసియున్నది. అట్లున్న హిరణ్యకశిపుని శరీరము నరసింహమూర్తియొక్క విశాలమైన ముఖమును, నాలుక మడచిన దవుడలను, తీక్ష్ణముగా చూచిన చూపులును, గిల్లుట(చీల్చుట) కొఱకు వంచిన చేతులను చూడగనే భయముతో నిప్పులో కాలిన పందివలె మెత్తగా అయ్యెను. అపుడు ఎండిన తాటినారను చీల్చినట్లు అనాయాసముగ వాని దేహమును స్వామి చీల్చెను.

**ఉడల్కీణ్డు** - శరీరమును చీల్చెననుటచే తన సొత్తు అగు ఆత్మవస్తువునకు హానికలుగకుండ **"కిళ్లిక్కళైన్దాన్"** (గిల్లి తీసివైచెను - తిరుప్పావై -13) అనునట్లు అహంకారహేతువైన దేహమును చీల్చి వైచెనని స్ఫురించుచున్నది.

**అమరర్క్కరియ** - ఇట్లు ప్రహ్లాదునకు సులభుడైయున్న స్థితిలోకూడ బ్రహ్మరుద్రాదులకును దఱిచేర వీలుకానివాడై యుండును. **"క్వాహం రజః ప్రకృతి రీశ ! తమోధికేఽ స్మిన్ జాత స్సురేతరకులే క్వ తవానుకంపా, న బ్రహ్మణో న చ భవస్య న వై రమాయా యో మేఽ ర్పిత శ్శిరసి పద్మకరప్రసాదః"** (భాగ. 7-9-26) అనునట్లు స్వశక్తితో దఱిచేర ప్రయత్నించువారికి తాను దయచూపు సమయమునను అన్యులకు దఱిచేరవీలు కానివాడైయుండును, అనన్య ప్రయోజనముగా సేవించు భక్తులకు తన కోపదశలోకూడ సమీపింప వీలగువాడైయుండును. (లేక) దేవతలకును దఱిచేరరానివాడై యున్న భగవానుడు తనకు సులభుడగుటను కవి తెలుపుచున్నారనియు చెప్పనగును. అనగా, తమ నైచ్యమును చూడక, తమను అనుగ్రహించి, తమ దుష్కర్మలను సమూలముగా పోగొట్టి, తమను పూర్తిగా వశీకరించుకొని అనుభవించిన తీరును కవి తెలుపుచున్నారు అని భావము. ఇట్లు దేవతలకు అరుదైయున్నవాడును మీకు సులభుడై యుండుటకేమి హేతువు ? అనినచో;

**ఆతి** - జగత్కారణభూతుడు, పెక్కుమంది పుత్రులను కలవాడు వికలాంగుడైన ఒకపుత్రుని పట్ల అధికమైన ప్రీతిని కల్గియుండునట్లు, స్వామి జగత్కారణభూతుడైయున్నను, నా అజ్ఞానఅశక్తులను గమనించి నా పట్ల మిక్కిలి వత్సలుడైయున్నాడని భావము. కావున ఇచటి ఆదిశబ్దము కారణత్వబోధకము.

**ఆతి** - తానే నాకొఱకు నాకంటె ముందుగా ప్రయత్నించి, ఉపకార మొనర్చువాడనియు అర్థము. (ఈరెండు అర్థములలో **'ఆతి'** అను పదమును సంస్కృత **ఆది** శబ్దభావముగా గ్రహింపనగును)

**అమరర్క్కరియ ఆతిప్పిరాన్** - కవి తమకు ఉపకారము చేసినకారణముచే **'పిరాన్'** అనుటలేదు. దేవతలకు దఱిచేరవీలులేనట్టి పరత్వమును కలవాడైనను, భక్తుడైన ప్రహ్లాదుని విరోధిని తానే ముందుగా వెడలి బోధించిన ఉపకారమును తలచి **'పిరాన్'** అనుచున్నారు. పరార్థైక పరాయణులు కదా ఈ దివ్యసూరి.

**ఆది ప్పిరాన్** - ప్రహ్లాదుడు శ్రియఃపతియే "సర్వకారణము" అనగా, హిరణ్యకశిపుడు దానిని విని సహింపక, "ఈ స్తంభములో ఆ కారణభూతుడున్నాడా?" అని ఒక స్తంభమున తట్టి అడిగెను. ప్రహ్లాదుడు - "అతడు సర్వాంతర్యామి సుమా ! అందుచే దీనిలోకూడ తప్పకఉండును" అనగా, భగవానుడు **"అజ్ఞుఅప్పొఱ్ఱుతే"** (అచట అప్పుడే-శఠ.సూ. 2-8-9) అనునట్లు అతడు తట్టిన స్తంభములో నరసింహరూపియై అవతరించి, అతడు తట్టిన చేతిని గొని "హిరణ్యకశిపుని నోటిని చీల్చి, వక్షస్సును బ్రద్దలు చేసెను" (శఠ.సూ. 35) అని శఠకోపసూరి పల్కిన రీతిలో అతనిని దవుడపై కొట్టి, అతని వక్షఃస్థలమును చీల్చి, భక్తుడగు ప్రహ్లాదుని ప్రతిజ్ఞావాక్యమును విలువ కల్గినదానినిగా చేసి, తన కారణత్వమును, ఈశ్వరత్వమును స్థాపించిన ఉపకారమును తలచి కవి **'పిరాన్'** అనుచున్నారనియు చెప్పవచ్చును.

**అరజ్ఞత్తమలన్** - ఈ ప్రయోగము నరసింహరూపికంటె శ్రీరంగనాథునకుకల వైలక్షణ్యమును తెలుపుచున్నది. అనగా, ఒక కాలవిశేషమున ఒక స్తంభము మధ్యలో అవతరించి, ప్రహ్లాదునకు ఒక్కనికే వచ్చిన విరోధిని పోగొట్టిన అవధికదా నరసింహమూర్తియందున్నది ! శ్రీరంగనాథుని యందలి వైలక్షణ్యమేమనగా- అతడు శయనించియున్న సన్నివేశమే అది. అన్ని సమయములలో అందఱి విరోధులను పోగొట్టుటకై అందరికి సమీపముగా వచ్చి, రెండు స్తంభముల మధ్య (శ్రీరంగములో ఆ గర్భాలయమునందు ఆమోదస్తంభములను పేరుగల రెండు స్తంభాలమధ్యభాగమున) ఉన్నది అగుటచే అది విలక్షణమై యుండునుకదా !

**అరజ్ఞత్తమలన్** - భగవానుడు ప్రత్యక్షముకాగానే ప్రహ్లాదుడు **"యా ప్రీతి రవివేకానామ్"** (వి.పు. 1-20-19) ఇత్యాదిగా భగవద్విషయములో ప్రేమ కలుగవలెనని అపేక్షించుటచే, పర్వతములపై నుండి సముద్రమునందు తనను ముంచినపుడు స్తోత్రముచేయుటచే, **"మయి భక్తి స్తవాస్త్యేవ"** (వి.పు.1-20-20) అనిన పిమ్మటనే జ్ఞానభక్తులను కలవాడగుచే - అతని పట్ల చేసిన ఉపకారము తావన్మాత్రమను దోషము ఒకటి నృసింహమూర్తియందు కలదు.

"గుహుడు జ్ఞానహీనుడు, హీనకులమునకు చెందినవాడు అని తలపక అనుగ్రహించి" (కలివైరి. సూ. 5-8-1) అనురీతిలో తమ నైచ్యమును స్మరించి, భగవానుని చేరుటకు వెనుకంజ వేయువారియందును వారి తక్కువదనమును గమనింపక, వారిపట్ల ప్రీతిని చూపి, అనుగ్రహించి, వారి విరోధులను నశింపచేసి, పరపురుషార్థమైన మోక్షమును అనుగ్రహించుటచే పూర్వము నృసింహ రూపియందు ఉన్నట్లు పల్కిన దోషము శ్రీరంగనాథునియందు లేదని తలచి **"అరఙ్గత్తమలన్"** అనిరి. (అమల పద ప్రయోగస్వారస్యము) ఇది అంతయు తనవంటివారును ముఖమును దర్శించి, అవద్య- అశౌచములను పోగొట్టుకొని, శుద్ధులగునట్టి, తననుకూడ ఒకవ్యక్తిగా చేసి, లోకసారంగ మహామునులతో కలిపిన శ్రీరంగనాథుని అమలత్వమును కవి ఇచట ప్రస్తుతించిరన వచ్చును. అందరికిని ఉపకరించునట్లు శ్రీరంగమున నిద్రించుటచే కల్గిన శుద్ధిని కలవాడనియు భావము. "శుద్ధినికలవాడా ! సమృద్ధియైన నీటినికల శ్రీరంగము నున్నవాడా !" (శఠ.సూ. 7-2-4) అని శ్రీరంగనాథుడు కీర్తింపబడుచున్నాడు కదా ! ఒకసారి మాత్రమే ప్రత్యక్షమై అదృశ్యమగుట, అవతారములవలె కొంతకాలముండి, అవతార సమాప్తి చేయుట- మొదలగు లోపములు లేకపోవుట వలన కల్గిన శుద్ధి అనియు చెప్పవచ్చును. ఇట్లు విరోధియగు అంశము తొలగి, శుద్ధులైనపిమ్మట అనుభవించు విషయమును గూర్చి అనంతరము తెలుపబడుచున్నది.

**అరఙ్గత్తమలన్** - పూర్వోక్తవిషయములలో ఏ ఒక్కటియైనను నన్ను ఉన్మత్తునిచేయుటకు చాలును. అవి ఏవనగా - **"వణ్డిన మురలుమ్"** (తుమ్మెదలగుంపు ధ్వనించు శ్రీ.ప్ర.15) ఇత్యాదిగా చెప్పబడినట్లు బ్రహ్మండనాథుడును తను పరమపదముమొదలగు వాసస్థానములను వీడి ఇచట అవశుడైపడియుండునట్టి భోగ్యతను ఈ ఊరు కల్గియున్నది; అంతకుమించి శయనించియున్నవాని అమలత్వము. **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** (రా.యు. 18-3) అను విభీషణవిషయమైన వార్తను

విలువకల్గినదిగా చేయుటకు **"శెల్వవిబీడణుక్కు వేఱాక నల్లానై"** అనువిధమున భక్తిసంపదను కలవిభీషణునకు విలక్షణుడైన స్నేహితుడై, "దక్షిణమున లంకగల దిక్కును కటాక్షించి" (శ్రీ.ప్ర. 19) అనునట్లు దక్షిణదిక్కుకు అభిముఖుడై పరుండియున్నాడు. ఇట్లు శ్రీరంగనాథుడు పరుండుట అన్నివిధముల నికృష్టుడనైన నావంటివారిని శుద్ధులను చేయుటకు అగుటచే ఆ స్వామి సౌలభ్యము గొప్పది. వీనికి మించినదికదా శ్రీరంగనాథుని ముఖము.

**ముకత్తు - "సఖ్యః పశ్యత కృష్ణస్య ముఖమ్"** (వి.పు. 5-20-54) అనియు, "నీముఖము మాయమందిరము సుమా !" (గోదా.సూ. 2-4) అనియు పల్కురీతిలో కేవలము ముఖమే ఆకర్షకమై యుండును. పూర్వము తాము దర్శించిన అధరవైలక్షణ్యము ఇచటను అనువృత్తమగుటచే ఆ అధరమునుకల ముఖమును వేరుగా పల్కుచున్నారు అనియు అనవగును. అంతకుమించి, **"అత్యరుణేక్షణమ్"** (వి.పు. 5-20-54)అనునట్లు రెండు లోతైన కాలువలవంటివి స్వామి నేత్రములు. చంద్రమండలములో రెండు తామరలు పూచినట్లును, ఒక తామరలో రెండు తామరలు పూచినట్లును ఉన్నట్టి నేత్రద్వయము అనియును భావము.

**కరియవాకి** - పుండరీకమువలె తెల్లగానున్న నేత్రములకు పరభాగ శోభను కల్గించు రెండు కనీనికలను (నల్లగుడ్డును) కల్గినవై అని అర్థము. (లేక) కాటుకవలన నల్లగానున్నవి అని, కన్నులను దర్శింపగానే తాపత్రయతప్తుల సకలతాపములను తీర్చునట్లు చల్లగా నున్నవి అనియు భావము. దాహార్తులైన వారి(ముఖమున) నోటిలో నీటి ప్రవాహమును ప్రవహింపచేయు నట్లున్నవనియు తాత్పర్యము. ఇవి అన్నియు **"కరియ"** శబ్దస్వారస్యములు.

**పుడైపరన్దు** - స్వామినేత్రములు సముద్రమును తటాకము కావించినట్లు గొప్ప వైశాల్యమును కల్గియున్నవి. సహజముగా కనుపించు విస్తృతికి మించి, రెండువైపుల సంకుచితములై యుండక, విస్తరించి, వైశాల్యమును కల్గిగనవి అని భావము. అవిద్యాదులను పోగొట్టి అనుభవింపచేయు కార్యములవలన కల్గిన వైశాల్యము కూడ మిచట భావనీయము.

**మిళిర్న్దు** - మెఱసి కృపాపూర్ణములైయుండుటచే, తీరమును ఒరసికొనుచు, తూములద్వారా పోలేక, అలలతో కల్గి కదలునట్టి నదులవలె మెఱయుచున్నవని భావము. దర్శింపవలెనను దివ్యసూరియొక్క ఆతురతకంటె, వీరిని అనుగ్రహింప గల్గుటచే ఏర్పడిన స్వామి కన్నులలోని త్వర దీనిచే సూచింపబడినది.

**శెవ్వరియోడు** - స్వామి నేత్రములు శ్రియఃపతిత్వమువలన, వాత్సల్యము వలన ఎట్లుగా నుండును. లేక, పరమైశ్వర్యముచేత, వాత్సల్యము చేతను ఎట్లుగా నుండును.

**నీణ్డ** - అకర్ణాంతము విస్తరించిన స్వామినేత్రములు కృపాప్రవాహము దీర్ఘమైయుండుట, తమవరకు కటాక్షము ప్రసరించి అనుగ్రహించుటయును దీనిచే సూచితములు. **"కృపయా పరయా కరిష్యమాణే సకలాంగం కిల సర్వతోఽక్షినేత్రే, ప్రథమం శ్రవసీ సమాస్తృణాతే ఇతి దైర్ఘ్యేణ విదంతి రంగనేతుః"** అనుచు పరాశరభట్టరు శ్రీరంగనాథుని నేత్రములు ఆకర్ణాంతము వ్యాపించి, దీర్ఘములై యుండుటకు ఒక హేతువు ఉత్ప్రేక్షించిరి. అది ఏమనగా - "చేపకు నీటిని పోయునట్లు (మీనపానీయ న్యాయమున) నిత్యసూరులకును సేవను అనుగ్రహించుచున్న పరమపదనాథునకు కన్నులు రెండై, రామకృష్ణాద్యవతారములను ఎత్తి, గుహాదులు, విదురాదులు మున్నగువారికి కొందటికి అల్పకాలము దర్శనమొసగి, అనుగ్రహించి, రిక్తహస్తములతో తిరిగి పోయిన వానికిని రెండుకన్నులై, సంసారమును సమూలముగా పోగొట్టిన గాని లేవను అని శ్రీరంగమున అర్చారూపియై, ఆయాభక్తుల నైచ్యమును గమనింపక, దర్శనమొసగుచున్నట్టి శ్రీరంగనాథునకును కన్నులు రెండై యుండుటయా? శ్రీరంగనాథుని కృపనుచూడగా శరీరమంతయు నేత్రములుగా కావలసియున్నది కదా !'' అని తలచి, అన్నిమండలములును (ప్రాంతములును) తన అధీనములోనే ఉండవలెనని తలచు ప్రభువులు ముందుగా తమకు సన్నిహితులైన సామంతులను నిర్జించునట్లు, శ్రీరంగనాథుని మిగిలిన

అంగములన్నిటి యందును తామే వ్యాపింపవలెనని తలచిన ఆ స్వామినేత్రములు తమ ప్రక్కన నున్నవి కర్ణములగుటచే వానిని జయించి, వానివైపు ఆక్రమింపవలెనని ముందుగా, వానితో స్పర్ధించుచున్నట్లున్నది - స్వామి నేత్రములు ఆకర్ణాంతమును వ్యాపించుట.''

**అప్పెరియవాయకణ్‌కళ్** - దర్శించువారి సామర్థ్యమునకు మించి యున్నవి అగుటచే **"అప్పెరియవాయకణ్‌గళ్"** అనుచున్నారు. **"ఇది"** అని ప్రత్యక్షనిర్దేశమునుచేయక, పరోక్షనిర్దేశము చేయవలసినట్టి భోగ్యతాప్రకర్షను కల్గియున్నవి ఆనేత్రములు. పూర్వము **"పరన్దు, నీణ్డ"** అని ఆయామ, విస్తారములను తెలుపుటనుబట్టి ఇచటి **"పెరియ"** శబ్దము భోగ్యతాప్రకర్షను సూచించుచున్నదనదగును. ఆభోగ్యతాతిశయముచే **"అప్పాఞ్జశన్నియమ్"** (పల్లాణ్డు-1) అని భట్టనాథులు పరోక్షనిర్దేశముతో పల్కినట్లు, తమ దృష్టిదోషము స్వామి నేత్రసౌందర్యమునకు సోకునో ఏమో ! అని ముఖమును ప్రక్కకు తిప్పుకొని దివ్యసూరి ఇట్లు పరోక్షనిర్దేశమును చేయుచున్నారు. లేనిచో దర్శనసమానాకారముగా తోచు స్వామి నేత్రములను పరోక్షనిర్దేశము చేయుట అసంగతముకదా !

**ఎన్నై** - గొప్ప జ్ఞానిని సుమా నేను ! స్వామినేత్రములు నా వైదగ్ధ్యమును అపహరించి, మౌగ్ధ్యమును కల్గించినవి. ఒకనిచే కొట్టబడిన వానినే మరొకడు మరల ప్రహరించినట్లు, క్షేత్రభోగ్యతాదులు, స్వామి అమలత్వాదులు నన్ను బాధించుచుండగా, అది చాలదన్నట్లు స్వామి నేత్రములు ఇంకను నన్ను బాధించుచున్నవి- అను హార్దభావము 'ఎన్నై' అనుసర్వనామశబ్దముచే ద్యోతిత మగుచున్నది.

**పేదమై శెయ్‌దనవే** - శ్రీరంగనాథుని నేత్రములు రామబాణములవలె దేహమును మాత్రము వధించి వదలుటలేదు. జ్ఞానమునుకూడ హరించుచున్నవి. ముందుపాశురమున **"ఎన్నై చ్చినైకవర్‌న్దదువే"** అనుచు జ్ఞానప్రసరద్వారమగు మనస్సును అపహరించుట తెలుపబడినది, ఇచట జ్ఞానము అపహరింపబడుట

తెలుపబడినది. జ్ఞానాపహరణమనగా -స్వామి సౌందర్యములో చిక్కి అలమటించుట. "స్త్రీల విశాలమ్మైన చూపులనెడి వలలలో చిక్కుకొని అలమటించు నన్ను" (శ్రీ.ప్ర.16) అనునట్లు సౌందర్యవతులైన స్త్రీల చూపులను వలలో చిక్కి, నశించు నాకు తనపట్ల ఆదరమును కల్గించి, **"మతి ఎల్లామ్ ఉళ్ కలజ్గి"** (మనస్సు అంతయు లోపల కలత చెంది- శఠ.సూ. 1-4-4) అనురీతిలో జ్ఞానమంతయు లోలోపలకూడ కలత చెందునట్లు చేసినవి.

**ఎన్నై పేదైమైశెయ్దనవే** - "అతడు తన కన్నులతో పవిత్రములగునట్లు కటాక్షించునని" (శఠ.సూ.) చెప్పబడు, ఆ కటాక్షములకు లక్ష్యమైనవారికి తెలివి కలుగవలసియుండగా, నాకున్న జ్ఞానము కూడ నశించినది. ఇక **"తామరైకణ్గళాల్ నోక్కాయ్"** (తామరనేత్రములతో కటాక్షింపుమా ! -శఠ.సూ. 9-2-1) అను ప్రార్థించువారు అందఱు అందముగా ప్రార్థింపవచ్చును. (ఈ సంగతి తెలిసిన ఎవరును ఇక అట్లు ప్రార్థింపరని హార్దభావము) ఇందు శ్రీరంగనాథునియందు నృసింహావతారసన్నివేశమును కలదని ఈ దివ్యసూరిచే తెలుపబడినది.

**మునివాహనభోగము :**

తమను **"జితం తే పుండరీకాక్ష"** (జితంతే 1-1) ఇత్యాదిగా జయించి, స్వామిపాదములలో వాలునట్లుచేసి, అనంతరము కైంకర్యానుభవరసమును పైంపొందించిన స్వామి తామరసనేత్రములకు తాము అధీనులైన క్రమమును ఆశ్రితవిరోధినిరసన వృత్తాంతమును దృష్టాంతీకరించుటద్వారా దివ్యసూరి ప్రస్తుతగాథలో వర్ణించుచున్నారు.

**పరియవాకి వన్దవుణనుడల్ కీణ్డ** - అన్నిలోకములందున్న చీకటిని ఒకచోట పేర్చి దానికొక రూపమును కల్పించినట్లు, అతిస్థూలమైన నల్లని శరీరమును కలవాడై, మహామేరువు నడచివచ్చినట్లుగా వచ్చి ఎదిరించిన,బలమైన బాహువులను కల హిరణ్యకశిపుని "బలిసిన భుజములను కల హిరణ్యకశిపుని మాత్సర్యము వృద్ధిచెందుటకు కారణమైన అతని అద్వితీయమైన దేహమును"

(తిరుచ్చంద. 62) అనురీతిలో గొప్పదగు అతని దేహమును ఒక అరటిమట్టను వలె అవలీలగా రెండుగా చీల్చినవాడు. **(అమరర్క్కరియ వాదిప్పిరాన్)-** దేవతలు తనచే సృష్టింపబడినవారై, ఉపకారముచేయబడినవారు. తాను వారికి కారణభూతుడై (ఆదిశబ్దార్థము) ఉపకారకుడైయున్న (పిరాన్ శబ్దార్థము) స్థితిని వారు తెలియకపోవుటచే, వారికి ప్రహ్లాదునివలె దరిచేరి దర్శింప వీలుకానట్లున్నవాడు (అమరర్క్కరియ శబ్దార్థము) అని అర్థము. **(అరజ్గత్తమలన్ ముకత్తు)-** దోషములకు స్థానమైన ఈ సంసారములో దివ్యవిమానముతో పాటు వేంచేసి, "అందము అతిశయించిన తోటలచే చుట్టబడియున్న శ్రీరంగమను మహానగరములో వేంచేసియున్న తండ్రీ ! ఇక నీ దయను తప్ప వేరొక దానిని రక్షకముగా భావింపను" (కలివైరి.సూ. 11-8-8) అనిభావించు దివ్యసూరుల వంటివారు తనపాదములనుచేరి ఆశ్రయించి ఉజ్జీవించునట్లు వారి దోషములనన్నిటి పోగొట్టి, అందుచే మిక్కిలి వెలుగొందునట్టి అందమునుకల శ్రీరంగనాథుని యొక్క (అరజ్గత్తమలన్ శబ్దార్థము) **"కోళియై తామరై"** (తన అందమే తనకు ఆభరణముగా కల తామరలవంటి నేత్రము- శఠ.సూ. 7-7-8) ఇత్యాదిగా కీర్తింపబడిన గొప్పఅందమును కల్గినదై, చంద్రుడు, తామరయును ఒకటియైనట్లున్న ముఖములో, **(కరియవాకి. . . అప్పెరియవాయ కణ్గళ్)** సాటిలేని నీలరత్నమువలె నున్న కనీనికల (కంటిలోపల నున్న నల్లగుడ్డు) కాంతిచే నీలోత్పలవర్ణములై (కరియవాకి శబ్దార్థము), ఆశ్రితులను చూచుటవలన కల్గిన రీతిచే వికసించిన తామరపూవులవలె నున్నవై (పుడైపరన్దు శబ్దార్థము), తనకు దగ్గరకు వచ్చినవారందరియందును ఆదరమును తోచునట్టి ఉల్లాసమును కల్గినవై (మిళిర్న్దు శబ్దార్థము), అనన్యభక్తులపట్ల అనురాగమును స్పష్టీకరించుచున్నట్లున్న ఎఱ్ఱనిరేఖలతో వ్యాప్తములై (శెవ్వరియోడు శబ్దార్థము), స్వభావసిద్ధములైన వెడల్పును, పొడుగును కల్గినవై (నీణ్డ శబ్దార్థము) యున్న నేత్రములు అని ఈ ప్రయోగభావము. **'అప్పెరియ'** అను పరోక్షనిర్దేశమునకు ఇపుడు చూచినంతమాత్రమే కాక, శాస్త్రవేద్యమై అంతులేని భోగ్యతాప్రకర్షను కల్గినవనియు తాత్పర్యము చెప్పనగును. **(ఎన్నై పేదమై శెయ్దనవే)-** ఈ అనుభవరసములో మునిగిన నన్ను తగనిది అగు ఏ జ్ఞానానుష్ఠానమునకును అనర్హుడనగునట్లు చేసినవి.

9. **ఆలమామరత్తినిలై మేలొరుపాలకనాయ్**
**ఞాలమేళ్లుముణ్డా నరజ్గత్తరవినణైయాన్**
**కోలమామణియారముమ్ ముత్తుత్తామముమ్ ముడివిల్ల దోరెళ్లిల్**
**నీలమేని ఐయో ! నిఱై క్కొణ్డదెన్నెఞ్జినైయే**

మా = గొప్పదైన, ఆలమామరత్తిన్ = మర్రిచెట్టుయొక్క, ఇలైమేల్ = (చిన్నదైన లేత) ఆకులో, ఒరు = ఒక, పాలకన్ ఆయ్ = బాలకుడై, ఞాలమ్ ఏళ్లుమ్ ఉణ్డాన్ = ఏడు లోకములను తన ఉదరములోనుంచుకొని రక్షించినవాడును, అరజ్గత్తు = శ్రీరంగములో, అరవు ఇన్ అణైయాన్ = ఆదిశేషుడను అందమైన పడుకలో నిద్రించువాడును అగు శ్రీరంగనాథునియొక్క, కోలమ్ = అందమైన, మా = గొప్పదైన, మణి ఆరముమ్ = రత్నములచే కూర్చబడిన హారములును, ముత్తుత్తామముమ్ = ముత్యాల హారములు, ఓర్ ఎళ్లిల్ = సాటిలేని అందమును కల్గినదియు, నీలమ్ = నల్లకలువవలెనున్నదగు, మేని = దివ్యదేహమును, ఎన్ నెఞ్జినై = నా మనస్సుయొక్క, నిఱై = అణకువను, కొణ్డదు = కొల్లగొట్టి పోయినది, ఐయో = దీనికేమి చేయుదును, ఏ = ఆశ్చర్యము.

ఊరును అంతటిని నశింపచేయు గొప్పయుద్ధమువలె, స్వామి మేని శోభ (లావణ్యము) స్వామి దివ్యాంగములను కలుపుకొనివచ్చి నా మనస్సును అపహరించినదనుట ఇందలి సారాంశము. ముందుపద్యములో **"కణ్గళ్ ఎన్నై ప్పేతైమైశెయ్దనవే"** అనుచు, **"బ్రహ్మదండప్రకాశానాం విద్యుత్సదృశవర్చసామ్, స్మరన్ రాఘవబాణానాం వివ్యథే రాక్షసేశ్వరః"** (రా.యు. 60-3) అనురీతిలో రామబాణముల వలె ఉన్నట్టి ఆశ్రీరంగనాథుని కటాక్షపాతములచే, "క్రీగంటిచూపులను తెక్కలుగల బాణములతో నామనస్సున నడుమలో నాటుకొనునట్లు ప్రయోగింపబడియున్న స్థితిని అతిక్రమించి బాధపడునన్ను" (గోదా. సూ. -13-3) అనునట్లు ఈ దివ్యసూరి పడునట్టి బాధను చూచిన భగవానుని దివ్యరూపము "వీరు ఏకాంతముగా పూలను సింగారించుకొని ఆనందించు వారివలె నా అవయవసౌందర్యమును ప్రత్యేకముగా

అనుభవించిరికదా ! కదంబమాలను అలంకరించుకొనువారివలె ఈ అవయవములకు ఆశ్రయమ్మైన నన్ను, ఆ అంగములతోపాటు కలిపి దర్శింపలేకున్నారు కదా ! మఱియు, మిగిలిన దివ్యసూరులవలె విస్తృతముగా వర్ణించి, ఆనందింవలేకున్నారు. అందుచే ఈ అవయవములతో, ఆభరణములతో కలసిన కలయికయొక్కఅందముతోపాటు, స్వాభావికమ్మైన సౌందర్యముచే ఏర్పడినశోభ అను నా సముదాయశోభను (లావణ్యము) వీరికి అనుభవింప చేయవలెను" అని తలచి, ప్రభువులు మూలబలయుద్ధములో (గొప్ప యుద్ధములో) శత్రుసేనను వధింపనెంచి, తమ చతురంగబలమును కూడగట్టుకొని కొంచెము కొంచెముగా కొందఱిని ఆక్రమించునట్లు, దివ్యావయవములను తనతో కలుపుకొని, తన సముదాయశోభను దర్శింపచేసి, **"ఉయ్ విడమేత్తైయర్క్కుమ్, అశురర్క్కుమ్, అరక్కర్కట్కుమ్ ఎవ్విడమ్"** (అబలలకు, అసురులకు, రాక్షసులకును ఉజ్జీవించుచోటు ఏది ?" -శఠ.సూ.7-7-6) అనునట్లు ఆక్రమించి, దివ్యసూరిచిత్తమును తనవైపు బలముగా లాగగా, తాము అందుచిక్కుకొని మనస్సును పోగొట్టుకొనుటను కవి తెలుపుచున్నారు.

**ఆలమామరమిత్యాది** - దీనికిముందు అయిదు పద్యములలో తమ దుష్కర్మలను సవాసనగా పోగొట్టిన తీరును తెలిపి, ఎనిమిదవ పద్యములో - **"పరియనాకి వన్ద వవుణవ్ ఉడల్కీణ్డ"** అనుచు పుట్టిన కర్మలకు మూలమైన అవిద్యను, తమోరూపుడైన హిరణ్యకశిపుని నఖములతో చీల్చి, నశింపచేసినట్లు, **"ఞానక్కై"** (జ్ఞానహస్తము)తో నిరసించెనని కదా కవి పల్కిరి ! ఈమాటలను వినినవారు, ఈ దేశము (లోకము) **"ఇరుళ్తరు మాఞాలమ్"** (తమస్సును కల్గించు గొప్పభూమి-శఠ.సూ. 10-6-1) ) అగుటచే "తెలివిని కల్గించు పరమపదము" (శఠ.సూ.) నుండి సర్వేశ్వరుడు తానే అవతరించినను అతనికి కూడ శోకమోహములను కల్గించు శక్తి కల్గినది. కాలమును చూడగా (కలికాలమగుటచే) **"అప్రజ్ఞాదండలింగాని"**అనునట్లు, ఉన్న జ్ఞానమును సైతము పోగొట్టి, విపరీతమైన అనుష్ఠానమునకు తగిన గుర్తులను కల్గియుండును. దేహమును చూడగా, **"భగవత్స్వరూపతిరోధానకరీమ్"** (శరణాగతి గద్య)

అనునట్లు భగవత్స్వరూపమును కప్పిపుచ్చి, విపరీత జ్ఞానమును కల్గించునదియై యుండును. వేదాంతజ్ఞానముచే తప్ప వేరు దేనిచేతను ఆ అజ్ఞానము పోదు. మీకు ఆ వేదాంతశ్రవణమునకు అధికారమే లేదు. **"వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః"** (తైత్తి. నా. 10-22) అని స్తుతింపబడు నిష్కృష్ట వేదాంతజ్ఞానమునుకల పెద్దల వద్దకు పోయి, సేవించి, వారికి అంతేవాసియై, ఈ అర్థములను విని తెలియుటకు వీలులేని తక్కువ జన్మను కలవారు మీరు. అందుచే ఈదేశమిట్టిది - ఈ కాలమిట్టిది - ఈ దేహమిట్టిది - మీ జన్మ ఇట్టిది. ఇట్లుండగా, సర్వజ్ఞుడైన గీతాచార్యులు భగవద్గీత పదునెనిమిది అధ్యాయములలో "ధర్మమంతయు ఉపపాదించి, వివరింపగా" (శఠ.సూ. 7-7-6) అనునట్లు సమస్తధర్మమును అనుగ్రహింపగా, **"దైవీసంపద"** (గీతా. 16-5) ను కల్గిన, అభిజాతుడైన అర్జునుడు దానిని విని, **"నష్టో మోహః స్మృతిః లబ్ధా"** (గీతా. 18-73) అని పల్కినట్లు, మీరును మీ అజ్ఞానాదులు పూర్తిగా నశింపగా, జ్ఞానము కల్గినట్లు పల్కుచుంటిరి. ఇది సంభవింపవీలులేనట్లున్నది కదా !" అని ప్రశ్నింపగా, ప్రళయకాలమున ఈ జగత్తు అంతయు క్లేశమును పొందనుండగా, తాను చిన్నబాలకుడై యుండి దానిని అంతటిని, తన బొజ్జలో నుంచుకొని, "ఆ మఱ్ఱి ఆకు ప్రళయసమయమున ప్రళయసముద్రజలములో నుండెనా ? పరమ పదముననా ? భూమిపైనా ? తోటలు చుట్టి యున్న పర్వతమునెత్తిన వాడా ! బదులు పల్కుము !" (సరో. సూ. 69) అని అభిజ్ఞులు ప్రశ్నించునట్లున్న అద్వితీయమైన మఱ్ఱిఆకులో శయనించి, ఈ జగత్తునంతటిని రక్షించిన ఆ అఘటిత ఘటనాసామర్థ్యము కలవానికి నా విరోధిని పోగొట్టి, నాకు జ్ఞానమును కల్గించుట అసంభవముగా నున్నదా !" అని సమాధానమిచ్చుట ఇందలి అంశము.

**ఆలమామరత్తి నిలైమేల్** - **"పాలావిలై"** (గోదా.సూ. 13-2) అనునట్లు గుచ్చిన పాలుకారునట్లున్న లేత మఱ్ఱిఆకు అని అర్థము. **"మా మరమ్"** (గొప్పవృక్షము) అను ప్రయోగము (మంగళవారమన్నట్లు) విపరీత లక్షణావృత్తిని కల్గినదై చిన్న చెట్టు అని అర్థమిచ్చును. **"ఇలైమేల్"** అనుటచే ఆ లేత ఆకులో ఇముడునట్టిది బాలకుని చిన్నరూపము అని స్ఫురించును.

**ఒరుపాలకనాయ్** - యశోద చంటి బిడ్డడు కూడ ప్రౌఢదశలో నున్నాడని చెప్పతగిన అద్వితీయుడైన బాలకుడై అని తాత్పర్యము. యశోదాస్తనంధయుడగు కృష్ణుడును మెురటువాడనిపించునట్లు ఇతని బాల్యము వచ్చుని పొలుకారుచుండును. ఇక పై స్వామియొక్క బాల్యమువిలాసమును కవి ఉపపాదించు చున్నారు.

**ఞాలమేழ்ழுముణ్డాన్** - చిన్న పిల్లలు తమకు ముందున్న వస్తువులనన్నిటిని తీసికొని నోటిలో పెట్టుకొందురు. అట్లే, **"మణ్డాడు వరై యేழ்ழుమ్ . . . ఈశవ్"** (కలివైరి.సూ. 2-10-1) అనునట్లు సప్తలోకములను, వీనిని చుట్టియున్న సముద్రము లేడింటిని, కుల పర్వతములను ఏడింటిని, మిగిలిన పదార్థములనన్నిటిని గ్రహించి, గ్రసించెను. దేవతిర్యఙ్మనుష్యస్థావర రూపమును జగత్తు నంతటిని ఆరగించుచుండగా, ఒక స్థావరము (మఱ్ఱిచెట్టుమాత్రము) మిగిలియుండి, దానిలేత ఆకును వాసస్థానముగా గొని నిద్రించుట అను ఈ అఘటితములను ఘటింప చేయువానికి, దేశ-కాల- దేహ - జన్మముల కారణముగా నున్న నా నైచ్యమును గమనింపక, నాకు జ్ఞానమును కల్గించి, ఇందులకు విరోధులైన అజ్ఞానాదులను పోగొట్టుట మిక్కిలి అఘటితముగా నున్నదా ? నాచే అజ్ఞానాదులను పోగొట్టుకొనుట అశక్యము కాదు కాని, అతనికి అసాధ్య మున్నదా ? నన్ను వశీకరించుకొనుట ప్రళయకాల వటపత్రశాయిత్వ రూపములోని అఘటిత ఘటనా సామర్థ్యముతో పోలినది కదా !

**అరజగత్తరవినణైయాన్** - ప్రళయములో సర్వజగత్తును రక్షించుటకు మఱ్ఱిఆకుపై పరుండినట్లే, సంసారమను ప్రళయమునుండి నన్ను రక్షించుటకై స్వామి శ్రీరంగమున శయనించెను. ప్రళయసముద్రప్రవాహమునుండి ఆ వటపత్రశాయియే ఇచటకు శ్రీరంగనాథుడై కొట్టుకొనివచ్చెను, అంతియే. ప్రళయసమయమున జగత్తు నంతటిని గ్రహించిన స్వామికి ఏమగునో ఏమో ! అని భయపడువారి భయశంక తీరునట్లు శయనించియున్న చోటు ఇది (శ్రీరంగము).

**అరవినణైయాన్** - ఆ ప్రళయసముద్రమున ఈ జగత్తు నంతటిని

తన ఉదరమున నుంచుకొని, తాను చిన్ని శిశువై, మఱ్ఱిఆకు అను పేరునుమాత్రముకల చిగురుటాకులో వానస్థానమును గొని శయనించియున్నాడు. ఇట్లు గొప్పజగత్తునంతటిని ఆరగించినను తృప్తినొందకున్నాడు. ఆరగించిన బ్రహ్మాండముల మహత్త్వము చేతను, ఉదరము చిన్నది అగుటచేతను, బ్రహ్మాండములను మింగినపుడు ఉదరము ఉబ్బుటయో, లేక, లేతమఱ్ఱిఆకులో చోటు చేసికొని శయనించినచో, ఆచిగురుటాకు ప్రళయప్రవాహములో కొట్టుకొనిపోవుటయో సంభవించినచో ఏమి చేయవలెను ? అని భయపడనవసరములేనట్లు "శ్రీరంగము అను గొప్పనగరములోని గొప్ప ఆలయమున. . . తమస్సు నశించునట్లు ప్రకాశించు . . . అనంతుడను గొప్ప పడుకపై వృద్ధిచెందిన గొప్పరూపముతో శ్రీరంగనాథుడు శయనించియున్నాడు." (కులశేఖర సూ.1-1) అచట మంగళమును పాడు వారులేరను కొఱతలేదు. పడుకగానున్న ఆదిశేషుడు. **"చింతామణి మివోద్వాంత ముత్సంగేఽనంత భోగినః"** (శ్రీ.రం. 1-8) అనునట్లు జగదుపాదానమైయున్న, అద్వితీయమైన చింతామణిని (శ్రీరంగనాథుని) ఉమిసి, "దీనిని ఎవరైనను అపహరించినచో ఏమి చేయవలెను ?" అని ఆ స్వామిని తన ఒడిలో నుంచుకొనుట, భరిణలో ఒకానొక నీలమణి పెట్టినట్లుండును. "విషమును నోటిలోగల ఆదిశేషుడను పడుక" (గోదా.సూ. 10-1) అని, "అచట పరమపదములో నిత్యుల, ముక్తుల సందడిని విని దానిని అసురుల కోలాహలముగా భ్రమించి, అస్థానేభయ శంకతో స్వామికి రక్షణను కల్గించుటకై నోటినుండి విషాగ్నిని వెడల గ్రక్కు, అందమైన కోపమును కల ఆదిశేషుడు" (భక్తిసార.సూ.-10) అనియు పల్కునట్లు ఈ వస్తువునకు (భగవానునకు) ఏమి ప్రమాదము వచ్చునో ఏమో ! అని తన ఆదిశేషుడు ఫణామండలములతో విషాగ్నిని వెలువరించుచు, రక్షించుటచే భయపడనవసరము లేదు. అవాంతర ప్రళయములో చిక్కుకొనినవారిని తన ఉదరమున నుంచుకొని స్వామి రక్షించెను. సంసారమను మహాప్రళయములో ప్రవేశించినవారిని **"శ్రీమాన్ సుఖసుప్తః"** (రా.యు. 38-25) అనియు, **"కిడన్దదోర్ కిడక్కై"** (పరుండిన అద్వితీయమైన శయన సన్నివేశము- శ్రీ.ప్ర. 23) అనియు

పల్కురీతిలో తన శయన సౌందర్యమును చూపి కాపాడెను. ఇట్లు శయనించి యున్న శ్రీరంగనాథుని దివ్యదేహమున్న తీరును ఇకపై తెలుపుచున్నారు.

**కోలమామణియారముమ్** - శ్రీకౌస్తుభమువలె గొప్ప విలువగల్గినదై, గొప్ప మాణిక్యములతో చేయబడి, దేహమునకు అలంకారమైన హారమును,

**ముత్తుత్తామముమ్** - త్రిసరము, పంచసరము, సప్తసరము (సరము అనగా పేటలు) అని చెప్పబడు, దివ్యదేహముయొక్క సౌకుమార్యమునకు తగిన చల్లదనమునుకల ముత్యాలహారములును,

**ముడివిల్లదోరెళ్లిల్** - అవధికానరాని అందమునుకల నల్లని మేని అపరిచ్ఛేద్యమైన, అద్వితీయమైన సముదాయశోభను కల్గినదై,

**నీలమేని** - ఈ ఆభరణములచే, సముదాయశోభచే తనకొక అందము కలుగనవసరము లేకుండునట్లు, ఈ ఆభరణములకే అతిశయమును కల్గించునట్లు"**మల్కునీలచ్చుడర్ తళైప్ప**" (శఠ.సూ.) అనునట్లు, "**నీలతోయదమధ్యస్థ**" (పురుషసూక్తే) మైన విద్యుల్లేఖవలెనున్న రూపము. "**ద్రుతకనకజగిరిపరిమిళదుదధి ప్రచలితలహరివత్**" (శ్రీరంగరాజస్తవే. పూర్వ.) అన్నట్లు ఆదివ్యదేహము సందర్శించినను జిగేలు మనిపించి, ఆకాంతిని తట్టుకొని నిశితముగా దర్శించినచో చూచువారి కన్నులు చల్లబడునట్లు కాటుకను పూసికొన్నవిధమున నల్లగా నుండునుకదా ! స్వామిరూపము. అతని ఆనందము అనవధికమగుటయును దివ్యరూపముయొక్క వైలక్షణ్యమువలనకదా !

**నిఱైకొణ్డదెన్నెఞ్జినైయే** - నాహృదయముననున్న పూర్తిని అపహరించినది; నా మనస్సులోని గాంభీర్యమును పోగొట్టినది. ఈ జగత్తు కరణకళేబరములను కోల్పోకుండ తన ఉదరమున కాపాడువాడై స్వామియుండగా, అతనికి అభిమతమైన ఆరూపము నా కరణమును (మనస్సును) నశింపచేసినది ఏమి ఆశ్చర్యము !

**ఐయో** - పచ్చని కంచుకమును తొడిగికొని, తన అందమును దర్శింప చేసి, స్వామి నాకున్న నిగ్రహమును అంతటిని అపహరించెను. నేను అన్నిటిని

దర్శింప వలెనని యుండగా, అనుభవమునకు సాధనమైన నామనస్సును స్వామిలావణ్యము తన వైపు బలాత్కారముగ లాగుకొనినదే ! అయ్యో ! అని దివ్యసూరి వాపోవుచున్నారు.

**మునివాహనభోగము :**

శ్రీరంగనాథుని అవయవశోభలో మగ్నులైన దివ్యసూరి తమయొక్క మనస్సున కూడ క్లేశపడి అంతటా వ్యాపించి, సర్వావయవశోభతో కూడిన సముదాయశోభచే (లావణ్యాచే) పూర్ణమై, నిత్యానుభవమందలి శ్రద్ధచే పూర్వము తనచేపొందబడినదిగా స్మరింపబడిన పూర్తిని కోల్పోయినదనుచు ఈగాథలో పల్కుచున్నారు. ఇచట దేశికుల వివరణానుసారము "నిఱై" అను శబ్దమునకు పూర్తి అని అర్థము.

**ఆలమామరత్తి నిలైమేల్ ఒరుపాలకనాయ్** - ఒక అవాంతర ప్రళయములో **"ఆలన్ను వేలై నీరుళ్లదో ? విణ్ణదో ? మణ్ణదో ?"** (వటపత్రము అపుడు ప్రళయజలములో నుండెనా ? పరమపదముననా ? భూమియందా ? సరో.సూ. 69) అనునట్లు తెలియరానిదై అనంతశాఖలను కల్గినదొక వటవృక్షముయొక్క ఆకులో (ఆలమామరత్తిన్ ఇలైమేల్ శబ్దార్థము), తల్లియు తండ్రియు లేని ఒక అద్వితీయబాలకుడై (ఒరుపాలకనాయ్ శబ్దార్థము)

**ఞాలమేళ్లుముణ్డాన్** - సర్వలోకముల స్థితి చెడకుండునట్లు మార్కండేయమహర్షి చూచురీతిలో వానిని తన ఉదరమున నుంచినవాడు. **(అరఙ్గత్తరవి నణైయాన్)** ప్రళయకాలములో బాలకుడై, మఱ్ఱిఆకులో శయనించుటతో పాటు, సర్వకాలములందు ప్రత్యక్షముగా కన్పించునట్లు శ్రీరంగవిమానములో, నిత్యసూరు లందఱిలో శ్రేష్ఠుడైన అనంతునిపై **"ఉలకుక్కోర్ తనియప్పన్"** (లోకమునకొక అద్వితీయనాథుడు శఠ.సూ. 8-1-11) అనునట్లు తన సంతానమగు బ్రహ్మాదులు ఆరాధింప శయనించుటతోపాటు భేదములేక, కారణత్వ-రక్షకత్వాదులను తనయందు దర్శింపతగినట్లున్న శ్రీరంగనాథుని అనిఅర్థము. **(కోలమామణియారముమ్)** - దేవేరులకు అంతఃపురమైయున్న వక్షఃస్థలమునకు ఒక రత్నప్రాకారమువలె అందమైనదై, గొప్పదై,

గొప్పవిలుకల రత్నములతోకూర్చిన హారమును, ముత్యాలసరములును (ఏకావళి, త్రిసరము, పంచసరము మొదలుగాగల ముత్యాల సరములను) అనిభావము.

**ముడివిల్లదోరెళ్ళిల్ నీలమేని** - వీనికి అతిశయమును కల్గించునదియై, అనంతమై, అద్వితీయమైన అభిరూప్యమును (అందమును) కల్గినదై, కాలమేఘమువలె శ్రమనుతీర్చునట్టి దివ్యదేహమును అని అర్థము. లేక, ఆభరణములకు కూడ అంతులేని కాంతిని కల్గించునట్లున్న నీలమేని అనియును అర్థము. **(ఐయో ! నిఱైకొణ్డదెన్నెఞ్జినైయే)** - ప్రత్యేకముగా దివ్యావయములను అనుభవించిన నా మనస్సును సముదాయానుభవముచే పూర్వము పొందిన, పూర్ణత్వాభిమానగర్భమైన గాంభీర్యమును కోల్పోయినదై "ఈ పూర్ణానుభవమునకు విచ్ఛేదముకల్గినచో ఏమి చేయుదును ?" అను సంధేహముతో **"పిరివిన్ఱి ఆయిరమ్ పల్లాణ్డు"** (విచ్ఛేదములేక సహస్రవర్షములు మంగళమగుగాక !) అని మంగళాశాసనమును నిత్యసాపేక్షముగా ఆచరించునట్లు చేసినది.

**10.** **కొణ్డల్వణ్ణనై కోవలనాయ్ వెణ్ణెయ్**
**ఉణ్డవాయన్ ఎన్నుళ్ళమ్ కవర్న్దానై**
**అణ్డర్కో నణియరఙ్గన్ ఎన్నముదినై**
**క్కణ్డకణ్కళ్ మత్తొన్ఱినై క్కాణావే**

కొణ్డల్ వణ్ణనై = నీటిని పానముచేసిన మేఘమువంటి రూపమునుకల్గినవాడును, కోవలన్ ఆయ్ వెణ్ణెయ్ ఉణ్డవాయన్ = గోపాలకుడై జన్మించి వెన్నను ఆరగించిన నోటిని కలవాడును, ఎన్ ఉళ్ళమ్ = నా మనస్సును, కవర్న్దానై = కొల్లగొట్టినవాడును, అణ్డర్కోన్ = నిత్యసూరులకు నాయకుడును, అణిఅరఙ్గన్ =(భూమండలమునకు) అలంకారమైన శ్రీరంగమున శయనించియున్నవాడును, ఎన్నముదినై = (నాకు పరమభోగ్యమగు) అమృతమై యున్నవాడును అగు శ్రీరంగనాథుని, కణ్డ కణ్గళ్ = సేవింపగల్గిన (నా) కన్నులు, మత్తొన్ఱు ఒన్ఱినై = వేఱుదేనిని (చివఱకు పరమపదనాథునికూడ), కాణా = దర్శింపవు, ఏ = ఆశ్చర్యము.

శ్రీరంగమునకు బయటనున్న దేశములలోని జనులు రజస్తమః, ప్రాచుర్యమును కలవారై, శబ్దాదివిషయములందు ఆసక్తినికలవారై, అట్టి విషయసుఖములు సాక్షాత్తుగా లభింపకపోవుటచే అర్థమును ఆర్జించుటకు ప్రయత్నించి, **"పెరియతోరిడుమ్బైపూణ్డు"** (గొప్ప దుఃఖములను ఆరోపించుకొని శ్రీ.ప్ర.5) యుండుటను, ఈ ఊరిలోనున్నవారు పరమసాత్త్వికులై, నిరతిశయభోగ్యుడైన శ్రీరంగనాథుని సేవించుచు, "దాస్యమును చేసి, అమృతపానమొనర్చి" ఆనందించిన తీరును చూచి, **"వరం హుతవహజ్వాలా పంజరాంతర్వ్యవస్థితి:, న శౌరిచింతావిముఖజనసంవాసవైశసమ్"** (శౌనక సంహిత) అనునట్లు భగవానుని గూర్చి చింతిపని ఈ ఊరికి బయటనున్న వారితో దివ్యసూరి కలువలేకపోయిరి. ఇక శ్రీరంగమును గమనించినచో **"సర్వపుణ్యమయో దేశ:"**, అనురీతిలో **"పవిత్రాణాం హి గోవింద: పవిత్రం పరమ:"** (భార. వన. 88-27) అని పరమపావనుడైన శ్రీరంగనాథుడుకూడ "పరిశుద్ధుడా ! జల సమృద్ధినికల శ్రీరంగమున నున్నవాడా !" (శఠ.సూ. 7-2-4) అను రీతిలో ఈ ఊరిసంబంధముతో పావనుడయ్యెనని చెప్పతగిన వైలక్షణ్యమును కల్గినదగుటచే, నేను ఈ ఊరిలోనికి ప్రవేశించుట ఈ ఊరికి దోషావహమని తలచి, దివ్యసూరి **"అఙ్గుణ్ణ్రేనల్లేన్ ఇఙ్గుణ్ణ్రేనల్లేన్"** (అచట నున్నవాడను కాను, ఇచట నున్నవాడను కాను-శఠ.సూ. 5-7-2) అనురీతిలో ఇతరుల నైచ్యమువలన అచటకు పోలేక, తమ నైచ్యానుసంధానముచే ఇచటకు రాలేక మధ్యస్థులై, **"ఉత్తరం తీర మాసాద్య ఖస్థ ఏవ వ్యతిష్ఠత"** (రా.యు. 17-8) అను విభీషణుని వలె **"అకమకిళ్గుమ్ తొణ్డర్ వాళ్గ"** (సదా మనస్సున ఆనందమును కల దాసులు ఉజ్జీవించునట్లు - కులశేఖరసూ.-1-10) అనునట్లు భక్తులు ఉజ్జీవించుటకై **"అన్బొడుతెన్ తిశైనోక్కి"** (ప్రేమతో దక్షిణదిక్కును కటాక్షించుచు- కులశేఖర సూ. 1-2) శయనించు శ్రీరంగనాథుని దృష్టిపాతమునకు పాత్రమైన కావేరీనదియొక్క దక్షిణతీరమున నిలచిరి. శ్రీరంగనాథుడును **"ఈశ్వరోఽహ మహం భోగీ కోఽన్యోఽస్తి సదృశో మయా"** (గీతా. 16-14) అని జనులందరు అహంకారగ్రస్తులై, శబ్దాదివిషయప్రవణులై

బాధ పడుచుండగా, ఈ దివ్యసూరిఇట్లు నాయందు ప్రావణ్యమును కల్గియున్నారు కదా ! అని మిక్కిలి సంతోషించి, **"నిమగ్న ఆప: ప్రవణ:"** (అమరకోశే) అనునట్లు దివ్యసూరివరకు తనకటాక్షము ప్రసరింపచేసి, **"నిహీనానాం ముఖ్యమ్"** (శ్రీరంగరాజస్తవే- పూర్వ) శరణమగు తన శ్రీపాదములను వీరి మనస్సున **"ఎన్కణ్ణినుళ్లనవొక్కిన్దవే"** అని ప్రత్యక్షసమానాకారముగా ప్రకాశించునట్లు అనుగ్రహించెను. ఆపాదములను స్మరించిన దివ్యసూరి తమ మనస్సు జ్ఞానాస్పదమగుటచే, అంతటితో ఆగక, ఆపాదములకు పైనగల పీతాంబరము, కటి ప్రదేశముల పొందికను ఆమూలాము అనుభవించిరి. పిమ్మట 'జ్ఞానకరణమైన నా మనస్సును నేనును దర్శించునట్లు సృష్టించినది స్వామి నాభీకమలము కదా !' అని దానిని దర్శించిరి. "పరత్వసౌలభ్యములకు పట్టము కట్టియున్నదానను నేనే కదా !" అనునట్లున్న ఉదరబంధము మనస్సులో స్ఫురింపగా, దానిని సేవించి, దానికి పైనగల వక్షః స్థలము తనహారాద్యా- భరణములను, ఆ లక్ష్మీదేవికి, ఆ హారాద్యాభరణములకు ఆశ్రయమైన కంఠమును దర్శించిరి. ఆ పిమ్మట, స్వామి తన నోటితో **"సర్వభూతేభ్య: అభయం దదామి"** (రా.యు. 18-33) అని పల్కువానివలె తోచగా, స్వామిని సేవించు దేవేరులతో పాటు అందఱు **"వాయఴకర్ తన్నైమ్మయుఞ్జుతమ్"** (అందమైన అధరముకలస్వామి విషయమున భయపడుచున్నాను. గోదా. సూ. 10-3) అనునట్లు కన్నులు చెమ్మగిల్లి మంగళాశాసన పూర్వకముగా అనుభవింపతగినట్లు స్వాభావిక సౌందర్యమునుకల స్వామి అధరమును దర్శించిరి. ఇట్లు స్వామి దివ్యాంగములను కవి దర్శించుచుండగా మధ్యలో దివ్యాయుధములును తమమనస్సును ఆకర్షింపగా, వానిని సేవించిరి **"అభయం దదామి"** (రా.యు. 18-33) అనునట్టి పల్కులను సమ్మతించు చల్లని కటాక్షములనుకల స్వామి నేత్రములను సేవించి, పాలు, పండ్లు, ఖండశర్కరలవంటి రస్యవస్తువుల కలిపి ఆస్వాదించువారివలె, ఈ అవయవముల కలయికవలన కల్గిన సౌందర్యమును, స్వాభావికమైన అందమును కల దివ్యదేహముయొక్క సముదాయశోభను ఇంతవరకు దివ్యసూరి అనుభవించిరి.

ఈ దివ్యసూరియొక్క ఇట్టి మానసానుభవమును, మనఃపూర్వకమైన వాచికానుభవమును చూచిన శ్రీరంగనాథుడు, వ రు ఇట్లు తనగుణములలో ఆకృష్టులగుటను గాంచి, **"ద్రష్టవ్యః సర్వదేహిభిః"** (విష్ణుతత్త్వే) అను రీతిలో వారిని ఆస్థితిలో దర్శింపనెంచి తన ఆలయములోనికి పిలిపించుకొనునట్లు వారి పట్ల అభినివిష్టుడయ్యెను. **"క్షణేఽపి తే యద్విరహోఽతిదుస్సహః"** (స్తోత్రరత్నే- 56) అనునట్లు తనను ఒక పర్యాయము దర్శింపవలెనను ఆశనుకలవారిని క్షణకాలమును విడచియుండని వాడగుటచే, దివ్యసూరిని తన ఆలయములోనికి పిలిపించుకొనజూచెను. తానే సాక్షాత్తుగా పోయి కొనివచ్చెదమన్నచో **"అసంకేత మనాలాపమ్"** అని చెప్పబడు అర్చామూర్తి సంకల్పమునుండి విరమించు కొనవలసియుండుటచే అట్లు శ్రీరంగనాథుడు చేయుటవీలుకాదు, ఇక వీరే స్వయముగా రావలెనన్న అదియును వీరికి స్వప్రయత్నములో చేరును. కావున స్వరూపహానియైయున్నది. కావున, సుగ్రీవుని పురస్కరించుకొని **"ఆనయైనమ్"** (రా.యు. 18-34) అని శ్రీరాముడు విభీషణుని అనుగ్రహించినట్లు, వీరిని ఎవరి ద్వారానైనను పిలిపించుకొనవలెనని శ్రీరంగనాథుడు తలచెను. విభీషణుడు రాజ్యమును కాంక్షించిన వాడగుటచే, అతనికి దగ్గరలో లక్ష్మణుడున్నను అతనిని కాదని, అతనివలె రాజ్యమును కోరిన సుగ్రీవుని ద్వారా అనుగ్రహించినట్లు, **"శెష్టదామ్ ఎన్ శిన్దనైయే" "అడియేనుళ్లత్తిన్నుయిరే", "ఎన్నుళ్లత్తుళ్ నిన్నులాకిన్దదే"**, నిఱైకొణ్డదెన్నెఞ్జినైయే" అనునట్లు ఈ దివ్యసూరి భగవన్మననపరులగుటచే, అట్లే భగవన్మననపరులై, శ్రేష్ఠులైయున్న వారిద్వారా పిలిపించుకొనవలెనని తలచి, తనకు దగ్గరలోనున్న లోకసారంగమహామునిని చూచి **"ఆనయైనమ్"** (రా.యు. 18-34) అని ఆజ్ఞాపించెను. లోకసారంగమునియు ఎల్లప్పుడు శ్రీరంగనాథుని సేవించుచుండుటచే, శ్రీరంగనాథుడు అభిజన విద్యాశీలములచే పూర్ణులైనవారిని చూచి, ఏకాంతమున - 'నీచ జాతిలో జన్మించినవారైనను, వారునా భక్తులైనచో వారికి నమస్కరింపుము' (శ్రీ. ప్ర. 42) అని ఉపదేశించుటను వినియుండుటచే, "నీ అష్టాక్షరీ మహామంత్రమును అభ్యసించి, గ్రహించినది నీదాసులకు

దాసుడనగుటయే'' (కలివైరి. సూ. 8-10-3) అనియు, "పంకజ నేత్రుని స్తుతించు సిరిని కలవారు ఎవ్వరైనను వారు అనంతములైన జన్మ లన్నిటియందు మమ్ములను పాలించు శ్రేష్ఠులు'' (శఠ.సూ. 3-7-1) అనియు ఇత్యాదిగా పలు దివ్యసూరులు పలుకగా వినియున్న వారగుటచే, శీఘ్రముగా పోయి దివ్యసూరిని పిలిచి, శిరసావహించుచు వచ్చిరి. దివ్యసూరియు "శ్రీరంగనాథుని గౌరవము (అనుగ్రహము) అడ్డుకొనరాదు'' అనితలచి, మునివాహనులై గర్భాలయములో ప్రవేశించి, శ్రీరంగనాథుని పాదములను సేవించిరి. **"ఆవిర్బభూవ భగవాన్ పీతాంబరధరో హరిః"** (వి.పు. 1-20-14) అనునట్లు పూర్వము స్తోత్రవరుడైన ప్రహ్లాదునకు ప్రత్యక్షమై, అపేక్షితములను అనుగ్రహింపగా, అతడు రాజ్యపరిపాలనాదులలో కాలక్షేపమును చేయగల్గినవాడగుటచే, అతడు చూచుచుండగనే **"తత్రైవాంతరధీయత"** (భాగ. 7-10-31) అని అంతర్ధానముఅయ్యెను. పిమ్మట ప్రహ్లాదుడును ఆవిధముగనే కాలక్షేపమును చేసెను. కాని, వీరు ప్రహ్లాదునివలె కాక, అనన్యసాధనులై, అనన్యప్రయోజనులై యుండుటచే మా విశ్లేషమును సైపజాలరు అని తలచిన శ్రీరంగనాథుడు తన స్వరూపాదులను దర్శింపచేయగా, దివ్యసూరియు వానిని దర్శించి సంతోషించిరి. ఇట్లు వారు మానసానుభవమును పొందుదశలో **"ఆతి, విణ్ణవర్కోన్", "నీతివానవర్", అరఙ్గత్తమ్మాన్"** అనియు **"ఉలకమళన్దణ్డముఱ నివర్న్ద నీణ్ముడియ నన్దు వేర్న్దనిశాశరర్కై క్కవర్న్ద వెఙ్గణైక్కాకుత్తన్"** అనియు, **"విరైయార్పొళ్షిల్ వేఙ్గడవన్"** అనియు తన పర - వ్యూహ - విభవ - అర్చావతారములను తన విషయమున అనుసంధించుటచే వీనిని ప్రత్యేకముగా దర్శింపవలెనను అపేక్ష వీరికి లేదనుటను తన హృదయమునందు తలచినవాడైన స్వామి "తలచువారి హృదయమున నుండి వారితలపును తెలిసికొందువు'' (శ్రీ.ప్ర.34) అనునట్లు వీరి హృదయమును తెలిసినను, వీరిని పరీక్షింపగోరి, 'వీనిని వీరికి ప్రత్యేకముగా దర్శింపచేసి, వీరు అనుభవించు తీరును గమనించెదము' అని తలచెను. అట్లు అనుభవించుట పురుషార్థము (పురుషునిచే అర్థింపబడినది) కావలసియుండుటచే, "వీరి అపేక్షను తెలిసి

చేయవలెను. లేనిచో నా పరత్వాదుల పేరు చెప్పగానే, **"ఏరార్ముయల్విట్టు కాక్కైప్పిన్ పోవదే"** (అందమైన కుందేలును విడచి కాకి వెంట పోవుటయా ?- శిఱియతిరువడల్) అను కలివైరిసూరి వలె నిరాదరించుటయో, భక్తాంఘ్రిరేణులవలె **"అచ్చువై పెరినుమ్ వేణ్డేన్"** (ఆ ముక్తానందము పొందిననున వలదు. శ్రీ.ప్ర. 2) అని నిరాదరించుటయో చేయుదురా ? లేదా ? తెలియవలెను" అని తన మనస్సున ముందుగానే తలచి దివ్యసూరిమనస్సును గ్రహించెను. అపుడు ఈ దివ్యసూరి "సముద్రమున గోష్పాదమంతచోటు ఉండునట్లు, (అర్చావతారము గుణపూర్ణము, దానితో పోల్చిన మిగిలినవి గోష్పాదములు, అందుచే పరత్వాదులలోనున్న గుణములన్నియు అర్చావతారమున కలవు) **"పూర్ణమ్"** (కఠవల్లి) అను రీతిలో శ్రీరంగనాథుని యందు అన్నియు ఉన్నవి కదా ! అందుచే నాకు శ్రీరంగనాథుని తప్ప వేరెవ్వరిని సేవింప ఆసక్తిలేదు. నాకున్నను, శ్రీరంగనాథుని సేవించిన నాకన్నులు అన్యమును దేనిని చూడగోరదు - అనుట ఇందలి ప్రమేయము.

**కొణ్డల్ వణ్ణనై** - దీనిచే నేత్రముల ఆనంద విషయము ఎట్టిదో తెలుపబడినది. **" న మాంసచక్షుభి రభివీక్షతే తమ్"** **(ఋగ్వేదే)**, **"న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్"** (తైత్తి. నా. 1-10) అనబడు లక్షణమునువదలి, తన రూపమును చక్షువులతో దర్శించునట్లు స్వామి చేసిన ఉపకారమును అనుసంధించి, ఈ విశేషణమును ప్రయోగించిరి. లేక, తమ పరవ్యూహ విభవావతారములను వీరు దర్శింపవలెనని స్వామి తలచిన తలపును ఎఱిగి "ఇదేమి ఔదార్యము !" అని విద్దులై, ఆ ఔదార్యమును స్మరించి **" కొణ్డల్వణ్ణనై"** అనుచున్నారు. **"నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి"** (నీతిశతకే) అనునట్లు ఔదార్యగుణమునకు మేఘము ప్రసిద్ధముకదా ! లేక, సాంసారికమైన తాపత్రయముచే ఆర్తినిపొందినవారి బాధ తీరునట్లున్నదై, **"ఆర్ద్రా శయాళు రివశీతలకాలమేఘః"** (శ్రీరంగరాజస్తవే.పూర్వ-82) అనునట్లు వర్షాకాలమేఘమువలెనున్న వర్ణమును కలవాడనుచున్నారు లేక, శ్రమహరమైన రూపమును చూచి **"కొణ్డల్ వణ్ణన్"** అనుచున్నారనియు చెప్పనగును. **"వణ్ణమ్"**

అనుద్రావిడ పదమునకు స్వభావమని, వర్ణమని అర్థము. శఠకోపసూరియు **"ముకిల్‌వణ్ణనడియై యడైన్దు"** (మేఘవర్ణుని పాదములను ఆశ్రయించి - 7-2-4) అని ఏళ్ళిరి కదా !

**కోవలనాయ్ వెణ్ణెయుణ్డవాయన్** - ఇచట మేఘమునుకంటే శ్రీరంగనాథునకు కల వైలక్షణ్యము సూచితము. మేఘము ఆకాశములో దూరముగా నుండి, నీటిని వర్షించును, అంతియే. భగవానుడు అట్లుకాక, గోపాలురతో, గోపికలతో భేదములేక వారితో ఒకేనీరువలె కలసి, వారికి తన రూపసౌందర్యమును సర్వస్వ దానమును చేయుననుట **"కోవలనాయ్"** అనుటచే వ్యక్తమగుచున్నది. వైకుంఠమునగల పరరూపముతో వచ్చి వెన్నను ఆరగించినచో నిత్యసూరులు అచట స్వామికి అర్పించిన చందనపుసువాసన గుబాళించి, వెన్న తిను విషయము అందఱికిని తెలియును. శ్రీరాముడై అవతరించినదశలో స్వామిని పరత్వముతో, ప్రభువుగా చేసి, కొందఱు పొగడుటచే అపుడు, వెన్నను ఆరగించుటకు వీలులేదు. అందులకై ఇట్లు **"కోవలనాయ్ వెణ్ణెయుణ్డ వాయన్"** (గోపాలుడై వెన్నను ఆరగించిన నోటిని కలవాడు) అయ్యెను. దశరథ చక్రవర్తి తన రాజ్యాధికారమును అనుభవించుటకై నాకొక పుత్రుడు కావలెనని **"మహతా తపసా రామ"** (రా.ఆర.66-3) అనునట్లు నోమునోచి శ్రీరాముని పుత్రునిగా పొందినట్లు శ్రీనందగోపాలుడును "అరణ్యమున సంచరించి, కావలియున్న ఇండ్లలో పెరుగును ఆరగించి నేయినిత్రాగునట్లు నందుడు పొందిన పుత్రుడు" (కలివైరి. సూ. 5-5-3) అనునట్లు రేపల్లెలోని గవ్యసమృద్ధి (పాలు, పెరుగు, వెన్న) పాడుకారాదని తలచి, దానిని భుజించుటకై నోమునోచి, కృష్ణుని పుత్రునిగా పొందెను (ఈస్వారస్యము **కోవలనాయ్** - అనుప్రయోగమును హేతువుగా చేసి అన్వయించుట ద్వారా స్ఫురించును)

**వెణ్ణెయుణ్డ వాయన్** - శ్రీ రంగనాథుని చుబుకమును ఆఘ్రాణించినచో ఇపుడును పాత వెన్నవాసన వచ్చునట. ఆశ్రితుల సొత్తు అగుటచే వారి స్పర్శనుకల వెన్నలేనిదే నిలువలేనను భావముతో ఇప్పటికిని ఆ పాత వాసన

నోటిలో వ్యక్తమగునట్లు శ్రీరంగనాథుడు శయనించియున్నాడు కాబోలు. **"కరుప్పూరమ్ నాఱుమో కమలప్పూనాఱుమో"** (స్వామిఅధరము కర్పూరగంధమును కల్గినదా ? లేక కమలముయొక్క సుగంధమును కల్గినదా గోదా సూ. 7-1) అని సందేహింపవలసిన అవసరము లేనట్లు స్వామి నోటిలో పాత వెన్న వాసన వచ్చుచున్నది.

**వెణ్ణెయుణ్డ వాయన్ ఎన్నుళ్లమ్ కవర్న్దానై** - గోపాలుడై వెన్నను ఆరగించినట్లు, మేఘవర్ణుడై నా హృదయమును హరించినవాడు. యశోదాదేవి మనస్సులో కల్గియున్న ఆదరమును నా మనస్సునుంచి ఆనందించినవాడు. రేపల్లెలో గోపికలు వెన్నను ఉట్లలోపెట్టి దానిని ఎవరును దొంగిలింపకుండునట్లు రక్షణార్థము దారమును గురుతుగా కట్టిపోవుదురు. అట్లు కట్టిన దారము చెడకుండగనే ఉట్టిలోనున్న పాత్రలలోగల వెన్నను అరగించినట్లు, **"అరఙ్గత్తమ్మాన్ కళ్వాన్"** (శ్రీరంగములోని దొంగ) నా గుర్తు చెడకుండగనే నా మనస్సును అపహరించెను అని భావము.

**ఎన్నుళ్లమ్ కవర్న్దానై** - పెట్టిన గుర్తు పోకుండగనే "వెన్నను మింగి పాత్రను రిక్తముగా చేసి" (భట్టనాథ-సూ. 2-9-1) అనునట్లు పాత్ర పాడుకాకుండ వెన్నను ఆరగించినట్లే, నా శరీరము గుర్తు పాడుకాకుండ నా మనస్సును అపహరించెను. పాత్ర మిగిలినను వెన్న పూర్తిగా మాయమైనట్లు ఈ దివ్యసూరి శరీరము మిగిలినను వారి మనస్సు మాయమయ్యెను.

**ఎన్నుళ్లమ్ కవర్న్దానై** - అర్జునునివంటి దైవీ సంపదతో అభిజాతులైన పెద్దలు అందఱు తమ మనస్సులు వీని యందు (భగవానునియందు) నిలువ వలెనని తలచి, అట్లు చేయులేక **"చంచలం హి మనః కృష్ణ"** (గీతా. 16-5) అనిరి. గొప్ప గాలిని దారముతో కట్టవచ్చునేమో ! కాని, నా మనస్సును ఏ విధముగానైనను నియంత్రింప వీలులేదు అన్నట్లు మనస్సుయొక్క చాంచల్యమును, అజ్ఞానమును కల్గించు పొగరును ఆవిధముగా అట్లు ఉండును. అట్లు "నిలువనీయని" (కలివైరి. సూ. 1-1-4) నా మనస్సును తనపట్ల నాకు

అపేక్షలేకున్నను నేను కూడ ఎఱుగని విధమున అపహరించి, స్వామి తనవైపు చేర్చుకొనెను.

**అణ్డర్‌కోన్** - ఇట్లు గోపాలురతో, గోపికలతో, వారికంటె తక్కువ వారైన మీతోడను ఎట్టి భేదము లేక కలసి, వెన్నను, మీ మనస్సును అపహరించుటకు కారణము- బయట ఎవ్వరును లేకుండుట చేతనా ? లేక తన కొఱత చేతనా? అన్నచో, "ముడుచుకొనుటకు తగిన విలక్షణములైన పూలసరములను పరిశుద్ధముగా గైకొని నిత్యసూరులు పవిత్రజలములతో అభిషేకమును సమర్పించి ధూపమును సమర్పించుచుండగనే" కదా "చేర్చి యుంచిన వెన్నను దొంగిలించి, ఆరగించి వేంచేయ" (తిరువిరుత్తమ్-21) అవతరించెను. కావున అట్టి కొఱత వలన కాదు. నాయందలి అభినివేశము చేతనే అని తాత్పర్యము. లేక **"అణ్డర్"** అనుటకు గోపాలురని, అండాతర్వర్తులని చెప్పవచ్చును.

**అణియరజ్గన్** - నా మనస్సును అపహరించి **"శేణుయర్ వానత్తు"** (ఉన్నతమైన పరమాకాశము-శఠ.సూ. 5-3-9)నకుపోయి ఉండుటకాక, కన్నులతో చూడగల్గునట్లు సంసారమునకు అలంకారము వంటి శ్రీరంగమునకు వచ్చి శయనించియున్నాడు. సంసారులు క్లేశపడకుండుటకు కదా ఈ శయనము.

**అణియరజ్గన్ ఎన్నముదినై** - దేవతల అమృతమువలె ఉప్పురసమై, అందనంత ఎత్తులో నుండునదికాదుకదా శ్రీరంగనాథుడను అమృతము. బ్రహ్మ మొదలగువారికి కారణభూతుడై, నాకు మృత్యువురాకుండ కాపాడు అమృతమైయుండును.

**అణ్డర్‌కోన్ అణియరజ్గనెన్నముదినై** - "స్వరూపరూప గుణములలో అవధిలేనివాడు, అరుదైన అమృతమువంటివాడు" (తిరునెడు-14) అని కీర్తింపబడినవాడు కదా శ్రీరంగనాథుడు.

**అములినైక్కణ్డకణ్గళ్** - ఈ కన్నులు శ్రీరంగనాథుని సేవింపకున్నచో, బయటకు పోగలవు. (వేరొక వస్తువును చూడగలవు), దృశ్యము (శ్రీరంగనాథుడను దృశ్యము) అరకడుపును నిండించునదియైనను(చాలనిది

అయినను) వేరొక వస్తువును చూడగలవు. ఈరెండు హేతువులు లేవు కావున పూర్ణానుభవమును పొందినవి నా కన్నులు.

**కణ్డకణ్‌గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే** - అమృత పానమును చేసినవారిని పాలు, అన్నము తృప్తిపఱచునా ? హనుమానుడు **"భావో నాన్యత్ర గచ్ఛతి"** (రా. ఉత్త. 10-45) అనినట్లు, శ్రీరంగనాథుడు తనను కేశాదిపాదాంతముగా దర్శింపవలెనని కోరినను నేను శక్తుడను కాను. (అనగా వేరొక అర్చామూర్తిని సేవించుటలో ఆసక్తి లేకపోవుటయేకాక శ్రీరంగనాథుని సేవించుటలో పాదాదికేశాంత క్రమముననే తప్ప వేరు క్రమమైన కేశాదిపాదాంతమునను ఆసక్తి లేదు)

**"ఎన్నుళ్లమ్ కవర్న్దానై"** అనుటచే మనస్సును అపహరించిన తీరును కవిపల్కిరి. **'కణ్డకణ్‌గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** అనుటచే తమ దృష్టిని చూఱగొన్న తీరును పల్కిరి, మిగిలినదివ్యసూరులు చివరి పాశురములో తమపేరును సూచించినట్లు వీరు తమ పేరును చివరి పద్యములో సూచింపకుండుటకు కారణము ఏమనగా- వీరు భగవానుని దర్శించుటలోనే ప్రవణులై, తమను మఱచిపోవుటయే. ఇక, ఫల శ్రుతియు ఈ చివరి పద్యములో కానరాదు. ఏలఅన, ముముక్షువు ఆశించు ఫలము **"సదా పశ్యంతి"** (ఋగ్వేదే) (ఎల్లప్పుడు దర్శించుట) అగుటచే, అది ఇచటనే సిద్ధించుటచే, ఫలమునకు వేరొక ఫలము అవసరము లేదు కదా ! కావున చెప్పలేదు. ఈ నాకన్నులు అనన్యములైన బాహ్యావిషయములను దర్శింప వలసియుండుట ఇచట (శ్రీరంగనాథునియందు) కొఱత ఉన్నచోకదా ! అని దివ్యసూరి హృదయము.

శ్రీరంగనాథునియందు ఔదార్యము లేదని బయటకు పోవలసియున్నదా ? దివ్యరూపమున శోభలేదని పోవలసియున్నదా ? (ఇవి **కొణ్డల్‌వణ్ణనై** అను విశేషణముయొక్క అర్థములు) సౌశీల్యము లేదని పోవలసియున్నదా ? (**కోవలనాయ్** అనువిశేషణ శబ్దార్థము), నా మనస్సుకు రుచింపలేదని పోవలసియున్నదా? (**ఎన్నుళ్లమ్ కవర్న్దానై** శబ్దార్థము), పరత్వము

లేదనిపోవలసియున్నదా? (**అణ్ణల్‌కోన్** శబ్దార్థము), సౌలభ్యములేదని పోవలసియున్నదా ? (**అణియరజ్గన్** శబ్దార్థము), భోగ్యతలేదని పోవలసియున్నదా? (**ఎన్నముదినై** శబ్దార్థము), అనుభవమున కొఱత ఉన్నదని పోవుటయా (**మఱ్ఱొన్ఱినై క్కాణావే** - ప్రయోగ తాత్పర్యము).

**మునివాహనభోగము :**

ఇందు ఈ దివ్యసూరి **"అడియేన్"** (దాసుడను) అనుటతప్ప ఈ ప్రబంధము పరిసమాప్తిని చేయునపుడు తమ పేరును, ఊరును చెప్పుట మఱచునట్లు, తాము పొందిన అనుభవమునకు శ్రీరంగనాథుడు ఇకపై ఎట్టి ఆటంకము రాకుండునట్లు చేసిన క్రమమును చూచి, తమ ఆత్మావధియైన అనన్యానుభవ రసమును ముక్తుని సామగానపద్ధతిలో ఆలపించి, చిఱకాలముగా బాహ్యానుభవమును పొందుటవలన కల్గిన ఆర్తితీరగా, కృతార్థులగుచున్నారు.

**కొణ్డల్ వణ్ణనై** - సముద్రములోని జలమునంతటిని గ్రసించి, కావేరినదిమధ్యలో విశ్రమించిన ఒక కాలమేఘమువలె చూచువారికి శ్రమహరమైన రూపమునుకలవానిని అని అర్థము. మఱియు, జంగమస్థావరములన్నియు ఉజ్జీవించునట్లు జల- స్థల విభాగములేక కారుణ్యరసమును వర్షించు ఒక అద్వితీయమైన కాలమేఘముయొక్క స్వభామును, గొప్ప ఔదార్యమును కలవాడనియు అర్థము. వర్ణమును కలవాడని ఈ అర్థములో, స్వభావమును కలవాడని ముందు అర్థములో అర్థము.

**కోవలనాయ్ వెణ్ణెయుణ్డవాయన్** - ఎనిమిది- రెండు(అష్టాక్షరి-ద్వయము) అన్నచో ఏదియో తెలియని గోపాలకులను, గోపికలను రక్షించుటచే తన సర్వలోకరక్షకత్వము వ్యక్తమగునట్లు గోపాలరూపమునుపొంది, భక్తులు అభిమానించిన, ద్రవ్యమును అంతటిని తనకు ఇష్టమేనని తోచునట్లు అర్చారూపమును స్ఫురించి, వారు చేర్చియుంచిన వెన్నను **"శూట్టునన్మాలై"** (తిరువిరుత్తమ్ - 21) అనురీతిలో అప్రాకృత దివ్యానుభవమువలె అనుభవించి, దానిచే ఇపుడును ఆ పాతవెన్నవాసన తన నోటిలో వ్యక్తమగునట్లున్నవాడు.

ఎన్నుళ్లమ్ కవర్న్దావై - గోపికలు చేర్చిపెట్టిన వెన్నవలె వీరిమనస్సు శ్రీరంగనాథునకు నవనీతమయ్యెను కాబోలు. జ్ఞానముకల్గిన పిమ్మటకూడ నేను,నాది అను అహంకార-మమకారములు రూపొందినట్లున్న నామనస్సును తన రూపసౌందర్యముతో సౌలభ్య, సౌశీల్య, వాత్సల్యాదులతో వశీకరించి, ఇక నాది అనునది వీలులేనట్లు గ్రహించినవానిని అని భావము. **(అణ్డర్కోవ్)** -గోపాలకులను నియమింపదగినవాడైయున్న తన సౌలభ్యగుణము వ్యక్తమగునట్లు అణ్డాధిపతియైన బ్రహ్మమొదలు మిగిలిన అణ్డాన్తర్వర్తులైన దేవతలనందఱను స్వాధీనము చేసికొనిన సామిత్వ, స్వాతంత్ర్యాదులను కలవాడు. "ముడులు ఉన్నట్టి కురుచదారముతో యశోదచే బంధింప బడినవాడైనను", (మధురకవి సూ. 1) నిత్యసూరులకు భావింపవీలుకానివాడు అనియు అర్థము.

**అణియరజ్గన్** - నిత్యసూరులును తమ దేశములను వీడి, ఇచటకు వచ్చి సేవించునట్లు ఆకర్షణీయమైన అందమునుకల స్థానవిశేషములో (శ్రీరంగములో) నన్ను అనుభవపరశునిగా చేసినవానిని అని అర్థము. **(ఎన్నముదినై)** పరమపదమునందును, క్షీరాబ్ధిలోను, ఆదిత్యమండలాదుల యందును ఆయా స్థానములందున్నవారు అనుభవించునట్లు అమృతరూపిగా నుండుటయేకాక, "నీచుడను, ఎట్టి అతిశయమును లేనివాడను" (శఠ.సూ. 3-3-4) అగు నేనుకూడ అనుభవించునట్లు నాకు అసాధారణమైన, జరామరణాది ప్రవాహములను నిశ్శేషముగా పోగొట్టగల్గిన నిరతిశయ భోగ్యమైనవాడు. ప్రాకృతభోగములందు ఆసక్తులైన దేవతలు అనేక ప్రయాసలతో పొంది, అనుభవించు అమృతమువలెకాక, అనన్యప్రయోజనుడనై నేను కూడ ఎట్టి ప్రయత్నముచేయకనే పొంది అనుభవింప తగినట్లున్న విలక్షణమైన అమృతమువంటివాడు అనియును అర్థము. **కణ్డకణ్కళ్** - ఈ ప్రయోగమునందు నా అను అర్థమిచ్చు పదమును దివ్యసూరి ప్రయోగింపక పోవుటచే వారి నిర్మమత గోచరించుచున్నది. ఇట్లు బాధితానువృత్తి లేనట్టి

తత్త్వజ్ఞానమును కల్గి అన్నిటియందు నిర్మమతను కల ఈ దివ్యసూరి పూర్వము **"ఎన్కణ్"** అనీ, **"ఎన్ శిన్దనై"** అని, **"అడియేనుళ్ళమ్"** అనియు, **"ఎన్నుళ్ళమ్"** అనియును మమకారము స్ఫురించునట్లును ఏల పల్కిరి ? అనినచో, స్వతంత్రస్వామియైన ఈశ్వరుడు తనకు శేషభూతులైన చేతనాచేతనములలో స్వార్థముకొఱకు ఒక దానిని వేఱొకదానికి శేషముగా నిర్వహించినచో అతడున్న స్థితిని (భగవానుని స్థితిని) ఎఱిగి పల్కువారికి నిర్మమతతో కూడిన ఈ మమకారము అనభిజ్ఞుల (తత్త్వజ్ఞానరహితుల) మమకారమువలె దోషము కాబోదు. దీనికిముందు అంతయు బాహ్యావిషయములలో ప్రావణ్యమును కల్గినవై, వానిని చూచినపుడు ఆనందము, చూడనపుడు విషాదమును పొందినవైనను, ఇపుడు నిత్యదరిద్రులు నిధిని దర్శించినట్లు, అనంతగుణవిభూతివిశిష్టమైన (శ్రీరంగనాథుడను) ఈ మహానిధిని అనుభవించిన ఈ కన్నులు అని భావము.

**మఱ్ఱొన్ఱినై క్కాణావే** - ఈ దివ్యసూరి ప్రాప్తవిషయములో (భగవానునియందు) స్థిరమైన బంధమును కల్గియుండుటచే స్వామి పరిచర్యకొఱకు వచ్చి, ప్రక్కనే నున్నట్టి పద్మయోని మొదలగువారిని కూడ చూడరు అని భావము. **"పురుషాణాం సహస్రేషు యేషు వై శుద్ధ యోనిషు, అస్మాన్న కశ్చి న్మనసా చక్షుషా వాఽ ప్యపూజయత్"** (భార. శాంతి 344-54) అనునట్లు బ్రహ్మపుత్రులై, **"యూయం జిజ్ఞాసవో భక్తాః"** (భార. శాంతి 344-31) అను ఏకత -ద్విత -త్రితులపట్ల జ్ఞానులైన శ్వేతద్వీపవాసుల అనాదరమిచట స్మరణీయము. **"ప్రాప్య శ్వేతం మహాద్వీపం నారదో భగవా నృషిః, దదర్శ తానేవ నరాన్ శ్వేతాం శ్చంద్రప్రభాన్ శుభాన్, పూజయామాస శిరసా మనసా తై స్సుపూజితః"** (భార. శాంతి 346-1)అని నారదభగవానుని పర్యంతము వారి పరిచర్య తెలుపబడినది. **"ఉవాచ మధురం భూయో గచ్ఛ నారద మా చిరం, ఇమే హ్యనింద్రియాహారా మద్భక్తా శ్చంద్రవర్చసః, ఏకాగ్రా శ్చింతయేయు ర్మాం నైషాం విఘ్నో భవే దితి"** (భార. శాంతి 347-18,19) అని భగవానుడు పల్కిన సూక్తియు

ఇచట అనుసంధింప నగును. "చూచి, విని స్పృశించి, వాసన చూచి, రుచిచూచి గ్రహించు ఐదు ఇంద్రియములతో పొందు ఆనందము" (శఠ. సూ. 4-9-10)) అను ఐశ్వర్యానుభవము, "తెలిసికొన అరుదగు అంతులేని కైవల్యానందము" (శఠ. సూ. 4-9-10) అను ఆత్మానుభవ (కైవల్య) రసములోను తమకు ఆశలేకుండుటను దివ్యసూరి తెలిపిరనియు చెప్పవచ్చును. ఇంతియేకాక ఈ దివ్యసూరి ప్రధానమైన భగవదనుభవములో అవగాహించిన వారగుటచే శ్రియ: పతికి ప్రకారముగా తప్ప ఇకవేఱుదేనిని ప్రత్యేకముగా తాము దర్శింపకుండుటలో ఈసూక్తియొక్క తాత్పర్యమనియు చెప్పనగును. శ్రీరంగనాథుని రూపములో వేంకటాచలము మొదలుగాగల క్షేత్రములలో దర్శించిన అర్చావతారములను, రామకృష్ణవామనవటపత్రశాయి మొదలగు రూపములందు గల భోగ్యత అంతయు చేరునట్లు అనుభవించి, ఈ ఆభిరూప్యములో ఆసక్తినికల నాకన్నులు మిగిలిన పర-వ్యూహ- విభవాదులగు తన రూపములనన్నిటిని భగవానుడు కలిపి దర్శింపచేసినను, స్తన్యపాయియైన చంటిబిడ్డ తల్లి స్తన్యమునుతప్ప భోగ్యాంతరములందు ఆసక్తిని లేనివాడగునట్లు "భావో నాన్యత్ర గచ్ఛతి" (రా. ఉత్తర. 40-15) అనురీతిలో అవిఅన్నియు తమకు రుచింపవని పల్కుచున్నారనియు తాత్పర్యము. ఇది వీరి అనన్యప్రయోజనత్వ పరాకాష్ఠకు చిహ్నము.

**జయతు జయతు దేవో రంగనాథో రమేశ:**
**జయతు జయతు సూరి: పాణనామా మహాత్మా ।**
**జయతు జయతు కావ్యం తత్కృతం భక్తభోగ్యం**
**జయతు జయతు భక్తి శ్చార్తసంజీవనీయమ్ ॥**



## సంకేత సూచి

| | | |
|---|---|---|
| తైత్తి | - | తైత్తిరీయోపనిషత్ |
| ఛాందో | - | ఛాందోగ్యోపనిషత్ |
| సుబాల | - | సుబాలోపనిషత్ |
| రా | - | శ్రీరామాయణమ్ |
| భార | - | మహాభారతమ్ |
| భాగ | - | శ్రీభాగవతమ్ |
| నార. పు | - | నారదపురాణమ్ |
| మాత్స్య.పు | - | మాత్స్యపురాణమ్ |
| వరద | - | వరదరాజస్తవః |
| శ్రీరంగ.పు | - | శ్రీరంగరాజస్తవే పూర్వశతకము |
| శ్రీరంగ. ఉ | - | శ్రీరంగరాజస్తవే ఉత్తరశతకము |
| శఠ.సూ. | - | శఠకోపసూక్తము (తిరువాయ్‌మొళ్ళి) |
| భట్టనాథ.సూ | - | భట్టనాథ సూక్తము (పెరియాళ్వార్ తిరుమొళ్ళి) |
| సరో.సూ | - | సరోయోగి సూక్తము (ముదల్‌తిరువన్దాది) |
| భక్తిసార.సూ | - | భక్తిసార సూక్తము (నాన్‌ముకన్ తిరువన్దాది) |
| గోదా.సూ | - | గోదాసూక్తము (నాచ్చియార్ తిరుమొళ్ళి) |
| శ్రీ.ప్ర | - | శ్రీమాలికా ప్రబంధము (తిరుమాలై) |
| తిరునెడు | - | తిరునెడున్దాణ్డకము |
| తిరుచ్చంద | - | తిరుచ్చందవిరుత్తము |
| కులశేఖర.సూ. | - | కులశేఖర సూక్తము (పెరుమాళ్ తిరుమొళ్ళి) |

150

# భాగవత చతుశ్శ్లోకి

సంస్కృత వ్యాఖ్య

శ్రీ బెల్లంకొండ రామరాయకవి

**(1875-1914)**



**ఆంధ్ర 'చాతురీ' వ్యాఖ్య**

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,

తిమ్మసముద్రము

